చ. అరయఁగ సర్వనిర్జరగణాతతశక్తిసమూహమూర్తియై
పరగెడు నే మహేశ్వరిప్రభావమున జ్జగముల్చరించు న
ప్పరమవధూటి కంబికకుఁ బన్నుగ మ్రొక్కెద మేము భక్తి నా
సురమునిపూజ్య దేవి బహుశోభనము ల్దయ మాకు నీవుతన్.

ఉ. శ్రీవనితావిభుండును సరసీరుహగర్భుఁడు శంకరుండు నే
దేవిప్రభావము న్బలముఁ దేజము నిట్లని చెప్పనేర రా
దేవి సమస్తదానవులఁ ద్రెక్కొని లోకములెల్ల నెప్పుడు
న్గావఁగ బుద్ధిసేయుతను గారుణికత్వధురీణచిత్తయై.

ఉ. భూరిసముద్యదిందురుచిఁ బోల్చి పటుభ్రుకుటీకరాళమై
దారుణకోపతీవ్రమగు తావకవక్త్రము చూచినప్డ యా
సైరిభదానవుండు వెసఁ జావమి చోద్యముగాదె భైరవీ!
యేరికిఁ బ్రాణముల్నిలుచునే కుపితాంతకదర్శనంబునన్.

చ. సుజనులయందు లక్ష్మియయి సూరిజనంబులయందు బుద్ధియై
కుజనులయం దలక్ష్మియయి గోత్రపవిత్రులయందు లజ్జయై
ద్విజవరులందు శాంతియయి విస్ఫురణం జెలువొందు దేవి కే
ము జయజయధ్వను ల్సెలఁగ మ్రొక్కెద మర్థిఁ ద్రిలోకరక్షకై.

మ. మము రక్షింపుము దేవి! నీకరమున న్మానై వెలుంగొందు చ
క్రమున న్గార్ముకశింజినీరవమున న్ఖడ్గంబున న్శాతశూ
లమున న్సంతతఘంటికాధ్వనిఁ గృపోల్లాసంబు శోభిల్ల ని
త్యముఁ బూర్వాపరదక్షిణోత్తరదిగంతస్థప్రదేశమ్ములన్.

ఉ. దావశిఖప్రతాపులగు దైత్యుల వేఁడిమిఁగుందినప్పు డే
దేవికి మేము మ్రొక్కెద మతిస్థిరభక్తిఁ బ్రశంసచేసి యా
దేవి దయార్ద్రభావమున దిగ్గన మాకుఁ బ్రసన్నయై ప్రమో
దావహలీలఁదాల్చి వెస నాపదలెల్లను బాపుఁగావుతన్.

ఉ. ధర్మవిరోధులైన బహుదైత్యులఁజంప ననేకరూపము
ల్పేర్మిమెయి న్ధరియించి యిటు భీమరణం బొనరించి గెల్చితీ
నిర్మలభూతిమై నెగడనేర్పరి యెవ్వతె నీవుదక్క దుః
ఖోర్మికరాశిసంసృతిపయోనిధిబాడబమూర్తి! యంబికా!

—మారనమహాకవి.




# దేవీ !

శ్రీవిష్ణుశక్తీ! జగన్మూలశక్తీ! త్రిశక్తీ! మహాశక్తీ! రుద్రతేజమున ముఖమును, విష్ణుతేజమున భుజములును, విరించితేజమున చరణములుగా నొక్కదివ్యనారీరూపమును పొల్చినిల్చి శూలివలన త్రిశూలమును, చక్రివలన చక్రమును, ప్రజాపతివలన యక్షమాలయు అందిపొంది సింహవాహనవు, శార్దూలచర్మవస్త్రవునై భారతలోకకంటకుడగు మహిషాసురుని సంహరించితివి. అప్పటిభారతలోకులప్రస్తుతికి ప్రసాదసుముఖవై వారిచేత నెపుడు సంస్మృతవైతి వప్పుడు వారి యాపదలెల్ల హరియింప వరము ప్రసాదించియున్నావు. నాడు మొదలు నీవు నానాట వారికొఱకుగా ఎత్తినఅవతారములకు లెక్కలేదు.

మహిషాసురసంహారము జరిపిన కొలదికాలమునకు పిమ్మటనే దర్పదుర్దములైన చండముండులను దానవులను సంహరించి చాముండాభిధానమున భారతజగమునందు ప్రఖ్యాతవైతివి. పిమ్మట దుర్ధర్షులైన శుంభనిశుంభలను రాక్షసులను జెండాడితివి. చూడాకిరీటము, దోర్వజ్రమును ప్రజ్వరిల్లగ వృత్రాదివీరారులను ద్రుంచితివి. నందగోపకులమున యశోదాగర్భమున ఆవిర్భవించి రాక్షసులను సమయించి వింధ్యాచలమునవసించి అదికారణముగా వింధ్యవాసిని యనబరగితివి. రౌద్రమగురూపమున భూతలమునపుట్టి వైప్రచిత్తాదిదైత్యులను లెక్కకు మీరి మెక్కుటచే నీదంతములు దాడిమీకుసుమములపోలె రక్తములైన హేతువున రక్తదంతియనుసార్థకనామమునువహించితివి. శతవర్షావగ్రహమువలన భారతజగము నిర్జలమైయుండ మహామునుల ప్రస్తుతినంది శతనేత్రములతో వారిని తిలకించి శతాక్షీనామమునందితివి. దుర్గముడను దుష్టాసురుని దునుమాడి దుర్గాభిధానము స్వీకరించితివి. భీమవేషముతో హిమాచలపర్వతమున వలసనెలకొని సంయమిత్రాణార్థము రాక్షసులనుచంపి భీమాహ్వయము అంగీకరించితివి. భారతలోకాపకారియగు వరుణుడనువాని భ్రమర్యాకారమున పరిమార్చి భ్రామరీసమాఖ్యను ప్రఖ్యాతివహించితివి.

ఇవ్విధమున నీవు భారతలోకమువారికి దనుజబాధలు ప్రవర్తిల్లుచున్నప్పుడెల్లను ప్రభవించి ఆదనుజులనుభక్షించి భారతభువనమును రక్షించుచున్నదానవు. ఈమేలును మఱువజాలక భారతీయులు ఏటేట నీకుగా పదిదినములు మహాలక్ష్మిపండుగలు గావించుచున్నారు. వారికి నీసాయము ప్రతిక్షణమును గావలసియున్నది. ప్రతికార్యమునందును వారు నీఆశీర్వాదమును అర్థింతురు.

భారతలోకమున కిప్పుడు అస్పృశ్యమహాసురుని బాధభరింపరానిదిగానున్నది. చెరువులచెంత, నూతులపొంత, విద్యాలయములవద్ద, దేవాలయములదగ్గర, రాజమార్గములందు—ఇచ్చట అచ్చట అని పేర్కొననేల?-ప్రతిఅంగుళస్థలమునందును ఆచారముఅనుసోదరుని వెంటబెట్టుకొని అస్పృశ్యమహాసురుడు నాట్యవిహారము సల్పుచున్నాడు. కోటలుపెట్టుకొనియున్న వానిసంహారమున భారతీయులు నీసాయము నర్థించుచున్నారు. నిన్నుకొలచిన వారికి సమ్యక్శుభోత్పత్తి, సంగ్రామాజేయపరాక్రమము, ప్రతిపక్షవ్రాతనాశము, సుశ్రీమాంగళ్యము గలుగుచుండుట భారతీయులకు అనుభవపునరుక్తము.

నీవు సర్వభూతాత్మికవు. నీవు సావిత్రివి. నీవు సంధ్యవు. నీవు గాయత్రివి. సర్వజనహృదయములందును బుద్ధిరూపమున నున్నదానవు. తలచినమాత్రమున నీవు ప్రతివారిబుద్ధిని మార్పగలవు. అస్పృశ్యమహాసురుని మాయలోనుండి విడివడునట్లు ఈ భారతలోకమువారికి ధైర్యము ప్రసాదింపుము. ఆచారమనుదాస్యమునుండి దూరముగా తొలగిపోవు తెంపరితనపుబుద్ధిని వారికి గలిగింపుము. నీకు మహాత్ముని ఉపవాసతేజమును, మాలవ్యని సనాతనబలమును, జయకరువాదశక్తియు, తేజబహదూరుని బహుళరాజకీయమును, రాజగోపాలాచారిసాత్త్వికసంపత్తియు, ప్రకాశముపంతులుప్రజ్ఞయు, మూంజీప్రభృతుల హైందవబలమును, అంబేత్కారు ఆత్మశక్తియు, యం. సి.రాజా క్షమాశౌర్యమును తోడురాగలవు. యుగయుగములుగ నీవిజయచిహ్నములుగ వెలయుచున్న విజయదశమీదినముల ముఖస్థమున నిన్ను మున్నిడుకొని మహాత్ముడు మొదలగువారు సేనానాయకులుగా భారతప్రజాసంఘము అస్పృశ్యమహాసురునిపై దండెత్తుచున్నది. అస్పృశ్యమహాసురునికి అనంతకాలమునుండి ఆయువుపట్టులైయున్న సుప్రసిద్ధదేవాలయములనుండి అతని కిప్పుడు వీడ్కోలుపత్రములు పరశ్శతములుగ వచ్చుచున్నవి. ముంతపొగకులోబడిన క్షయరోగివలె అతడు గిజగిజలాడుచున్నాడు. అతనిసంహారమున కిది కాలము. విజృంభింతువుగాక! నిన్నుగొలిచి రాముడు రావణుని సంహరించెను; పాండవులు శత్రుంజయులైరి. సురథుడు పోయినరాజ్యమును తిరిగిపొందెను. నిన్నునమ్మి భారతలోకము నేడు అస్పృశ్యమహాసురునిపై దూకినది. సమ్యగ్జయమును ప్రసాదింతువుగాక! మఱుసటిసంవత్సరపు దేవీనవరాత్రము లప్పటికి అతనిపొలుకువ హిందూదేశపుపొలిమేరలందుగూడ నుండకుండును గాక!

# ప్రేమబలి

శ్రీమతి టి. వి. సుబ్బాయమ్మ గారు

రత్నగర్భ బీటలువారుటచేనైన అభిక్యోతమున మండు కెండకాసినది. ముదిమిసంధెచాయలు ముసిరెను. శర్వరీభర్తకై లాసికతనపువిన్నవువు చాటుచుండెను. కసటుచీకటి ఆమెకుకీల్జడ. కాలుమెయిళ్ళదొన్నెలు దానివడిమిచక్కని తులుము గులాబీపూవు రెత్తులు. ఇవతాళించుసీతువుచే శరీరము "జవ్వ" మనిసంకటఁబడుచున్నది. నిలువెల్లను శీతలించినది కాపలెను! "బొటబొట" మని యొకటి రెండుకన్నీటిబిందువులు వర్షరూపమున నురిలినవి.

అట్టి వేళగానివేళయందు "శ్యామ" తనపటకుటీరసవిధనిషణ్ణ. మనస్స్వాస్థ్యములేదు కాబోలును! గుజగుజలాడు లేతసరకు మొక్కలనడుమనున్న వేదికపై కాళకొంగుపఱచుకొన్నది. ఆమెకు డాచేయియేతలదిండు. అంతలో "సెల్ల క్రిందు"గ మేనువాల్చినది. సార్థకముగ గబ్బిమబ్బుల నీక్షించుచున్నది. పిదప విషాదగీత మొకటి గాద్గద్యముతో కూవరాగాన మేళవింపసెంచెను.

పాపము! వాల్లభ్యస్వామిపిపాస! ఆమెజీవితమే యొకవిషాదగీతి. కనుఁగొలఁకులఁదొరఁగు కన్నీరు చెరువులలో రింగులుగఁజాలువారుచున్నది. అమెకు ఊరటపల్కువారెవరు?

పరిచితమైన కాళ్ళసద్దువిని చటాలున లేచినది. కట్టెదిరి నిట్టనిల్చ్వన కరుణాస్వరూపుఁడు— ప్రియునిసాక్షాత్కారము. అకాలమున అతనిఁగాంచఁగల్గినతోడనే శోకస్థాయిమారినది. అనంతశోకనివృత్తి కిక బీజోత్పన్నదశ యిదియే!

శ్యామ తటాలున మోకరిలినది. దయాళు వతఁడు లేవనెత్తెను. అప్రణయినీమూర్తి బాహులసందిళ్ళ వత్తుకొన్నదతనిని. ఆమె కేశములు, వ్రేళ్ళతో చిక్కుఁదీయునట్లు నిమిరి భ్రూమధ్యమున మూర్కొనినాడతఁడు. దీనికి అగాధతరత మోనిశ్శబ్దమే సాక్షి.

"స్వామీ! ఈజన్మ కింతియేగదా! నాజీవకళిక ప్రేమస్నేహమునంతయూ నింకించుకొన్నది. జీర్ణింపక తీరదు. నాఅభరజ్యోతి యిక ప్రకాశింపదుఁగాక! ఏఁడుకాలానకైన నొక్కటిరెండెరాల్చి మీయనుగ్రహణమే నాయాత్మకు శాంతికరము. ఇదే నమోవాకము. క-డ-సా-రి-ది..."

వృత్తుమింకను ఊగులాడుచున్నది! వేల్లితశ్యామామతల్లికి నవనవలతో నిడమ్ముధుపతనమా? కోమలత్వమువాడువడు క్లాంతినోర్వలేదు. సద్యోనాశమే వరణీయము దానికి. ఆమె శిరస్సుచిటిలి ముత్యములు నెత్తురుటోడికలుకట్టినవి. ఏమీ! విధ్యనతిక్రమణీయత?

"దేవీ! ఈపాతకివి కిప్పుడే కార్చిచ్చురగిలింపా?...నీవన్నిటను ధన్యవు! నీది పుణ్యశ్రీమ..ర..ణ..ఛీ!...కాకేమున్నది? నా కిక మారకదశయందేని నీపాదసాన్నిధ్యము శరణ్యమగుగాక! ఈతాతను తల్లప్రయ్యలుకాదేమి? గట్టిగ మొత్తుకొందును. దేవీ! జన్మాజన్మాలకేని నీతోడిదైవప్రణయబలియే నాయోగ్యత.

దేవా! మాయిర్వురకుగాను నేనొక్కఁడనై దోయిలించుచున్నాను. మాకు యెట్టైననైక్యమే! సెలవా యిక!"

# గడ్డిపూలు

శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

ఈ ప్రపంచములో వ్యక్తమవుతూఉన్న రామణీయకంఅంతా నీవేట. ప్రతివస్తువులో కనబడుతూన్న సౌందర్యం నీయునికినేపట్టిస్తుందట. సంధ్యారాగాలలోని రామణీయకంలో, కుసుమవిసరంలోని లాలిత్యంలో, సాంద్రచంద్రికలోని దీప్తిస్ఫూర్తిలో, వినీలాకాశంలోని ముగ్ధచ్ఛాయలలో, విశుద్ధములై తళతళలాడుతూ మెరుస్తూ లేచి విరిగిపడుతుండేనదీతరంగాలలో—ఇంతఎందుకు?— దివ్యమైన, అనవద్యమైన, గుణయుక్తమైన, శోభాపూరితమైన నీహృదయంగమమగుసృష్టిలో నీస్వరూపం కనిపిస్తుందేమోనని వెతుకుకొంటాను. చిరకాలంనుంచి ఉపోషితాలయిన నేత్రపాత్రాలతో నీదివ్యస్వరూపమరందాన్ని ఆస్వాదించాలని చూస్తాను. తళుకులు, బెళుకులు, మెఱపులు, ఒఱపులు మాటిమాటికి నీయుపస్థితి విషయమై భ్రాంతికలుగచేస్తుంటాయి నాకు. కన్నులు విప్పుకొనిచూచిన నాకు ప్రయోజనం అభావమవుతుంటుంది. మహత్తరమైన కోరికనాది. దేహమంతా ఒకటేకన్నుగా,—కంటికంతా ఒకటేదృశ్యంగా,—నీరూపంత్రాగేయాలనని ఉంది నాకు. కాని నీస్వరూపాన్ని ప్రత్యక్షంచేసుకొనే శక్తిలేకుండా ఉన్నాను. ఎట్లు నిన్ను ప్రత్యక్షంచేసుకొనేది?

సృష్టిలో వ్యక్తమయ్యే మాధుర్యం అంతనీవేనట. ఆకాశమంతా ఆవరించియున్న శబ్దసమూహంలో నీదివ్యనాదస్వరూపం వ్యక్తమవుతుందట. పంచమస్థాయిలో కొసరికొసరిపాడే కోయిలపాటలో, అవ్యక్తమధురంగా మానసాన్ని అలరిస్తూ ఝూంకారంచేసే కొదమతుమ్మెదల పలుకులలో, చల్లగా మెల్లగా సౌరభాన్నివహిస్తూ తిరుగులాడే గాలికెరటాలలో, కలకలమని జలజలమని తిన్నగా ప్రవహించే సెలయేళ్లనిస్వనాలలో, వచ్చీరాక అవ్యక్తమధురంగా అమాయికంగా మాటలాడే చిరుతల తొక్కుపల్కులలో, నీనినాదమాధుర్యశోభాసామగ్రులు పిసాళించినవేమో అనిచెవి యొగ్గుతాను. మాటలు, విసరులు, కసరులు దివ్యములయి అమందానందాన్నికలిగిస్తూ నీస్వరూపాన్ని వ్యక్తపరుస్తవేమోనని తదేకధ్యానంగా చెవియొగ్గివింటాను. కాని నాకేమాత్రం నీస్వరూపం గోచరించడంలేదు. నాకాంక్షమాత్రం దొడ్డది. దేహమంతా శ్రవణంగా,-శ్రవణానికి ఏకధ్వనిగా-నీశబ్దమాధుర్యం క్రోలాలని ఆత్రపడుతుంటాను. కాని నీమాటయేదో తెలీటంలేదు నాకు. ఎట్లు తెలిసికొనవలెనో ఎఱుగకుండా ఉన్నాను.

# స్త్రీ సమాజములు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

గృహలక్ష్మిసంపాదకు శ్రీవారలు దసరాసంచికకొఱకొక వ్యాసము వ్రాయుమని కోరగనే నా మనస్సులనో ఆంధ్రదేశమునందలి స్త్రీసమాజములపై ప్రసరించినది. కాని యీవిషయమును సవిమర్శగా ప్రస్తావించుచో స్త్రీ సమాజముల నడుపుచున్న నా సోదరీమణులెల్లరకు కోపకారణమగునేమోనని భయమొందినది. అయినను గుణగ్రహణ పారీణలగు నా సోదరీమణులు నా వ్యాసరచనయొక్క యుద్దేశము స్త్రీజనాభ్యుదయమేనని భావింపకపోరను పరమవిశ్వాసముతో నే నీ సాహసమున కొడిగట్టితిని. సోదరీమణు లనుగ్రహింతురుగాక! మన ఆంధ్రదేశమున ఇప్పుడున్న స్త్రీసమాజములను వాని పేరులనుబట్టియు, వానిఅభిప్రాయములనుబట్టియు, అవి నడుపబడుచున్న విధమునుబట్టియు మువ్విధములుగా విభజింపవచ్చును. ౧. సనాతనము, ౨. నవీనము, 3. జాతీయము.

సనాతనపద్ధతులపై నడుపబడుచున్న సమాజములలో ప్రతిమార్చన ముఖ్యము. భారత భాగవత రామాయణాది పురాణేతిహాస గ్రంథములుకాని, వేదాంత పంచదశి, యోగవాశిష్ఠము, సీతారామాంజనేయము మున్నగు వేదాంతగ్రంథములుకాని, మాఘపురాణము, కార్తీకపురాణము మున్నగు మహాత్మ్యగ్రంథములుకాని ఇందు కాలక్షేపమునకై విని యోగింపబడును. ఈసమాజములలో అధికముగా పాల్గొనువారు బ్రాహ్మణులు, కొద్దిగా వైశ్యులు, అత్యల్పముగా శూద్రులు. ఇక ఇతర మతస్థులకుగాని, యితరకులస్థులకుగాని యిందు ప్రవేశము చిక్కదు. వీనిలో తరుచుగా చేరువారు వయస్సువెళ్లిన మాంగళ్యవతులు, వితంతుస్త్రీలును. దేశవిషయములు, సంఘసంస్కరణకార్యములు, రాజ్యాంగవ్యవహారములు వీరికిగిట్టవు. సంఘసంస్కారులైనవారు తమ సభలలో చేరుటకుగూడ వీరంతగా సమ్మతింపరు. ఎంతసేపటికిని సనాతనమతాచారసాంఘికసంప్రదాయముల అండను వీరికార్యక్రమమునడచును. శాస్త్రజ్ఞానము తక్కువైనను వేదాంతపరిభాషాపదప్రయోగములతోను, నైష్ఠికవేషముతోను వీరిసమాజములు గంభీరముగా జరిగిపోవును. వేదాంతోపదేశకులు, పౌరాణికులు వీరి నాశ్రయింతురు. వీరిలోనే కొందఱు గురుపదమునువహించి శిష్యమండలిని చేకూర్చుకొని వారిద్వారా యిష్టార్థములను సాధించుకొనుచున్న వారునుగలరు. స్త్రీలొకచోటగూడుటే మహాదోషమని భావించు పరమ శ్రోత్రియవర్గమును మినహాయించినచో మిగిలినవారిలో ఈసనాతనసమాజములకే యెక్కువ పలుకుబడిగలదు. కావుననే నేడు జీర్ణదేవాలయముల పునరుద్ధరించుట, మందిరములనిర్మించుట, సత్రములుకట్టుట, సప్తాహములుజరుపుట మున్నగుకార్యములు వారివలనజరుగుటను చూడగలుగుచున్నాము.

నవీనపద్ధతులపై నడుపబడుచున్న స్త్రీసమాజములకు తెలుగుపేరులేదు. వీనిని క్లబ్బులను యింగ్లీషుపేరుతోనే యెల్లరువాడుచున్నారు. ఇవి యిప్పుడిప్పుడు ప్రతిపట్టణమునందును స్థాపింపబడుచున్నవి. ఇవి చాలవఱకు పాశ్చాత్యపద్ధతులపై నడుపబడుచున్నవి. వీనిలో చేరువారు సాధారణముగా పాశ్చాత్యవిద్యయందును, నాగరికతయందును అభిరుచిగలయువతులు, విశేషించి ఉద్యోగస్థులభార్యలును, తామై ఉద్యోగమును చేయుచున్న విద్యావతులును. ఈక్లబ్బులలో హిందూమహమ్మదీయక్రైస్తవాదిసర్వమతములవారికిని ప్రవేశార్హతగలదు. కాన యెవరిదేవునికొలిచిన యేమిరంటావచ్చునోయని వీరుదేవునే విడిగానుంచిరి. వీరు స్త్రీలకు సంబంధించిన సమస్తసంస్కరణములను, సర్వహక్కులను వాంఛింతురు, వార్తాపత్రికలనుగూడ తెప్పించెదరు. కాని పత్రికలపైకన్న బ్యాడ్మింటను, టెన్నిసు, బిలియర్డ్సు మున్నగు ఆటలపైనే వీరికి ఆసక్తిమెండు. స్వాగతములు, వీడ్కోలులు, విందులుఅన్న వీరికి కడునుల్లాసము. వీరికి ప్రాచీనపద్ధతులన్న పరమాసహ్యము.

స్వరాజ్యాందోళనమునిన పెద్దపులి. క్లబ్బులోనున్నంతసేపు వీరివ్యవహారభాష ఇంగ్లీషు. వీరు తమపేరులను గూడ వదులుకొని ముందు మిసెసుపదమును చేర్చి పాశ్చాత్యపద్ధతిప్రకారము తమభర్తలనామములనే తమ నామముగా వాడుకొనుచున్నారు. ఈ విధముగా తెలుగుదేశములో తెలుగుస్త్రీలచే స్థాపింపబడుచున్న సమాజములు తెలుగుభాషకును, తెలుగుపేర్లకును, తెలుగుసంప్రదాయములకునుగూడ దూరమైపోవుటచేత స్త్రీలే గాక పురుషులుగూడ వీనినిగాంచి భయపడుట సంభవించుచున్నది. జాతీయపద్ధతులపై నడుపబడుచున్న సమాజములు మూడవరకమునకు జెందినవి. వీరికి పాశ్చాత్యనాగరికతావిజ్ఞానములన్న గిట్టదు. సనాతనపద్ధతులపై గూడ అభిమాన మంతంతమాత్రమే. వీరికభిమానవిషయము స్వదేశము—స్వదేశీ. ఉదారములైన సంస్కరణములకు వీరుగూడ సుముఖులైయుందురు. రాట్నముమీదను, హిందీభాషమీదను వీరికి ప్రేమయెక్కువ. పత్రికలన్న ఆదర మధికము. ఖద్దరుధారణ ముఖ్యము. అవసరమగునపుడు రాజకీయాందోళనలో పాల్గొనుటకు వెనుదీయరు. కాన వీరిదరిచేరుటకు సనాతనులకు, నవీనులకుగూడ కడుభయము.

ఇవిగాక ప్రార్థనసమాజములనునవి కొన్నికలవు. ఇందు యేకేశ్వరోపాసనముఖ్యము. నైతికపారమార్థిక విషయములందు వీనికృషి. ఈ నాల్గురీతుల సంఘములేగాక భజనసమాజములను పేర అసంఖ్యాక స్త్రీ సమాజము లిటీవల దేశమంతట వెలసినవి. చిల్లరదుకాణములేని గ్రామమైననున్న దేమోగాని యీభక్తసమాజములేని పల్లె కానవచ్చుటలేదు. ఒకవంక ఒంటిమిట్ట కోదండరామభక్తులు, వేరొకవంక పండరీక్షేత్రపు పాండురంగభక్తులు, మఱియొకవంక కుసుమహరనాథబాబాగారి రాధాకృష్ణభక్తులు. ఆంధ్రదేశమును చుట్టుముట్టి నామసంకీర్తన కధికప్రాముఖ్యత యిచ్చి దేశీయులనెల్లర భక్తజనముగా మార్చివేయుచున్నారు. వీరి అఖండప్రచారమువలన వీథివీథికి నాల్గుభక్తసమాజములైన స్థాపింపబడుచున్నవి. భక్తసమాజములో వారివారి యిష్టానుసారముగా ఏదేవునిపటమునో, విగ్రహమునో యెదుటబెట్టుకొని పదిమందిచేరి, చప్పట్లుచఱచుచు యే నామమునో పట్టుకొని రట్టించిపాడుటకంటె నధిక మేమియు లేదు. విద్యతో నవసరములేక, విజ్ఞానముతో సంబంధములేక, నడవడితో ప్రసక్తిలేక కేవలము మాటమాత్రముతోనే సాటిలేని యపవర్గము చేతిలో చిక్కుననుటచే పుణ్యభ్రాంతిగల జనులు వీనిలో అధికముగా చేరుచున్నారు. విశేషించి యిది భగవత్సంకీర్తనా సమాజముగాన దీనిలో చేరుటతప్పు లేదనియు, ఇతరసమాజములకేగుట తప్పనియు వీరి అభిప్రాయము. కాని చిత్తసంస్కారములేని యీనామభజనవలన వీరికేమైనా ప్రయోజనము కలుగుచున్నదేమో వీరే చెప్పవలయును.

ఈ విధముగా మన ఆంధ్రదేశపు స్త్రీసమాజములు పలురీతులనున్నవి. వీనిలో ఏరెంటికిని పొత్తు లేదు. దేనిత్రోవ దానిదిగానున్నది. సనాతనమైనను, నూతనమైనను, జాతీయమైనను, విజాతీయమైనను, ఏదియైన యొకసంఘము ఒకరిచే స్థాపింపబడినప్పుడు అది వారి అభ్యుదయమునకు తోడ్పడునదైయుండుట ముఖ్యము. కాన స్త్రీసమాజములెల్లను ముఖ్యలక్ష్యముగా పెట్టుకోవలసిన విషయము స్త్రీలయున్నతి. స్త్రీల యున్నతికి మార్గము లనంతములు. విద్య, విజ్ఞానము, నీతి, ధర్మము, సేవ, భగవద్భక్తి మున్నగునవన్నియు స్త్రీల పురోభివృద్ధికి మార్గములే. ఏస్త్రీసమాజములు నిజముగా స్త్రీలపురోభివృద్ధికి పాటుబడదలంచునో వాని ఆశయములు విశాలములుగను, ఉదారములుగను నుండవలయును. స్త్రీసమాజమనినప్పుడు ఎల్లస్త్రీలందు చేరుటకును, ఎల్లస్త్రీసమస్యలందు చర్చించుటకును అవకాశముండవలయును. ఆశయములయొక్క వైశాల్యతను బట్టియే వాని అభివృద్ధియొక్క వైశాల్యముగూడ విస్తరించును. కాని నేటిస్త్రీసమాజము లట్టి విశాలభావములో సృజింపబడుటలేదు, సరిగదా వాని పేరులలోనే, వాని ఉద్దేశములలోనే యవి యటునిటు చెదలరాని

నిర్బంధములతో సృష్టింపబడుచున్నవి. అదియంతే యిట్టి సంకుచితాభిప్రాయములతో సృష్టింపబడిన సంస్థలు ఉదారభావములతో స్త్రీలపురోభివృద్ధికెట్లు తోడ్పడగలవు? సనాతనధర్మములపై నడుపబడుచున్న సమాజములు కేవలము ప్రాచీనపద్ధతులను వంధప్రాయముగా ననుకరించుటలోనే చరితార్థతగలదనుకొనుచున్నవి. కాని ఆధునికములైన పరివర్తనములెన్నో స్త్రీ సంఘమును ఒరపిడి చేయుచున్నప్పుడు వానినిగూర్చి పరిశీలనలైన లేక సర్వదా త్రేతాద్వాపరయుగగాథలలో సంచారము చేయుచుండినచో నిట్టి స్త్రీసమాజములను స్థాపించుటచే ప్రయోజనమేమైన యుండునా? నేడు స్త్రీసమాజములు చేయవలసిన పని జాతినిముందుకు నడిపించుటగాని వెనుకకు మరలించుటగాదు. కాన ప్రాచీనగాథాపారాయణమేయౌగాక దానినిగూడ ప్రస్తుతముతో సమన్వయముచేసి తగిన ప్రబోధకారణముగా చేయకపోయినచో అది కేవలము వినుటయనువ్యసనముగానే పరిణమించును. విద్యలలోకెల్ల నత్యుత్తమమైనది బ్రహ్మవిద్య. అట్టి బ్రహ్మవిద్యావిషయమై సనాతన సమాజములు కృషిచేయుచుండుట మెచ్చుకొనదగినమాటే. కాని అవి విచారణతోడనే ఆగిపోగూడదు. అనుదినజీవితములో ప్రతిఫలింపవలయును. ఒకవంక రాత్రింబవళ్లు వేదాంతవిచారణచేయుచు ఒకవంక శోకమోహములకు, ఆశాలోభములకు, క్రోధమాత్సర్యములకు, డాంబదర్పములకు వశులగుచున్నచో ఆ విచారణ నిష్ప్రయోజనమేగదా? ఆ విధముగనే పురాణములనుచదువుచున్నను, ఆ పురాణస్త్రీలైన సీత, సావిత్రి, ద్రౌపదిమున్నగు మహాసాధ్వుల క్షమాసత్యధర్మాది సుగుణసంపదలు శ్రోతలకు ఆదర్శనీయమై వారి నిత్యజీవితములో ప్రతిఫలించి వారిజీవితోన్నతికి తోడ్పడకున్నచో ఆ పురాణశ్రవణముగూడ వ్యర్థశ్రమయే. పూర్వము ప్రస్తుతములోనికి మార్చుకొని వానివలన పొందవలసినఫలమును పొందకపోయినచో ఆ పురాణములనెంత కాలమువినినను రాటమునకు రెండుచెవులున్నవి నాకు రెండుచెవులున్న వన్న సామ్యముగనే యుండును.

ఇక స్త్రీలక్లబ్బులను చూచినచో వీనిలో ఆటలకిచ్చిన ప్రాముఖ్యము విద్యకులేదు. అనిగనిగలాడు గుండ్రనిబల్లపై గ్రంథపత్రికాదులు వ్యర్థముగాపడియుండును. అచేతనములగు కుర్చీలు వాటిచుట్టు మిన్న చూచుచు కూర్చుండును. అక్కడ స్త్రీలు మాత్రముండరు. వారందరు క్రీడారంగములో నుందురు. వాటి నిరుపయోగతసహింపలేక కాబోలు వాయుదేవుడు మాత్రము వాటి నప్పుడప్పుడు తిరుగవేయుచుండును. భిన్నమతములవారుండుటచే ఇవి మతవిషయములను తలపెట్టుటకువీలులేదు. ప్రాతయన్నరోతచే నివి ప్రాచీనగాథల వంకకుపోవు రాజకీయములన్న భయముగుట దేశపరిస్థితులను విచారించుటకు పూనుకొనవు. కాని ఇందులో చేరిన వారందరు లోకవ్యవహారమెఱిగినవారును, విద్యావతులునగు నవయువతులగుటచే శ్రద్ధవహించి పనిచేసినచో వీనివలన సంఘమునకు మేలుచేకూరవచ్చును. హిందూదైవములైన రామకృష్ణాద్యవతారపురుషుల జయంతులతో బాటు జీసను, మహమ్మదు మున్నగు అన్యమతప్రవక్తల జయంతులనుగూడ నివి జరిపినచో మతవిషయమున సామరస్యమేర్పడును. కేవలము యేకేశ్వరసంబంధమగు ప్రార్థనాగీతములుపాడినచో ఇందు భగవత్ప్రార్థననుగూర్చిగూడ భయపడనవసరములేదు. పాశ్చాత్యనాగరికతపై ఎంత మక్కువగానున్నను దానిని ప్రస్తుత దేశపరిస్థితికిని దేశీయనాగరికతకును నష్టములేకుండ యెంతవఱకవలంబనీయమో అంతవఱకవలంబించిన మోసమురాదు. విదేశీయక్రీడలతోబాటు దేశీయక్రీడలకును, విదేశీయవ్యాయామములతోబాటు దేశీయవ్యాయామములకును, విదేశీయభాషతోబాటు దేశభాషకును, విదేశీయటీపార్టీలతోబాటు దేశీయ వనసమారాధనలకును గౌరవమొసగి సామరస్యముగల్పించి సమన్వయబుద్ధితో నడిపించినచో ఈక్లబ్బులద్వారా యువతీజనములో నెక్కువ ప్రబోధముగల్గించుట కవకాశముగలదు. ఈ క్రొత్తపాతకలయికలో దేశివిదేశిసంఘర్షణలో ఈక్లబ్బులకు సారథ్యమొనరించుట కష్టమైనపనియేకాని వీనినడుపువారు ఇంచుక జాతీయాభిమానము గలవారైనచో వీనినినడపుట సుకరమేయగును.

ఇక జాతీయపద్ధతులపై నడుపబడు సమాజములలో పాశ్చాత్యనాగరికమనిన నేగాక పాశ్చాత్యభావ యనినను విజ్ఞానమనినను గూడ 'శ్రీహరీ' యని చెవులుమూసికొనుట అలవాటైపోయినది. కాని భావమునకు విజ్ఞానమునకు పూర్వపశ్చిమభేదము లేదనియు, మంచి యెచ్చటిదైనను పరిగ్రాహ్యమే యనియు నీ సమాజములు యోచించుటలేదు. ఈ సమాజములవారు పత్రికలను చదివినను, పాఠశాలలు స్థాపించినను, ప్రచారము సల్పినను జాతీయదురహంకారముతోనే జరుపుచున్నారు. జాత్యభ్యుదయముయొక్క ప్రతిబంధకమునకు విదేశీయవ్యామోహ మెంతనష్టహేతువో దేశీయదురభిమానముగూడ అంతనష్టహేతువే.

వెలుగులో నీడవలె యేమంచిపనికిని పథ్యముగా వినియోగింపనిచో చెడుగుగూడ కొంతఅంటుకొనుట నిజము. కాన స్త్రీ సమాజములకర్తవ్యము లెప్పుడును మంచియెక్కడనున్నను తీసికొనవలసినదేయను ఉదారాభిప్రాయముతో నేర్పడియుండవలయును. సంకుచితోద్దేశములతో గాదు. ఒకరికినూతనమన్న నేవ, వేరొకరికి సనాతనమన్న నసహ్యము, ఇంకొకరికి విదేశమన్న నసూయ. ఈ విధముగా నీర్ష్యాప్రధానముగా బెట్టుకొని నచో స్త్రీ సమాజములు స్థాపించిన ప్రయోజనములేదు. పైగా అపకృతికిగూడ కారణమగును.

ఇక భక్తసమాజములమాట యోచింతము. ఎంతసేపటికి వీనిస్థితి తలవాకిటినృత్యముగానున్నది. అంతః సంస్కారములేకున్న. 'కలియుగేస్మరణాన్ముక్తిః' అనువారోక్తిననుసరించి యివినడుపబడుచున్నవి. కాని యీభజనపరులు యోచించవలసినదొకటిగలదు. కేవలము వాగాడంబరమునకే మోక్షముకట్టిపెట్టుటకు భగవంతుడు సెట్టినాడుగాడు. నడిచేనడవడి, తలచే తలపు, ఆడేమాట, చేసే పని సర్వముపరికించి పరిశోధించి "వీరు త్రికరణశుద్ధిగలవారు. నాకు పరమభక్తులు, 'అన్యథా శరణంనాస్తి త్వమేవశరణంమమ' యని నన్నేశరణుజొచ్చినవారు, అని తానుగావించిన వివిధాగ్నిపరీక్షలలో పరిశీలించి తెలిసికొనినతరువాతనే భగవానుడు వారి ననుగ్రహించును. ఏయింద్రియములకు గావలసిన స్వేచ్ఛ ఆ యింద్రియములకొసగి మేము వారమునకొకగంటసేపు నోరు నొచ్చునట్లు నిన్నుస్మరించెదము, నీవు మమ్ములను నీపరమభక్తులలిస్టులో చేర్చుకొని మాకుమోక్షమీయవలసినదని బేరమాడుటగాని ఊరా బేరమువలన నేదియో కైవల్యముసిద్ధించునని నమ్ముటగాని భ్రాంతితప్ప వేరుగాదు. కాన భజనపరులెల్లరు ముందు ఆత్మశుద్ధికై ప్రయత్నించి ఆవల భగవత్సంకీర్తనకుపక్రమింపనగును.

ఈభజనలను ప్రచారముచేయుచున్నవారుగూడ ఈ విషయమును తెలిసికొని యెక్కడెక్కడ స్త్రీల భజనసమాజములుగలవో ఆయాతావులకేగి వారికి భగవద్భజనముగూర్చిన సరియైనవిజ్ఞానమును కలిగింపవలయును.

ఈవిధముగా ఆంధ్రదేశమున నిప్పుడున్న స్త్రీసమాజములెల్ల సంకుచితభావమను సంకెలలచే నిబద్ధమై స్త్రీజనమునకు చేయవలసిన యుపకృతి చేయజాలకున్నవి. కాన స్త్రీ సమాజములను స్థాపించిన సోదరీమణులెల్లరు తమతమ సమాజములకుగల లోపములను సవరించుకొని, విశాలభావముతో యెట్టితారతమ్యములులేక స్త్రీలలో విద్యావిజ్ఞానములను పెంపొందించుటయే ముఖ్యకర్తవ్యముగా బెట్టుకొని స్త్రీలోకమును సేవించుచు, వారిపురోభివృద్ధికై సర్వవిధముల యత్నింతురుగాక! నేడు ఆంధ్రదేశమున నేగాక భారతదేశమంతటను మహిళాఉద్యమము అత్యంతశీఘ్రగమనముతో వ్యాప్తినందుచున్నది. ఎన్నియో హక్కులు ప్రసాదింపబడుచున్నవి. ఎన్నియోవిషయములు సంస్కరింపబడుచున్నవి. జాతికి కారణభూతులు స్త్రీలు, వారియున్నతియే జాత్యున్నతి యనియెల్లరుభావించుచున్నారు. ఇట్టి సత్సమయమున స్త్రీసమాజములు తమకర్తవ్యమెఱిగి ఉదారముతో స్త్రీల యభివృద్ధికై కృషిచేసినచో వానికర్తవ్యముల నెరవేర్చినవగును. లేదేని వాని జన్మ నిరర్థకమే.

# చుక్క కన్నె

బుద్ధవరపు నాగరాజుగారు

నీలిగప్పిన నీళ్ళలోపల
నల్లకలువలు తేలియుండుట
చుక్క కన్నె నీలాకాశము
నుండిచూచింది;—
చుట్టునున్నా చెట్టులన్నీ
చెలువులోపల జూచితానూ
మిణుకుమిణుకని వానిలోపల
మెరయనెంచింది;
కలువపూవూ కాడతోటీ
కలకదేరిననీళ్ళతోటీ
కలసితానూ ఆడగోరీ
కలవరించింది;
తళుకుమంటూ తనదువెలుగూ
నీళ్ళలోపలజూచితానూ
తనివితీరగ తానమాడగ
కోరుకొన్నాది;
చంద్రకాంతులుచోరని గుబురుల
చెంత మిణువురుపురువుతోటీ
చేయిచేయీ కలిపితానూ
తిరుగనెంచింది;
కొంతకాలము కోరికలతో
గడిపివేయగనంతలోనే
తెల్లవారీ యెండరాగా
వెళ్ళిపోయింది;

తిరిగివచ్చి వెతుకుకోగా
చెలువు లేదూ, చెట్లు లేవూ,
కలువ లేదూ, కాడ లేదూ-
స్వప్న మనుకొంది!

మింటిపై నానున్న తానూ
మంటిపై నానున్న వానిని
కంటేమాత్రము తనకుయిట్టీ
కొంటెకోరికలా!

# ప్రణయమహిమ

శ్రీమతి తాయి రోజాకృష్ణవేణిగారు

ప్రకృతిశోభాపరిపూర్ణమైన సాయంసమయము. పిల్లతెమ్మెర లల్లనల్లన వీచుచున్నవి. పక్షులు తమకులాయములు చేరుచుండెను.

సౌధాంతర్భాగము. పదునెనిమిదేండ్లయువతి దీర్ఘముగా యోచించుచున్నది. ఆమెముఖమునందు విచారము విస్పష్టముగా ప్రతిఫలించుచున్నది.

ఆమె మనసారప్రేమించినయువకుడు నాటిరాత్రి ప్రార్థనామందిరములో గంటమ్రోగినంతనే యురిదీయబడును.

— ఇది రాజాజ్ఞ —

ఇను డస్తాద్రిని గ్రుంకెను. సంజకెంజాయ లలుముకొనెను.

ఏదియో స్ఫురించినదానివలె సౌధమునువీడి ప్రార్థనామందిరము ప్రవేశించినదామె. గంటమ్రోగించువాని నతిదీనముగా వేడుకొన్నది రాత్రికిమాత్రము గంటమ్రోగించవద్దని. వాడు తన విధ్యుక్తధర్మమును నెఱవేర్చకుండుట కిచ్చగింపలేదు.

నేటిరాత్రికి గంటమ్రోగకూడదు. గంటమ్రోగకూడదు.

— ఇదియే ఆమెప్రతిజ్ఞ —

చీకట్లునలుగడల దట్టముగా నలుముకొన్నవి. కాళ్ళుచేతులు గీరుకొనిపోవుచుండినను లక్షింపక ప్రార్థనామందిరగోపురమున కెగబ్రాకి అతిప్రయత్నముతో గంటగట్టిగా పట్టుకొనినదామె.

ఆమెనోట నదియేమాట. నేటిరాత్రికి గంటమ్రోగకూడదు.

గంటమ్రోగించువాడే తెంచి త్రాడులాగి వెళ్ళినాడు గాని బధిరత్వముచే గంటమ్రోగినది లేనిది గమనించలేదు.

ఆమె రాత్రియంతయు గోపురాగ్రమందే వేగించినది.

తెలతెలవారుచుండెను.

ఆమె నలుగడల పరికించినది. దూరమునుండి ఏతెంచు రాజుపైబడినదామె దృష్టి. గోపురముదిగి వడివడిగాపరువెత్తి రాజుపాదములపై వ్రాలినది.

రాజంతయు గ్రహించినాడు. రాజనినాడు "అమ్మా! నీపవిత్రప్రణయమే నీప్రియుని కాపాడినది. చింతదక్కియుండుము."

# ద్వితీయం

కొడవటిగంటి కృష్ణమూర్తిగారు

అతనికి బుద్ధి తెలిసినతరువాత ముప్పైసంవత్సరాలకాలంలో రంగారావు ఒక్కడైనా మనోవ్యాధి [illegible] వారి సంసారంలో గృహచ్ఛిద్రాలు, అకాలమరణాలు, దారిద్ర్యం మొదలయినవి ఎన్నడూ అడుగు [illegible] కా అనుభవం ఇతనికి లభ్యమయింది.

[illegible] రావు తండ్రిగారు చాలాధనం సంపాదించి గతించాడు. రంగారావు ఎక్కువచదువుకోలేదు. [illegible]లుతిరగటంలో అతని విద్యాభ్యాసం అంతమయిపోయింది. అతను చాలా సౌమ్యుడు. అందరికీ అతన్ని చూస్తే గౌరవం, అభిమానం. అతని ఇరవైయోసంవత్సరంలో మొదటిభార్య కాపరానికివచ్చింది. ఆమె పన్నెండుసంవత్సరాలు కాపరంచేసి గతించింది. ఆమెగతించేసమయానికి అయిదారుసంవత్సరాల కుమారుడొకడున్నాడు.

ద్వితీయం పనికిరాదని పట్టుదలలేకపోయినప్పటికీ రంగారావు తిరిగి వివాహంచేసుకున్న దీపుత్రుడి కొరకే. వివాహమయి మూడుసంవత్సరాలయింది. భార్య బహురూపవతి. వివాహమయినప్పటినుంచీ రంగారావుమనస్సు శాంతిఅన్నమాట ఎరగదు.

వివాహమయినమర్నాడు రంగారావుకు మనోవ్యాధి ప్రారంభమయింది. అతను పూర్వ మనేకమంది చక్కని స్త్రీలనుచూశాడు. కాని తనకు అందగత్తెభార్యగా రావాలని అతను ఎప్పుడూ కోరలేదు. చక్కని వాళ్ళనుచూస్తే అతనికొకవిధమైనభయం, అనుమానం.

రంగారావుభార్య చాలాచక్కనిది. తనమామగారు వివాహానికి పూర్వంతనకుమార్తె చక్కనిదని చెప్పినప్పుడు రంగారావు ఎక్కువచెవినిబెట్టుకోలేదు.

"ఈభార్యతో నేను స్వతంత్రంగా మాట్లాడగలనా? మాయిద్దరికీ అసలు మనస్సుకలుస్తుందా? ఇద్దరం చెరొకమూలా ఉన్నట్టున్నాం! అసలు ఇలాటివాళ్ళు అదోకరకంగా ఉంటారు!" రంగారావుశరీరం జలదరించింది. జారత్వంఅనేది అతని ఆలోచనల్లోకి పూర్వం ఎన్నడూరాలేదు! అటువంటిది తనజీవితంలోవస్తుందేమో!

రంగారావు ద్వితీయవివాహమయిన ఆరునెలలకు తనకుమారుడు అకారణంగా మరణించాడు. నలుగురూ చేరి పెళ్ళిఅయినవేళావిశేషమన్నారు. అంతటితో రంగారావుకు భార్యమీద అసహ్యంకూడా కలిగింది. కాని అతని అసహ్యం ఎన్నడూ ఇతర్లను బాధించదు!

వివాహమయిన రెండుసంవత్సరాలకు రంగారావు బలవంతంగా భార్యను తెచ్చుకున్నాడు. ఒకమనిషి మనసామీప్యంలో ఉన్నప్పుడు మన కామనిషిమీద ఉండే అభిప్రాయానికి, దూరంగాఉన్నప్పటి అభిప్రాయానికి ఎంతోభేదం ఉంటుంది.

ఒకవారంరోజులు లీలావతి ఇంట్లోతిరిగినతరువాత రంగారావు మనస్సంతా విరిగిపోయింది. ఆమెను చూచి భయపడ్డందు కతను నవ్వుకున్నాడు. లీలావతి చాలా సౌమ్యంగా ఉండేది—తనమాదిరిగానే చక్కని వారంతా ఒకరకంగాఉంటారని ఊహించుకున్నాడు రంగారావు. లీలావతి ఆవిధంగాకూడా లేదు.

లీలావతికి ఇరవైనాలుగ్గంటలు అలంకరించుకోటంతో సరిపోతుందనుకున్నాడు. కాని ఆమె బీదఇంటినించి రావటంచేత ఎప్పుడూ ఏదోచాకిరిచేస్తూండేది. అంతవరకూ బాగా నేఉన్నది. కాని రంగారావు మనోవ్యాధి తీరలేదు.

అతని కిప్పుడు భార్యనుచూస్తే జాలిఎక్కువయింది. అంతచక్కనిపిల్ల పాపం తండ్రిబీదరికంచేతకద తనకన్న ఇరవైసంవత్సరాలు పెద్దఅయినభర్తతో సంసారంచేయవలిసి రావటం! లేకపోతే బాగాయౌవనంలో

ఉన్న భర్తతో సుఖపడేదా! యౌవనంలో ఉన్న భర్త తనమాదిరిగా ఆమెకంతఎడంగా ఉన్నట్టుంటాడా? రంగారావు ఆమెకు ఎక్కువసుఖంకలిగేటట్టు నౌకర్లను పెట్టి పనిచేయించవచ్చును. కాని తనముఖంచూస్తూ కూర్చోటంకన్న ఏదో పనిలో మునిగిఉండటం ఆమె కెక్కువసుఖంకాదా? పాపం మొదట్లో ఆమె నెంత అసహ్యించుకొన్నాడు రంగారావు? ఎందుకు? ఆమెకు తనయింట సుఖంలేనట్టు సులభంగాకనిపెట్టవచ్చును! ఆమెముఖాన చిరునవ్వుకాని, సంతోషంకాని అతడెన్నడూ చూడలేదు.

స్త్రీమనస్సునుగురించి తనకేమీ తెలియదు. కొందరుస్త్రీలు నగలతో ఎక్కువతృప్తిపడతారట, కొందరు భర్త స్వేచ్ఛగామాట్లాడితే సంతోషిస్తారట. ఈవిధంగా నలుగురూ అనుకుంటుంటే విన్నాడు రంగారావు. లీలావతిముఖానికి చిరునవ్వు తెప్పించట మెలాగాఅని అతనికి ఆలోచనపట్టింది.

లీలావతి వచ్చినప్పటినుంచీ అతని మనసులో పూర్వమెన్నడూలేని వికారంకలిగింది. కొంతకాలమతని కాసంగతి తెలీలేదు. తరువాత అర్థంకాలేదు. ఒకరోజున ఆకస్మాత్తుగాతట్టింది. అతను లీలావతిని విపరీతంగా ప్రేమించాడు. ఇది చాలామందికి విచిత్రంగాఉంటుంది. పదిపన్నెండుసంవత్సరాలు స్త్రీసంపర్కంఉండి ప్రేమఅంటే ఏమిటో తెలియకపోవటం చాలావిచిత్రంగా ఉంటుంది. ప్రేమను సంసారసుఖానికి బాహ్యమైన దాన్నిగా తీసుకుంటే ఇది అర్థమవుతుంది. సుఖంకోరేవాడికి చక్కనిస్త్రీ కనిపించగానే ఆస్త్రీమీద తాత్కాలికంగా మోజుఏర్పడుతుంది. కాని ఆమోజుఎంతో కాలము ఉండదు. ఆస్త్రీకి నీచమైనఅభ్యాసా లుండవచ్చును. అవి బయటపడగానే మోజుకూడా బయటికినడుస్తుంది.

రంగారావుకు ప్రేమ అభిమానపూర్వకంగా ప్రారంభమయింది. క్రమంగా లీలావతి ప్రకృతి అతని కర్థమవుతున్నకొద్దీ ఆఅభిమానం ప్రేమగామారింది. ఈఅభిమానం బయటికిరావటానికి రెండే అభ్యంతరాలు.

మొదటిది ఆతనిదగ్గిరవారిలో అతనికిష్టులెవ్వరూలేరు. అనగా అతని అభిమానానికి ప్రేమపాత్రులైనవా రెవ్వరూలేరు. అందుచేత అతనికి తనఇష్టులతో కలిసిమెలిసి ఉండటం స్వేచ్ఛగా తనఅభిమానాన్ని వెల్లడి చెయ్యటం అతనికి చాలాకొత్త. లీలావతిమీద తనకున్నప్రేమ ఏవిధంగాచూపించాలో అతనికి తెలియదు. ఆమెతో ఇష్టంగా మాట్లాడ్డానికూడా అతనికి సిగ్గుగాఉన్నది. పూర్వం భార్యతో అతను అందరితో మాట్లాడినట్టు మాట్లాడేవాడు నిస్సంకోచంగా. లీలావతి అందరితోపాటుకాదిప్పుడు తనకు. పైగా రంగా రావు చొరవగలవాడుకాడు; తనలోతనకు నమ్మకంతక్కువ.

రెండోది లీలావతిమనసు అతనికేమీ తెలియదు. ఆమెనడగటానికి ధైర్యంలేదు. అతనికింకొకరిమనసు కనిపెట్టడంచేతకాదు అభ్యాసంలేకపోవటంచేత.

రంగారావు చాలాకాలమీదీనస్థితిలో ఉన్నాడు. భార్యతో సాధారణవిషయాలన్నీ సహజంగామాట్లా డినవాడు తనమనస్సు తెలిసేటట్టు ఒక్కమాటఅనబోతే గొంతుపట్టుకొనేది.

బైట పడలేకపోవటంచేత రంగారావుప్రేమ నీటిలో మడ్డిమాదిరిగా తేరుకోడంప్రారంభించింది. పైకి చూడటానికి తేటట్టేఅయిపోయింది. కాని చిన్నరాయిపడితే తిరిగి పైకివచ్చేస్థితిలోఉన్నది. ఆరాయి వెయ్య టం రంగారావుచేతకాదు. లీలావతి వెయ్యలేదు!...వ్యవహారం దైవంచేతుల్లోకి పోయింది.

రంగారావుకు జీవితంమీద విరక్తికలిగింది. మొదటిభార్యచనిపోయినప్పుడు జీవితాన్ని ఉత్తమమార్గా నికి తిప్పటానికి తనకు చాలా మంచిఅవకాశం కలిగింది. అది పోగొట్టుకొని తిరిగి మొదట్లోకివచ్చాడు. తన చిన్నతనంలో ఎవరైనా రెండోపెళ్ళి చేసుకుంటే చాలానీచంగా చూచేవాడు. "ఈయన కింకా ఏమిసంసార కాంక్ష" అనుకునేవాడు. రంగారావు ఏకారణంచేత వివాహంచేసుకున్నప్పటికీ సంసారకాంక్షకారణం మాత్రం కాదు. అతని కది మొదటినుంచీ ఎక్కువలేదు.

ఈవివాహం ఎవరికోసంచేసుకున్నట్టు? తనకు నిజంగా భార్య అవసరంకాదు. తనకుమారుడు గతించాడు. తనభార్య లీలావతికా? అతను ఊహించగలిగినంతవరకు ఆమెకు ఏవిధమైన సంతోషంఉండదు. కొంత పొరపడ్డతరువాత లీలావతి తనతో స్వేచ్ఛగా మాట్లాడుతుందేమోనని మొదట్లో ఆశపడ్డాడు; ఆఆశ తీరింది. అసలామె స్వభావం అంతేనేమో అనుకున్నాడు. ఆఅనుమానంతీరింది. ఆమె అప్పుడప్పుడు తనను చూడడానికివచ్చిన బంధువులతో చాలాస్వేచ్ఛగా, సరదాగా మాట్లాడుతూఉండేది.

తనతో అట్లామాట్లాడనందుకు రంగారావుకు లీలమీద కోపంరాలేదు. అతనికి ఎవరిమీదా ఎక్కువ కోపంవచ్చేదికాదు. తనతో మాట్లాడలేదంటే ఆమెలోపం ఏమీలేదు. తనకు ఆమెకన్న పెద్దకుమార్తె ఉండవచ్చును. ఆమూడుముళ్లు పడ్డందుకు లీల భర్తకు సకలమైన చాకిరీచేస్తూండేది. నిజానికామె మనస్సుమీద తనకేమి అధికారంఉన్నది?

ఆమెను వివాహంచేసుకున్నందుకు తన్ను క్షమించమని ఆమెను వేడుకుందామనుకున్నాడు. కాని ఆమె యెదట ఆమాటలు పైకివచ్చేవికావు. రంగారావుమనస్సులో పెద్దతుఫాను రేగుతున్నది. దానికి కారణమతనే చెప్పలేడు, ఒకవేళ చెప్పినా అందరూ "ఎక్కడో చిన్నపిల్లాడిలాగున్నావు"అని నవ్వుతారు. కాని సానుభూతి రాదు.

"ఇప్పుడు మాఅమ్మఉంటే ఎంతబాగుండును!" అనుకున్నాడు రంగారావు. తనకుతానే చిన్నపిల్లవాడైపోయినాడు. ఇంకోరకంటారంటే చిత్రమేముంది? లీలమాత్రం ఒక్కక్షణం భర్తవిషయం ఏమరుపాటుగా ఉండేదికాదు.

"పాపం! నన్నుచూస్తే భయంకాబోలు! అశ్రద్ధగాఉంటే చంపేస్తానని! పాపం, ఆమెకు నేనంత భయంకరంగా-మోటుగా కనపడుతూండాలి?" అనుకునేవాడు రంగారావు. పూర్వం తన మొదటిభార్య ఉన్నప్పుడు రంగారావుకెంతో ఇంటిపనిఉండేది. ఇప్పుడతనికి వేరేఏమీ పనిలేదు. ఉద్యోగంలేనిభర్తను చూస్తే భార్యకెంతఅలుసు! లీల కాఅలుసైనా లేదేం?

రంగారావుకు ఏదైనా వ్యాపత్తికలిపించుకుంటేతప్ప కాలంగడిచేటట్టులేదు: పిచ్చికూడాఎత్తుతుందనిపించింది. అయిదారుసంవత్సరాలక్రిందటివరకు రంగారావు గానకళ, చిత్రకళ మొదలైనవాటిల్లో ఎక్కువ పరిశ్రమచేస్తూండేవాడు. అతనిభార్య తనకు ఈకళలనుగురించి ఏమీ తెలియదనీ, తనకు వాటియందభిరుచి లేదనీ చెప్పుతూండేది. తరువాత రంగారావుకూడా అట్లాగేఅనిపించింది. అయిదారేళ్ళనుంచీ వాటిజోలికేపోలేదు. రంగారావెక్కడో పెట్టెలోపెట్టినఫిడేలుతీసి శ్రుతిచేసివాయించబోతే ఏమీ ఉత్సాహంలేకపోయింది; బలవంతాన ఒక అరగంటసేపువాయించి ఒకమూల పారేశాడు.

ఈసమయానికి చిన్నచిత్రంజరిగింది. చిన్నచిన్నవిషయాలు మనజీవితానికి ఎంత ప్రాముఖ్యతతెచ్చునో విచారిస్తే ఆశ్చర్యంకలుగుతుంది.

ఒకరోజు చీకటిపడ్డతరువాత రంగారావు ఇంటికివచ్చాడు. వంటింట్లో లీలావతి వంటచేస్తూ ఎవరితోనో మాట్లాడుతున్నది. గొంతతనికి పరిచయమైనదికాదు. ఎవరైనా స్నేహితురాలో, బంధువో లీల కనుకున్నాడు. అతనిగదిలోకి వారిమాటలు స్పష్టంగావినబడుతున్నాయి. లీలగొంతులోఉన్న ఉత్సాహంపట్టి తనరాకడ వారు వినలేదని రంగారావు గ్రహించాడు.

"మావారంతా కులాసాగాఉన్నారా? జానకీ!" అన్నది లీల. సంభాషణ ఇంకా మొదట్లోనేఉన్నది. రంగారావు కామాట వినబడేసరికి మనస్సు కరిగిపోయింది. పాపం, లీల తనవారికోసరం కలవరిస్తూఉంది

కాబోలు! సంభాషణ పెద్దగొంతులతోనే జరిగిపోతూంది. కాని రంగారావు వాసంభాషణవిషయంకట్టిపెట్టి ఏదోపనిచూచుకోటం మొదలుపెట్టాడు. వారిసంభాషణమాత్రం మతనిచెవిని అర్థంలేకుండాపడుతున్నది. ఈ విధంగా అయిదారునిమిషాలుజరిగింది.

జానకిఆ నేమనిపిగొంతు అకస్మాత్తుగా చిన్నస్థాయికివచ్చింది. రంగారావుచెవులూ అప్రయత్నంగా బాగా తెరుచుకున్నయి. రంగారావుకు వింటూన్నాననే తెలియదు!

"సరేకాని, పిల్లా! మీనాన్న ఏమన్నాడో తెలుసునా?...పాపం! మీఅమ్మానాన్న ఎంతదిగులుపడు తున్నారోనీకోసం...మీఅమ్మ నిన్నువదలిఉండలేదు! మీనాన్నకు వేరేదిగులు...మీఅన్నా మీనాన్నా చేరి నీపెళ్ళివిషయం ఎంతఎంతఉపన్యాసాలు! నువ్వనమ్మవే లీలా! మీఅన్న నిన్ను రెండోపెళ్ళివాడికెందు కివ్వాలని! మీనాన్నేమో బుద్ధిలేకఇచ్చాననీ!..."

జానకిపనిఅయిపోయింది. మౌనంవహించిఉన్న లీలదగ్గిర జానకి శెలవుతీసుకొనివెళ్ళిపోయింది.— మళ్ళీ మర్నాడువస్తానని వాగ్దత్తంచేస్తూ.

రంగారావు దీర్ఘంగా నిట్టూర్పుచ్చాడు. ఈమాట లతనిమనసెందుకు బాధించాలో తెలియలేదు. తన మామగారూ, బావమరిదీకలిసి ఇచ్చినఉపన్యాసాలు తనకు తానెన్నిసార్లో ఇచ్చుకున్నాడు. అప్పుడు తన మనస్సు చాలానిర్మలంగాఉండేది. తనుచేసినపనిచెడ్డదైనప్పుడు అందరూఎందుకనరు? పాపం, లీల! తన తండ్రి ఆమాటలన్నసంగతి విన్నతరవాత ఆమెగొంతు వినిపించలేదు. ఆమెకుమాత్రం తెలియదా?

ఏపాపానికైనా ప్రతిక్రియఉన్నది! దీనికి కనుపించలేదు! రంగారావు తానీమాటలువిననట్టు నటిం చాడు. ఆరాత్రి భోజనంచేసేటప్పుడు లీల చాలభయపడ్డదానిమాదిరిగా కనిపించింది. ఆమె అంతగోలపడుతుం దని రంగారావు వూహించలేదు. కాని ఆమెశ్రద్ధవిషయమయి మామూలుకన్న ఎక్కువగాఉన్నది. సెయ్యి వేసేసమయంలో లీల చేయివణికింది.

"చూడు!" అన్నాడురంగారావు అకస్మాత్తుగా. లీల ఆగింది. "నన్నుచూచి ఎందుకట్లాభయపడు తావు! ఆ! నాకన్నీ చేతనవునుకాని భయపెట్టడంచేతకాదు. నన్నుచూచి ఇంతవరకెవ్వరూజడవలేదు!"

లీల తలవంచుకొని మెల్లిగావెళ్ళిపోయింది. మళ్ళీవచ్చినప్పుడు రంగారావు "ఎవ రిప్పుడు వచ్చిన మనిషి?" అన్నాడు.

"మావాళ్ళఊరే! నాస్నేహితురాలు!" అన్నది లీల.

"అంతా కులాసాగాఉన్నారా?"

"ఆ!"

"ఊరికేచూడటానికావచ్చింది?"

లీల కొంచంతటపటాయించింది. "మానాన్న రెండుమూడురోజుల్లో వస్తాడనిచెప్పింది!" అన్నదిలీల.

"ఉహూ!" అన్నాడు రాంగారావు పరధ్యానంగా.

ఇంతలో ఏదోపండగయింది. జానకివచ్చినమర్నాడే రంగారావుమామగారిదగ్గరనుంచి ఉత్తరంవచ్చింది. ఆయన కుమార్తెనూ, అల్లుణ్ణీ పండగకుతీసుకొనిపోవటానికి వస్తున్నట్టు.

తనమామగారన్నమాటలు వెంటనే రంగారావు మరిచిపోయినాడు. ఆయనరాక అతనికి చాలాసంతో షంగాఉన్నది. మొదటిది శేషం లీల కొంతకాలం పుట్టింట సుఖంగాఉంటుంది. తరువాత తనకు లీలబరువు కొంతకాలం వదలుతుంది. ఆమెఉండగా అతనికి స్వేచ్ఛలభించేటట్టులేదు.

సరిగా సమయానికి మామగారువచ్చాడు. రంగారావాయనతో చాలామర్యాదగామాట్లాడాడు; లీలనుపంపటం తనకేమీ అభ్యంతరంలేదన్నాడు. తనకుమాత్రం కొంచంపనిఉందన్నాడు. నీకూ, నాకూ పని కాదానా అనుకున్నాడు మామగారు.

"నువ్వుకూడా రావలని నాకోరిక!" అన్నాడుమామగారు పైకి.

"ఈసారికి వీలులేకుండావచ్చింది. ఏబండికిపోతే వీలుగాఉంటుంది?" అన్నాడురంగారావు.

"త్వరగాభోజనాలయితే పన్నెండుగంటలబండి!"

అంతటితో సంభాషణచాలించి మామగారు కుమార్తెనుచూడబోయినాడు. రంగారావు తనపనిచేసుకుంటూ కూర్చున్నాడు. అయిదునిమిషాలయినతర్వాత రంగారావు తనమామగారు అతివేగంగా తనగది ప్రక్కగా వెళ్ళిపోవటంచూచాడు. అతనికాశ్చర్యంగలిగింది. అప్పుడే పదకొండుగంటలు కావస్తున్నది. మళ్ళీ ఈయనెక్కడికిపోతున్నాడు?

రంగారావు వంటచేస్తూన్న లీలదగ్గిరికివెళ్ళాడు.

"మీనాన్న ఎక్కడికిపోతున్నాడు?"

"ఊరికి కాబోలు"

"ఊరికా? ఏఊరూ? నిన్నుతీసుకొని పోతానన్నాడే?"

"నేను రానన్నాను."

"ఏం?"

"నాకిష్టంలేదు."

రంగారావు కొంచ మాలోచించాడు.

"అయితేమాత్రం భోంచేసిపోగూడదూ?"

"ఆయనకు కోపంవచ్చింది."

"ఎందువల్ల?"

లీలమాట్లాడలేదు.

"ఎవరిమీద?"

"నామీదనే!"

"ఎందుకని?"

లీలమాట్లాడలేదు.

"పాపం ఆయనకెందుకు కోపంతెప్పించావు? నాకు ఇంకోరికి కోపంవస్తే కష్టంగాఉంటుంది."

లీల తలఎత్తిచూచింది.

"పోనివ్వండి. ఆయనమంచివాడైతే నేను కోపంఎందుకు తెప్పిస్తాను?"

రంగారావుకు అర్థంకాని తృప్తిఒకటివచ్చింది మనస్సులో. అప్పటి కావిషయం అయిపోయింది. తిరిగి అతను భోజనంచేస్తుండగా నిజంతట్టింది. అకస్మాత్తుగా నేలగుద్ది "చూడు"అన్నాడు. అట్లాగేలెండి అతను భార్యను పిలవటం. లీల నిలబడ్డది.

"మీనాన్న నేమన్నావు?"అన్నాడు రంగారావు.

"నాముఖం చూడవద్దన్నాను."

"ఎందుకని?"

లీల అనుమానించింది.

"చెప్పవూ?" అన్నాడు రంగారావు దీనంగా.

లీల రంగారావువంక సంతోషంతో చూచింది. అత నంతవర కామెతో అమాత్రం స్వేచ్ఛగామాట్లాడి ఎరగడు.

"ఎందుకు పోనియ్యండి! ఆయనదగ్గిరకొన్ని పాడుగుణాలున్నయ్యి."

"ఏంచేశాడేం?"

లీల తికమకపడ్డది.

"ఏదో అన్నాడు లెండి." అన్నది చివరకు.

"నాదగ్గిరఎందుకు దాస్తావు? పాపం! అయినా నన్నుచూస్తే నీకేంనమ్మకం?"

"అదా నాఉద్దేశ్యం?"

"అయితే ఎందుకుచెప్పవ్?"

"చెప్పుతాను. భోజనంకానివ్వండి!"

"కానిస్తాను చెప్పు."

"నన్ను పొరపాటున మీకిచ్చేశాడుట......ఆయనవల్ల తెలీనిమాటలు మీరు పాటించుకోకండేం ఆయనముఖం చూడవద్దిక."

రంగారావుముఖం గంభీరంగామారింది. కొంచెంసేపతను నిశ్చలంగాకూర్చున్నాడు.

"ఆయనన్నమాటలో అబద్ధంఏమిటి?"

"ఎందుకట్లాఅంటారు? ఆయనకు మరీ వళ్ళు తెలీటంలేదు."

"నాకాయనన్నమాట చాలానిజంగాఉంది సుమా"

"ఆయనతో మీకెందుకు? మీకాయనెక్కువా? నేనెక్కువా?"

"నీకుకూడా ఆఆలోచనతట్టే ఉంటుంది. ఎందుకు దాచిపెడతావు? మీనాన్న అన్నమాట నిజమని నీకు తెలీదూ?"

"నేనా?... నేను అమాట నిజమనుకుంటున్నానా? ఈయన నిర్వాకి ఏంముంచుకుపోయిందనిరావాలి?"

"నీకు నిజంగా నన్నుచూస్తే ఇష్టమేనా?"

"అమాత్రం గ్రహించలేరూ? నేను మిమ్మల్ని చూచి అసహ్యించుకుంటే ఎవరిని చూచి సహించగలను?"

రంగారావు నిట్టూర్పువిడిచాడు.

"నన్నెంతఏడిపించావు? నన్నుచూస్తే నీకెట్లాఅసహ్యంలేదని అనుకుంటాను? నేను మీనాన్నకన్న అయిదేళ్ళుచిన్న."

"ఏంమాటలు! ఊరుకోండి. ఎవరన్నావింటే నవ్వుతారు."

"మరి నన్నుచూస్తే నీకుభయమా? లేకపోతే నాతోఎందుకు స్వేచ్ఛగామాట్లాడవు?"

"నాకు ఒకటేభయం. అతిగా మాట్లాడుతుంటే మీకసహ్యమేపోవని."

"ఆమాటకొస్తే అదీనిజమే! చూడు ఎంతసేపునించీ మాట్లాడుతున్నానో! ఇప్పుడు కాదులే నీపని."

లీల నవ్వుతూ వెనక్కుతిరిగి రెండడుగులువేసింది.

"చూడు" అన్నాడు రంగారావు.

లీల వెనక్కుతిరిగింది.

"ఏమీలేదులే!" అన్నాడు రంగారావు నవ్వుతూ. లీల నవ్వి వెళ్ళిపోయింది.

# దేవి

కుందుర్తి నరసింహారావుగారు

నుదుటబిత్తరిబొట్టు
చెదరుతుమ్మెదజట్టు
వదలుపావడకట్టు,
బెదరుచూపులగుండె పెకలించినావే
కదలుతూపులమనసు కరిగించినావు.

పలుకుపుప్పొడిపూఁత
తళుకుతెప్పలమూఁత
చిలుకనవ్వులకూఁత
తలఁచితేఁడే పెదవితాటించినాఁడే
వలచివాఁడే నన్ను వారించినాఁడు.

కాలియందెలపాట
వాలుగన్నులమాట
పాలబుగ్గలయూట
కాలుకదపఁగనీక కట్టివేసినవే,
పూలదండలుచుట్టు పులిమివేసినవి,

మొగలిరేకులువాడె
తొగరుపెదవులుమాడె
చిగురాకువసివాడె
వెగటునిట్టూర్పు చావేలవచ్చినదే
నగమైన నామేను జలదరించినది.

చిఱుము త్రియపుసొంపు
మఱిపెంపు తలవంపు
మఱపులేని తలంపు
కరగియీలేఖ నాకడకువచ్చినదే
మరల నాపెడబుద్ధి మాఱిపోయినది.

# మాతృదేవత

కల్యాణసింగ్ గారు

'జననీజన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ.'

'జననియు జన్మభూమియును స్వర్గముకంటెను మాననీయముల్.'

లోకమున 'అమ్మ'యను పదమునకంటె మధురతరమైనది మఱియొకటిలేదు. మనము వచ్చియురాని ముద్దుపలుకు లాడుట కారంభించినది మొదలు ప్రాణముపోవువఱకు అనుదినము కష్టములో, సుఖములో 'అమ్మ'యను పదము నోటినుండి వెలువడనిది యుండలేము. జాఱి పడినప్పుడు 'అమ్మ'; తెగులు వచ్చినప్పుడు 'అమ్మ'; కష్టమప్పుడు 'అమ్మ'; కష్టములో సుఖమప్పుడు 'అమ్మ'. అమ్మాయని పిలుచుటకు నోచికొననివానినోరు సారవిహీనమగు దరిద్ర మరుభూమి.

లోకమున మాతృప్రేమను మించినప్రేమ మఱియొకటి కానరాదు. బిడ్డలకై యుప వాసశ్రమములకోర్చి వ్రతములు పూజలుసలిపి పరులబిడ్డలనెత్తికొని ముద్దాడి పడరాని తిప్పలుపడి తుదకు పిండోత్పత్తియయినది మొదలు తల్లిపడుకష్టములు చెప్ప శక్యముగాదు. గ్రహణములు పట్టినప్పుడు పుట్టఁబోవుబిడ్డకు మొఱ్ఱియో తొఱ్ఱియో కలుగునని మంచముపైఁ గదలక మెదలక పండుకొనియుండి ఎన్నియో యిక్కట్టులకులోనై గర్భభారమును నవమాస ములుమోసి చిన్నారిబిడ్డను ప్రసవించును. అంతటితో తల్లికష్టములు గట్టెక్కునా? బిడ్డ ఆరోగ్యమునకు తాను పథ్యపానములుచేసి, బాలారిష్టగ్రహదోషాదులు కలుగకుండఁ గాపాడుకొనుచు బిడ్డయొడలు వెచ్చగానున్న నిద్రాహారములుమాని తనజీవితమును ధార వోయుచు నల్లారుముద్దుగాఁ బెంచుకొనును.

మాతృప్రేమను వర్ణింప నెవరితరము? చీమ చిటుక్కుమనిన నెంతయో యులజడి. బిడ్డకు కొంచెము నొప్పితగిలినచోఁ జెప్పరానిదుఃఖము. అట్లే బిడ్డచేయుపనుల కానందము కూడ. 'తాత్తా'యని బిడ్డమాట్లాడుట మొదలుపెట్టుట తల్లికి దేవతాగానమే. పాపాయి తప్పు టడుగులువెట్టుట మాతకు స్వర్గానందమే. చిట్టితల్లి కొంటెపనులు అమ్మకు హర్షదాయకమే. వరప్రసాదిని జంకనెత్తుకొని 'చందమామరావె జాబిల్లిరావె'యని గోరుముద్దల నారగింపఁ జేయుట జననికి మహాప్రీతి. చిన్నారినాయన అక్షరములు నేర్చుకొనుట మాతృదేవతకు సరస్వతీప్రత్యక్షమే. బంగారుచిట్టికి నీళ్ళుపోసి తలదువ్వి తిలకము సవరించి లాగును తొడిగి బడికిపంపించుట కన్నతల్లికి ఎంతఆనందమో ఎవరికెఱుక? ఇట్లు పుట్టినది మొదలు పెద్దయగు వఱకు గాఢప్రేమతోఁ బెంచి కంటికిఱెప్పలాగునఁ గాపాడు మాతృదేవత ఋణమును దీర్చు కొనుట కెవరికిసాధ్యము?

పరులకు కోతిపిల్లయయినను దనకు బంగారుకూన. బిరుసగు జుంజు వెండ్రుకలు, బిక్క మొగము, దాకనోరు, ఊసరపిఱ్ఱలైనను దనబిడ్డఁడు తనకు రత్నాలమూట, వరహాలప్రోగు. కాకిపిల్ల కాకికిముద్దుకదా! ఇట్టి ప్రేముడిలేనిచో బిడ్డ లోకమునఁ బెరుగుట కవకాశమేది? ఇతరు

లకు దుష్టుఁడైనను, తండ్రికిఁగూడ అనిష్టుఁడైనను దల్లికిమాత్రము ప్రేమాస్పదుఁడు. దుర్మార్గునియెడనే తల్లికిఁ బ్రేమ మెండు. తానెంతపాపియైనను బిడ్డయెడలఁజూపు ప్రేమవిషయమున మాత్రము తల్లి నిరపరాధి.

మన కేయాపద రాకుండఁగాపాడి మనల నెందఱు విడిచినను దానువిడువక మన క్షేమమును గోరునది యొక్క తల్లియే. మనకడుపునిండ సంతృప్తియగు భోజనము పెట్టవలయు నన్నఁ దల్లియే పెట్టవలయును. అందువలననే 'అమ్మాయని పిలిచి యన్నమడుగనివారు కుమ్మరి మనుద్రవ్వినట్టి గుంటర సుమతీ!' యని చెప్పఁబడినది. భోజనవిషయమునఁదల్లిని మించినవారుండరు.

"పరులతల్లిపెట్టు పరమాన్నమున కన్న
కన్నతల్లిపోయు గంజమేలు."

పొరుగింటియమ్మ నోటిలోవేసికొనుమని యేదేని గోరంతపదార్థమిచ్చిన దానిని పాపాయికిఁ దీసికొనిపోవలయును. తనది బీదస్థితియైనను, ఉన్న దానిలోనే సాధ్యమగు మంచి పదార్థములు పచనముచేసి తనకడుపు కట్టుకొని బిడ్డను బాగుచేయునుద్దేశము మాతకుఁగాక మఱి యెవరికుండును? ఇట్టి తల్లిలేనిబిడ్డ బ్రదుకు నిస్సారముగదా? 'మాతృహీనశిశుజీవనమ్ వృథా' అను వాక్యమెంత సత్యమైనది? 'తల్లికంటెను వేఱుదైవంబుగలదె' యని చెప్పుటలో నతిశయోక్తి కించిత్తయినను గలదా?

ఇట్టిప్రేమ మానవులలో మాత్రమేకాక పశుపక్ష్యాదులయందును గాన్పించుచున్నది. తాను మృత్యువువాతఁబడుచున్నప్పుడుకూడ గోమాత వ్యాఘ్రమునువేడి లేగదూడను ఒక్కమాఱు కన్నులారఁజూచి కడుపునిండఁ బాలిచ్చుటకు గంతునఁబోయి బిడ్డనుజూచుకొని బిడ్డప్రపంచమున బ్రదుకుటకుఁదగిన నీతులను బోధించుకొనలేదా? తనధనము, తనసర్వస్వము, తుదకుఁ దనజీవనముపోయినను సరియే బిడ్డ క్షేమముగానుండవలయుననియే మాత యభిలాషము. ఇట్టి నిర్మలప్రేమ లోకమున మఱియెచ్చటనైనను జూడఁగలమా?

ఒకప్పుడు దేశమంతయు అరిష్టపూరితమైయుండెను. పురోహితుఁడు దేవతలను బ్రార్థించెను. రాజునకుఁబ్రియతమమైన వారిని బలియిచ్చిన దేశము సుభిక్షమగునని దేవతలు చెప్పిరి. పురోహితుఁడు రాజకుమారుని దీసికొనిపోయెను. తనకుఁబ్రియతమమైన వారెవరని రాజ్ఞిని నృపాలుఁడడిగెను. బిడ్డయు, భార్యయు సమానులేయని యాతఁడనెను. బిడ్డను బలియిచ్చుటకు సిద్ధముగానుండఁగాఁ దల్లి పరుగుపరుగునఁబోయి "భూపతికిఁ బ్రియతమమైనదానను నేనుగాని నాబిడ్డకాఁడు" అనుచు దేవతలకుఁ దానే బలియయ్యెను. చూచితిరా మాతృప్రేమ యెట్టిదో!

బిడ్డను సన్మార్గమునఁబెట్టుటకుఁ దండ్రికంటెఁ దల్లి కవకాశమెక్కువగలదు. దినమెల్లఁ గష్టపడిపనిచేసి అస్సురుస్సురనివచ్చు తండ్రికంటెఁదల్లికి—ఇంటనుండి తనబిడ్డని భావ్యభ్యు

ధ్యేయమే లోకకల్యాణముగ నెంచు తల్లికి — చిన్ననాఁటినుండి బిడ్డను బాగుచేయుటకు సద్గుణములు నేర్పుటకుఁదల్లి కవకాశ మెక్కువ. శివాజీమహావీరుఁడగుటకుఁ గారణమేమి? చిన్ననాఁటినుండి అతనిమాత జీజీభాయి అతనికి శ్రీరామచంద్రాదిమహాపురుషుల దివ్యచారిత్రములను ఉగ్గుపాలతో రంగరించి పోయుటయే

ఒక్కొక్కప్పుడు తెలివితేటలుగలతల్లి తండ్రి లేనిలోటును గూడఁదీర్చును. అట్టిదానికిఁ దార్కాణము సర్. టి. ముత్తుస్వామిఅయ్యరు, దాదాభాయినౌరోజీల జీవితములు. వీరిరువురికిని జనకులు చిన్ననాఁటనే గతించిరి. అప్పటినుండి వారితల్లులే పేదవారైనను గష్టములు పడి తమ బిడ్డలను జదివించి సన్మార్గమున నడిపించిరి. వారిరువురును దుదకు మహాపురుషులైరి. ముత్తుస్వామిఅయ్యరు న్యాయమూర్తియై మహాఖ్యాతిఁబడసెను. దాదాభాయినౌరోజి దేశభక్తాగ్రేసరుఁడయి భారతపితామహుఁడయ్యెను.

మాతృభక్తిని గూర్చిన నిదర్శనములు పురాణములలోను బెక్కుగలవు. పరశురాముఁడు తనతండ్రియాజ్ఞానుసారము తల్లినిజంపి తిరిగి తండ్రియే దేనివరము వేఁడుమనఁగాఁ దనతల్లినే ప్రసాదింపుమనియెను. గరుత్మంతుఁడు తనతల్లి వినత దాస్యవిమోచనము చేయుటకు స్వర్గమునకుఁబోయి మహాకష్టముతో అమృతకలశమును దెచ్చెను. కౌశికుఁడను బ్రాహ్మణుఁడు తల్లిదండ్రులను బూజింపకపోఁగా నొకపతివ్రతహితోపదేశము ననుసరించి ధర్మవ్యాధుని కడకు వెళ్ళగా నాతఁడు భూసురునికి మాతాపితృపూజనుగూర్చి బోధించినట్లు చెప్పఁబడియున్నది.

ఎన్నికథలను జదివినను బ్రయోజనములేదు. 'మాతృదేవోభవ'యను వాక్యము మనుజుని కవశ్యస్మరణీయము. ప్రతిమానవుఁడును మాతృదేవతను భక్తిపూర్వకముగా నారాధించుట కర్తవ్యము. కల్యాణప్రదము. కమనీయస్వర్గహర్మ్యారోహణమునకుఁ బ్రథమసోపానము.

## ఈత చెట్టు

శిరోమణి వారణాసి గంగాధరశాస్త్రి గారు

ఆకసమునకు నొక్క నీడమన్నట్లు నీదు
శిరముపై వేనవేల్గూండ్లు చెలఁగియుండెఁ
జటిలసంసారముల నిన్ని జక్కఁబెట్ట
నేరదాక్షిణ్యమూర్తివో యీతచెట్ట!

కడువిశాలత లేదు నీకడనుజూడఁ
దనకుమించిన యున్నతత్వంబు లేదు
ఎట్టుభరియించుచుంటివో యెఱుఁగరాదు
పలువురువహింపఁదగు కుటుంబములనీవు.

కలరవమొనర్చు నీచాటకైరములను
బరులు హింసింపకుండఁ గాపాడఁదలఁచి
తీవ్రకంటకశరసముత్కీర్ణమైన
నీదు నెలవునఁజేర్చితే నేర్పుమీర.

సాధువృత్తుల నీనీడజాతములను
బోషణమొనర్ప సద్బుద్ధి వొడముటఁగన
నిమ్నజాతిసముద్ధరణేచ్ఛ నీకుఁ
దవిలినట్టులుతోఁచెడుఁ దరువతంస!



మైసూరు రాజభవనము.
దసరానిశలయందు దీపములచే అలంకరింపబడినప్పటిదృశ్యము.



మైసూరుకోటగుమ్మము: దసరానిశలయందు దీపములచే అలంకరింపబడినప్పటి దృశ్యము.

—ఛాయాచిత్రగ్రాహకులు: డి. అన్నాజీరావుగారు.



ఐరోపియను స్త్రీ నాట్యవిన్యాసము



గుర్రముతో చమత్కారము

# ఉసురు

ఏ. వి. సీతారామయ్యగారు ఎం. ఏ.,

అధికారంరాగానే కళ్లుతిరిగిపోతాయి ఎవరికయినాసరే. ఇక ఎప్పటికీకూడా ఆదేవిధంగా వుంటాననుకుంటాడు మానవుడు. ఏవిధంగావచ్చిందో ఆవిధంగానే పోతుందన్న సంగతిగుర్తించడు.

* * *

చేర్మనుగదాఅని చెప్పుకోవచ్చింది ముశిలి పాపం.

* * *

అందరూ ముశిలనేఅంటారు. దానిఅసలు పేరు యెవరికీ తెలీదు. యాభైఏళ్లుంటాయి. దానికికొడుకులు గాని, కూతుళ్లుగాని లేరు. అసలుబంధువులెవరయినా వున్నారోలేదోకూడా సందేహమే. ఏకాకిఅని చెప్పొచ్చు. ఆ స్త్రీకి ఐదు మైళ్ళదూరంలోవున్న పల్లెనుంచివచ్చింది చింతచిగురమ్ముకోటానికి. ఏదోవొకపావలా డబ్బులొస్తే రెండురోజులు కాలక్షేపంచేయవచ్చుగదాఅని. పదుముమ్ముండలమధ్య యెంతకష్టపడి సేకరించిందో ఆచిగురు.

ఊళ్లోకాలుపెట్టీపెట్టడంతోనే మార్కెటుకంట్రాక్టరుగుమాస్తాపట్టుకొన్నాడు 'కానీ' తెమ్మని. తిరుగుతూ అమ్మేదానివద్ద ఆవిధంగా జులుంచేసి తీసికోటానికి పీడికిహక్కులేదు నిజానికి. కాని యెవరుదీని తరఫునవాదించి ఆతలబిరుసుగుమాస్తాను మందలించగల్గినవారు? ఏకార్మికసంఘానికి అధ్యక్షుడుగానో రమ్మన్నారంటే వాళ్ళకెవరికీ అర్థంకాకుండా ఇంగ్లీషులో ధణుతెగిరేటు లెక్చర్లివ్వగల కార్మికనాయకు లనేకమంది. ఇటువంటివిషయంగనక యెక్కడయినాతటస్థిస్తే తుర్రున సైకిల్ మీద దాటిపోతారు.

తనదగ్గర కానీఅయినా లేదని చెప్పిందిముశిలి, కొంచెంఅమ్ముకుని యిస్తానంది. బ్రతిమిలాడింది. రెండ్రోజులనుంచి కూడూనీళ్లూకూడా లేకుండా కోశినచిగురని దీనంగాయేడ్చింది. చిగురుకోశేప్పుడు అకొమ్మలు తగిలి దోక్కుపోయినగాయాలుచూపింది. 'చిగురుకొంచెంఅమ్ముకోగానే తప్పకుండాయిస్తా నాయనా!' అని ఆక్రోశించింది. 'దిక్కులేనిముసలిముండని. కనికరించాలి' అని ప్రాథేయపడ్డది. వేటతెగనేలే కటికవాడికా జాలి! ఒకప్పుడు వాడికయినాకలుగుతుందేమో!

'ఏడ్చావులే యీవేషాలు నాదగ్గర పనికిరా'వన్నాడు. 'అనవసరంగా తన్నులుతింటావ్, తే కానీ' అని గద్దించాడు. కళ్లుయెర్రచేశాడు. చొక్కాచేతులువెనక్కిలాగాడు. హుంకరించాడు. కేకలువేశాడు. నానాగడబిడచేశాడు.

దీనంగాయేడుస్తూ అట్లానే నుంచుంది ముశిలి వణుకుతూ. కాలుస్తున్న బీడీ అసహ్యంగా విసిరి చిగురుతట్ట మీద వకతన్నుతన్నాడుగుమాస్తా. అదిరొయిగిరెళ్ళి మురుగుకాలవలో పడిపోయింది. రోడ్డంతాచిగురుమయం. అంతటితో పోలేదు గుమాస్తాకోపం. ముశిలిజుట్టుపట్టుకొని జరజరయీడ్చాడు ఆకంకర రోడ్డుమీద. ముశిలి చేతులూకాళ్లూకొట్టుకుపోయి రక్తమయమయింది. ఎలుగెత్తియేడుస్తుందిముశిలి.

'క్యాకర్ రహేహోతుంపద్మాష్' అంటూ వకసాహెబొచ్చాడు. నలుగురూమూగారు. ముశిలినివదిలి నిలువబడ్డాడుగుమాస్తా. కోపంమాత్రం అతడ్ని వదిలిందికాదు. పదిమందీకలిసి యిద్దర్నీ చేర్మనుగారివద్దకు తీసుకపోయారు. మట్టిలోకలిశిపోయిన ఆచిగురుకొంతవరకు తనరుమాల్లోపోగుచేసి ముసిలిచేయిపట్టుకొని ముందు నడచాడు సాహెబు-చేర్మను గారికిచూపిద్దామని.

* * *

ఎటువంటికఠినహృదయుడికయినా కంటనీరుతెప్పిస్తుంది ముశిలిదృశ్యం. చేర్మెనుగారుమాత్రం తొణకకుండా నిశ్చలంగాకూర్చున్నాడు చుట్టకాల్చుకుంటూ. చేర్మెనుగారితో మాట్లాడుతూకూర్చున్న వారి మిత్రుడుమాత్రం నిర్ఘాంతపోయాడు. కళ్ళవెంబడి నీరు గిర్రునతిరిగింది. దయారసపూరితమయినది మానవహృదయం. గుమాస్తాకు నాలుగురూపాయిలు జుల్మానావేశి అది ముశిలికిప్పిస్తే బాగుంటుందని మనవిచేశాడు. సాహెబు మొదలయినవారంతా 'షేమ్' అన్నారు. కాని స్నేహితుడిసలహాకూడా తోశివేశి 'ఆలోచిస్తాంలే. వెళ్ళండి'అన్నారు చేర్మెనుగారు. చేర్మెనుగారుగదాఅని యేదోచెప్పబోవచ్చింది ముశిలియేడుస్తూ. 'గోల చేయకపోవే' అన్నారు ముశిలితో చేర్మెనుగారు కఠినంగా.

అప్పటికే ఏదో గొణగవేగొణిగిందిముశిలి. గుమాస్తా దానివంక చింకంగాచూచాడు తనతాత్కాలిక జయానికి. ముశిలికివొళ్ళుమండింది. 'నాలాంటిముసలిదాన్ని కొట్టిన నీచేతులెన్నాళ్లుంటయిలేరా' అనితిట్టింది. ముశిలినిబయటకుతీసుకుపొమ్మని చేర్మెనుగారుకోప్పడ్డారు. వారిముందే ఆసాహెబు-కట్టుపనిచేసుకుండే ఆసాహెబు-పకరూపాయి తనవెస్టుకోటుజేబులోనుంచితీసి దానిచేతిలోపెట్టి బయటకుతీసుకుపోయాడు. అందరూవెళ్ళిపోయారు చేర్మెనుగారిప్రవర్తనకు నిరసనజూపుతూ. ఆయనయిబ్బందులేమిటో?

* * *

కాలచక్రం గిర్రునతిరుగుతోంది. కింకరుడే రాజౌతూన్నాడు. రాజే కింకరుడౌతున్నాడు. ఏనాటికేదియెట్లాజరగాలో అది ఆవిధంగా జరగకమానదుగదా!

* * *

ప్రజలంతా చెప్పుకోవొదలెట్టారు పకబీదముసలిదానికి లాటరీలో లక్షరూపాయిలొచ్చాయటని. ఆముసలిదెవరాఅని విచారణచేస్తే ఆనాడు మార్కెటుగుమాస్తాచేతిలో దెబ్బలుతిన్న చింతచిగురుఅమ్ముకునే ముశిలేనని తెలిసింది.

ఆనాడు సాహెబిచ్చినరూపాయితో లాటరీటిక్కెటుకొన్నది. భగవంతుడు లక్షరూపాయిలనుగ్రహించాడు దిక్కులేని ఆబీదముసలిదానికి.

మళ్ళీ బస్తీకివచ్చిందిముశిలి. చింతచిగురమ్ముకోటానికిగాదు. మొక్కుబళ్లువగైరాలు తీర్చుకోటానికి. తోవలో తానానాడు దెబ్బలుతిన్నస్థలందగ్గర వక్కక్షణంఆగింది. ముందునదిలోస్నానంచేశి మరీబయలుదేరాలనుకొని సాగిపోయింది.

* * *

నీళ్ళలోదిగి పకబుటకవేశిందోలేదో బ్రాహ్మడొకడుసంకల్పం ఆరంభించాడు. ఎవరయితే నేమిలెమ్మని ముశిలి బ్రాహ్మడు చెప్పినట్లల్ల చేస్తుంది. బ్రాహ్మడు అటూయిటూ దిక్కులుచూస్తూ మొత్తంమీద సంకల్పం అయిందనిపించాడు. చివరకి దక్షిణివ్వవచ్చిందిముశిలి. 'పిల్లలుగలవాణ్ణి. అమ్మా! కనికరించాలి' అన్నాడు దీనంగా. ముశిలి పైకిచూచింది. నిర్ఘాంతపడిపోయింది. బ్రాహ్మడు చాచినచేయితీశాడు. చేర్మెనుగారుఅన్నది అప్రయత్నంగా. పదిరూపాయీలతనిచేతిలోపెట్టి వెళ్ళిపోయింది గబ్‌చిబ్‌గా.

* * *

ఆనాడట్లాజరిగినతర్వాత చేర్మెనుగారిమీద విశ్వాసరాహిత్యతీర్మానం రావడం, తనపదవినిలుపుకోటానికి అంతాతగలేసుకుని యీవిధంగా నీరుకానులుపట్టేస్థితికిరావడం వగైరావిషయాలు ముశిలికి తెలీవు.

* * *

దోవలో సాహెబొకడు కన్పించాడు ముశిలికి. ఒకరినొకరుగుర్తించారు. ముశిలి తనకథఅంతా చెప్పింది. పదివేలుఆతని పేరట 'బ్యాంకి'లో వేసినట్లుగా కూడా చెప్పింది. వద్దన్నాడుసాహేబు. కాదు పుచ్చుకోమంది ముశిలి. ఆనందాశ్రువులురాలుస్తూ వెళ్ళిపోయాడు సాహెబు.

* * *

దేవాలయందాపునకువచ్చింది ముశిలి. రోడ్డుకురెండువైపులా ముష్టివాళ్లుకూర్చున్నారు. వికలాంగులు, వికృతాంగులు, గ్రుడ్డివారు మొదలయిన అనేకరకాలవారు గోలగా కేకలువేస్తూ వచ్చేపోయేవారిని యాచిస్తున్నారు. ఒక్కొక్కరికి అణా బేడా యిస్తూవస్తున్నది ముశిలి. 'అమ్మా' అని రెండు మొండిచేతులుచాచాడు వకకుంటివాడు. 'ఎందువలన నీచేతులిట్లాఅయినయి?' అని అడుగుతూ ఆతనిముఖంవంక చూచి స్తంభించి పోయింది ముశిలి. వాడుకూడా చకితుడయిపోయాడు. తన మొండిచేతుల్ని వెనక్కి తీసుకున్నాడు. ఆమె వెళ్ళి పోగానే తనను వుద్యోగంలోనుంచి తీసివేశారనీ, తరువాత తానొకముద్రాలయంలో పనిచేస్తుండగా వక నాడు తనచేతులు యంత్రంలోపడి నలిగిపోయినాయనీ దానిమీద ముద్రాలయాధికారులు తననుపనిలోనుంచి తొలగించారనీ చెప్పకొచ్చాడు కళ్ళవెంబడి నీరుకారుస్తూ. ముశిలికికూడా కళ్ళవెంబడి నీళ్ళువచ్చినయి. రొండినుంచి వక ఇరవైరూపాయాలు తీసియిచ్చిందివాడికి. ఏమో చెప్పబోయాడు. ఇంతలో దేవాలయం లోకి అదృశ్యమయిపోయింది ముశిలి. వాడుకూడా ముశిలిపోయిన దిక్కే చూస్తూ నిలువబడిపోయాడు ప్రతిమమాదిరి.

## శారదాగమము

శ్రీమతి కొరప్రోలు వేంకటరంగమ్మగారు

పృథ్వి కొకవింత కాంతిని పొందుపరచి
సలిలములకును నైర్మల్యసరణిఁగూర్చి
పావకుని నూత్నకాంతుల పట్టుజేసి
పవనునకు మృదులోర్మ్మలు వదిలబరచి
విగతజలధరమగు వ్యోమవీథినిండి
చంద్రకాంతి దువ్వలువపై చెఱఁగుజార
తారహారంబు లురముపై తాండవింప
చారుఘనసారచందనచర్చ మెరయ
వికచనవమల్లికాదామవిభవమమర
కాశసుమచామరంబులు గ్రాలుచుండ
హంససారసగానంబు లలరుచుండ
కమలకల్హారకైరవగరిమ మెఱయ
మధురసంగీతషట్పదమహిమదనర.
చివురుకెంగేలుపై వేడ్క చెన్నుమీరు

బాలభాస్కరుకరకాంతి పరిఢవింప
బ్రహ్మవంశ్యులు వేదతత్పరతమెలఁగ
రాజరాజులు నీరాజరాజినొసఁగ
వసుధ నవరత్నమాలలు వైశ్యులిడఁగ
నిత్యపరిచర్యసేవకులై జరుపుచుండ
విల్లునమ్ములుపట్టుకు వేడ్కమీర
బాలబాలిక లట బరాబరులుసేయ
నెచటఁజూచిన నీపూజ లెసఁగుచుండ
నెచటఁజూచిన నీమూర్తి యలరుచుండ
నెచటఁగాంచిన నీశక్తి యమరుచుండ
విశ్వమంతయు నీవయై వెలుగుచుండి
భారతీయుల కఖిలసౌభాగ్యమిడఁగ
అరుగుదెంచెదవమాత! ఓయమృతపూత!
శారదాదేవి! నీకిదే స్వాగతంబు.

# మా దసరా పంతులు

అబ్బరాజు వేంకటరంగారావుగారు

ఇంతటింతటిబుడతలు వింతగొల్పు
దుస్తులన్ దాల్చి ఘనవీరమూర్తులట్లు
విల్లునంబుల చేబూని వెంటనంట
తాత 'మూర్తాని'కిచ్చిన పాతధోతి;
తండ్రిపెళ్లికి 'సాపీసు' సరిగసెల్ల;
పుట్టిపోయినకుఱ్ఱన్ని పురిటినాటి
జరిగపేటంచుబిలగుడ్డ; సంతరించి,
*'నార్మలుస్కూలు' చదివెడి నాఁడు, తాను
కోరి కుట్టించుకొనియున్న కోటుదాల్చి,
భార్య తొలిచూలిసీమంతకార్యమపుడు
తూర్పుచుట్టాలుమఱచిన దొంతికఱ్ఱ
చేతఁబూనుచు నోటనుచుట్టమీటి
మధ్యమధ్యనుకుఱ్ఱల మందలించి
చిత్తజల్లులు తన్నేమి సేయుననుచు
ఠీవిపెంపొంద పంతుగ యీవికొఱకు
బయలుదేరెను 'దసరాల' పంతులయ్య.

* * *

రేపుమాపనివేపక నప్పుడపుడె
చాలుననుదాక వరహాలు రాలుకొఱకు
గ్రామదేవాలయంబుల కడకునేగి
భక్తి దైవారపద్యముల్ పాడఁజేయు.

* * *

"పప్పుబెల్లాలు తెండని;—పంతులకును
రూకలిమ్మని;- జయమౌను మీకటంచు"
బాలదీవెన లింటింట పాడుకొల్పి
చనును దసరాను యెట్టులో సాగనంపి.

* * *

విజయదశమన నెట్టిదో? విల్లునంబు
లేటికో? దేశమంతట నేటయేట
నేల యీసంబరంబులగోలలంచు?
సుంత యోచింప డాతఁడు స్వాంతమందు!

* * *

ఏలయోచించు? నాతని కేమిలోటు?
జీతభత్యాలుతగ్గునా? జీవితంపు
శకటచక్రాలు ముక్కలై సాగకున్న?
'అన్నగతప్రాణి' యని మున్నువినెనుగాదె!

* * *

వీరరక్తము వెచ్చించి విజయధ్వజము
దేశదేశాలనెలకొల్పి దేశమెల్ల
సంతసంబున నుప్పొంగుసమయమద్ది.

* * *

అరులజెండాడి స్వాతంత్ర్యసారమెల్ల
జుఱ్ఱజుఱ్ఱకు జుబ్బన జాఱగాఁగ
లొప్పిరోజుచు జుఱ్ఱిన రోజులవ్వి.

* * *

చివికిజీర్ణించి శల్యావశిష్టయగుచు
దాస్యభారంబుచేఁగుంకు తల్లిఁగాంచి
కంటతడిపెట్ట 'నోచని' కాలమిద్ది.

* * *

దేశకాలాలమార్పుల తెన్నుబోక
నాటికథలను తాతల నాడెమఱచి
విజయవీరులస్మరణంబు విస్మరించి,
పాడుకాసులకోస మీపంతులయ్య
ప్రాతయాచారమని పైకి బలుకుచుండి
యూరియూరికి నింటింటి కుఱుకుచుండె—
చదువులంబట్టి విజ్ఞానసారముండు
శేరుపిండికి రొట్టె లేనూర్లవచ్చు?

* ఇప్పటి 'ట్రైనింగు'నకు వెనుకటివారువాడు పర్యాయపదము.

* * *

# భావకుసుమములు



మిత్రమా! పంకిలములో పెరిగినవని రక్తరాగరంజితంబులగు పద్మంబుల పరిత్యజింతువా?—దివ్యశక్తిసంపన్నులగు ధీమంతుల ప్రవర్తనములలో స్వల్పదోషములున్నవని వారి యమూల్యోపదేశముల నధిక్షేపింపకుము.

భోగపరాయణా! తమ సర్వస్వమును ధారపోసి పరోపకారమునకై పాటుపడుచున్న వారిని జూచి వెఱ్ఱిమొగములని పరిహసించుచుంటివా? బురదగుంటలో దుముకలేదని మానవులజూచి సూకరము జాలినొందుచున్నదికదా!

సోదరా! నీముఖమందముగ లేదని యద్దమును దూరిన నేమిలాభము?—నీ యోగ్యతాయోగ్యతల ప్రతిబింబములగు లోకులను నీచులని నిందింపకుము.

మానవుడు సుందరుడు. అతనిజ్ఞాన మంతకంటెను సుందరమైనది; కాని సత్ప్రవర్తనముకంటె సుందరమైన దీప్రపంచమున నేమున్నది?

మనతలంపులప్రకారము కార్యములు జరుగవలెనని యెదురుచూచుట భగవంతుడు మనకంటె బుద్ధిమంతుడుకాడని తలచుటకంటె వేరుకాదు.

ఫలవంతమగు వృక్షమునకే పాంథులగాలవిసురులు; పరోపకారశీలునకే పామరజనదూషణలు!—ఇవి పూర్వజన్మకర్మఫలితములు కాబోలును!

రచయిత
ఆకుండి
సత్యనారాయణగారు

* * *

# రాక్షసకృత్యాలు

కె. కుటుంబరావుగారు

౧

గణపతికి మేనమామగారింట్లో అడుగుపెట్టేవరకూ అనుభవంలేదు కాని అభిప్రాయాలున్నై. ఉన్న అభిప్రాయాలేమో చాలాదృఢంగా కూడా ఉన్నై.

మొదటిసంగతి అతనికి స్త్రీనిచూస్తే గౌరవం లేదు. అతనికి ప్రేమలో నమ్మకంలేదు. వివాహం ఇష్టంలేదు. పెళ్లి చేసుకోటం, పిల్లలనుకనటంకంటె నీచమైనపని లేదని అతని దృఢమైననమ్మకం. పిల్లలను కంటుంది కనక నే స్త్రీ అతని దృష్టిలో లోకువై పోయింది.

లేకపోతే పురుషోత్తంగారి రెండో అమ్మాయి మణిని అతనికిచ్చి ఉండవలిసింది. ఆయనకిద్దరాడపిల్లలూ, ఒకలక్షరూపాయలఆస్తీ, అమితమైన పెంకెతనం తప్ప చెప్పుకోదగినవేవీ లేవు. ఆయన కెంతతట్టితే అంత. అకస్మాత్తుగా ఆయనకు గణపతి మణిని చేసుకుంటే తన సగంఆస్తికి యజమాని అయ్యేవాడుకదా, దాన్నికూడా వ్రతంకోసం తోసేశాడుకదా, అతనికి తప్పకుండా ఇప్పటికైనా సగంఆస్తిఇచ్చి ఇంట్లో ఉంచుకోవలిసిందే అని తట్టింది ఒకరోజున. ఆరోజే గణపతికి ఉత్తరంవెళ్ళింది. మూడోరోజున గణపతి దిగాడు.

ముందు గణపతికి ఇంట్లో అడుగుపెట్టగానే మణి కనపడ్డది. మణికి పదిహేనోఏడు. రజస్వలాఅయి రెండుసంవత్సరాలయింది. కాని కాపరానికింకా పోలేదు. గణపతి మణినిచూసి అప్పటికి చాలాకాలం అయింది. ఇప్పుడామెను చూడగానే అతనికి ఆశ్చర్యం కలిగింది. మణి అంతబాగుంటుందని అతని కెన్నడూ తట్టలేదు. ఆభారం అప్పటికంతటితో పోయింది.

గణపతికి మేనమామ మంచి ఆతిథ్యం ఇచ్చాడు. ఇద్దరూ సంసారవిషయాలు మాట్లాడుకున్నారు.

ఇంట్లోకూడా గణపతికి వేరే ఒకగది ఉండటం అలవాటు. అందుకని అతను మేడమీద ఏదైనాగది ఖాళీగా ఉంటే ఆక్రమించుకుందామని బయలుదేరాడు. మణి వెంటవచ్చింది. అసలు మణే అన్నది పైన ఒకచక్కనిగది ఉందని.

మెట్లెక్కుతూ గణపతి "మామయ్యకు ఇంటి విషయం ఇంతశ్రద్ధలేదేం? ఈ మెట్లపక్కన నాలుగు రూపాయలుఖర్చుచేసి అడ్డంకట్టించరాదూ? ఎవరైనా పడిపోలేకేంద?" అన్నాడు.

"మాకందరికీ అలవాటే!" అన్నది మణి.

మణి చెప్పిన గది మెట్లకుఎదురుగానే గజం దూరంలో ఉంది.

"చాలా బాగాఉంది. గది కాస్తబాగుచేస్తే!" అన్నాడు గణపతి.

"నేను బాగుచేస్తాను బావా!" అన్నది మణి.

మణి గదిశుభ్రంగాఊడ్చి బాగుచేసేలోపల గణపతి ఎక్కణ్ణించో రెండుకుర్చీలూ ఒకబల్లా పట్టుకొచ్చాడు. గణపతికి గది అమరింది.

"బాగానేఉంది. కిందినించి కేకపెడితే చక్కగ వినిపిస్తుంది. నేనిక్కణ్ణించి వెళ్ళేలోపల ఇల్లుకొంత మరమ్మతుచేసి మరీపోతాను...కిందికిపోదాం పద" అన్నాడు గణపతి. అతనికి మేనమామ ఉద్దేశం తెలీదు. ఆయనచెప్పలేదు. అతను నసుకోటం ఒకనెలరోజులుండి తిరిగి ఇంటికిపోదామని. ఇదొకవిధమైన పెంపకమని అతనికి తెలీదు.

౨

గణపతికి కాలంగడిచిన కొద్దీ తనలో తనకు నమ్మకం తగ్గటం ప్రారంభించింది. మొదటమొదట అతను నమ్మకపోయినాడు కాని అతనిలో ఒకవిధమైన మార్పుకలగటం మొదలుపెట్టింది. నిజంగా మణి తనాకర్షిస్తున్నదంటే అతనికి నమ్మకంకలగలేదు.

కాని ఆమెనుచూస్తే తనకు కలుగుతున్న వికారం ఆకర్షణకాకపోతే ఏమిటి? తన్ను స్త్రీ ఆకర్షించటమేమిటి? ఆఆకర్షణ తనమనస్సుకు అసహ్యకరం కాకపోగా చాలా ఉత్సాహకరంగా ఉండటమేమిటి? నిజంగా స్త్రీ తననుకున్నంత చెడ్డదికాదేమో? మణిలో ఏమీ చెడున్నట్టు కనపడలేదు. తనకు స్త్రీని గురించి ఏమీ తెలీదని గ్రహించాడతను.

అయినా మణికీ తనకూ ఏంసంబంధం? మణి ఒకరి సొత్తయిపోయింది. ఆమాటఅనుకుంటే అతనికి చాలా కష్టం కలిగింది. తనలోపం లేకుండా అతను సాధ్యమైనంతవరకు మణిని తప్పించుకుతిరిగేవాడు. మణి ఎక్కడవస్తుందోనని భయంకూడా ఉండేది. కాని తీరా వచ్చింతరవాత అతనిమనస్సు అవశమైపొయ్యేది. మణి తనకెదురుగాకూర్చుని ఏదో విషయాలు మాట్లాడుతుంటే వినటంవల్ల పాపం ఏమిటి? పోనిమ్మనుకునేవాడు కాని ఆమె అవతలికిపోయినతరవాత మణి రాకుండాఉంటే మనస్సెంతశాంతంగా ఉండేదనిపించేది. ఎప్పుడో చదివి అసహించుకున్న ప్రణయకథలన్నీ అతనికిప్పుడు జ్ఞాపకంవస్తుండేవి. ఇటువంటి చిన్న చిన్న చిటుకులతో అతని హృదయంరగులుకోటం మొదలుపెట్టింది. ఆమంటను మణి బావకు అనేక విధాల సహాయంచేస్తూ ఆజ్యంపోసి పెద్దజ్వాలగా చెయ్యటం మొదలుపెట్టింది.

అతనప్పుడు మణి నెందుకుచేసుకోలేదు? ఈజీవితంలో అన్నీ పొరపాట్లే కనిపిస్తాయేం? అప్పుడప్పుడు గణపతి "ఇక ఈఇంట్లో ఎంతకాలమో నిలవలేను!" అనుకునేవాడు.

గణపతి మేనమామగారింటికివచ్చి నెలరోజులైంది. ఒకరోజున అతనికి వళ్లుతెలియని జ్వరంవచ్చింది. మణి ఉపచారంచేస్తూవచ్చింది. మణికి కావలసినంత స్వతంత్రం. ఆమెబావతో స్వేచ్ఛగా మాట్లాడుతున్నందుకు ఎవరూ తప్పుపట్టలేదు. గణపతి రెండుమూడు రోజుల్లో సహజస్థితికివచ్చాడు.

తరవాత సరిగా వారంరోజులకు కాబోలు మణి భర్త అకస్మాత్తుగా మరణించినవార్త వచ్చింది.

## 3

ఈదుఃఖంలో గణపతిని గమనించిన వారెవరూ లేరు. అతనెక్కువకాలం గదిలోగడపటం మొదలు పెట్టాడు. మొదటమొదట అతని ఆలోచనలు మణి మీదనే ఉన్నై. మణిభర్తపోవటం తనతప్పే ననిపించిందతనికి. తనెప్పుడో చేసిన సుకర్మను మెచ్చుకుని భగవంతుడు మణికీ తనకూ మధ్యభర్తను తీసేశాడు. కాని తనుమణిని ఈస్థితిలో వివాహంచేసుకోగలడా? ఉత్తది! మణి ఇప్పుడు విధవ. నిన్నటిమణికాదు. తనకు విధవావివాహాలు ఎన్నటికీ ఇష్టంకావు. ఇక చేసుకుంటే మణికోసం చేసుకోవాలికాని అయినా దీనికింత ఆలోచన ఎందుకు? మణిని తనెన్నటికీ చేసుకోలేడు. అసంభవం. అతని కంతవరకు రూఢిగా తెలుసు.

మణిసంగతి ఏమవుతుంది? ఏమవుతుంది? తన చనిపోయిన చెల్లెలు సావిత్రికైనట్టే అవుతుంది. ఎందువల్లో అతనికి సావిత్రి విధవైనప్పుడింత కష్టంగాలేదు? అతనప్పుడు మనిషికాదు. రాక్షసుడు. సావిత్రికి పాపం కేశఖండనంచేశారు. తన బలవంతంలేకపోతే ఆపని తనతండ్రిని మిగిలినవారు చెయ్యనిచ్చేవారు కారు. ఆరాక్షసకృత్యానికి తనేకారణం. అహా! భగవంతుడా!

అది తలచుకోగానే గణపతిగుండె బద్దలయిపోయింది. కళ్ళవెంట నీరుకారటం మొదలుపెట్టింది. సంవత్సరంకింద అతనిలో అంతరాక్షసత్వం ఉంది కాబోలు. సావిత్రిలోపల తన్నుచూసి ఎంతభయపడ్డదో! ఏమనుకుందో! గణపతిపక్కమీద బోర్లా పడుకుని ఏడవటం మొదలుపెట్టాడు. ఆ దుఃఖం ఎంతకూ తెగలేదు. సావిత్రి చావుకూ వైధవ్యానికీ ఏమీ సంబంధంలేదు. కాని ఆమెచచ్చిపోవటం అతనికి ఉపశమనం చెయ్యకపోగా దుఃఖకారణమైంది. ఆచావుక్కూడా తనే కారణం. తనీప్రపంచంలో పుట్టకపోతే ఇంత రాక్షసకృత్యాలు జరగవు. ఇప్పుడేమిచేస్తే తనపాపం పరిహారం అవుతుంది? ఏంపరిహారంకాకపోతే? అది తన్నుదహించినా పాపంలేదు।

ఆసాయంత్రం గణపతి తప్ప తక్కినవారంతా ఊరికి వెళ్ళారు మర్నాడు తిరిగివస్తామని చెప్పి. ఆరాత్రి అతనికి సాక్షాత్తూ నరకమనిపించింది. మర్నాడల్లా ఎట్లాగడిచిందో అతనికి తెలియదు. హోటల్లో భోం చేసివచ్చాడు. అనుకున్నప్రకారం రాత్రికి రాలేదు వెళ్ళినవాళ్ళు. గణపతి భోజనంలేకుండానే పడుకున్నాడు.

మూడోనాడుదయం అంతా తిరిగివచ్చారు. కాని అతనెవ్వరినీ గమనించేటట్టులేదు. అతని ఆలోచనల్లో, కళ్ళల్లో ఒక్క వ్యక్తి. ఒక కేశరహితఅయిన బాల వితంతువు. అతను ఎరుగునో ఎరగడో కాని అతనామెను గురించి విడవకుండా ప్రార్థన చేస్తున్నాడు. అతనిమనస్సులో దుఃఖం లేదు. ఆమనస్సులో మణి లేదు. మణివైధవ్యం లేదు. ఇక ఏమీ లేదు. పశ్చాత్తాపంకూడా లేదు. ఆరూపం అతనిమనస్సులో పాతుకుపోయింది. అతనికి కాలగతి తెలీకుండాపోయింది. మధ్యమధ్య అసందర్భంగా "నేనే చేశాను! రాక్షసుణ్ని!" అని గొణుక్కుంటూ ఉండేవాడు. ఏభావం అయినా అతిగాపోయినప్పుడు వెర్రినిపోలుతుంది.

౪

ఈలోపల మణి జీవితంలో గొప్పమార్పులు జరుగుతున్నై. ఒకప్పుడు గణపతికి తట్టిన ఆలోచనే పురుషోత్తంగారికి తట్టింది. మణికి కేశఖండన చెయ్యాలని తీర్మానించాడు.

చాలామంది అనేకరకాలుగా చెప్పారు.

"ఈ ఒక్క పనికి వెరిస్తే ఆపని దానికి ఎంతో పాపం చెయ్యటానికవకాశం ఇస్తాం. అనేక దుర్బుద్ధులు పుడతై. కొంతకాలమైన తరవాత పునర్వివాహమంటాయి. నాకు తెలీదా? మణి సావిత్రికన్న చిన్నదా? దానికి తీయించారు కారా జుట్టు? నేనొప్పుకోను. నేను మాబావకన్న (గణపతి తండ్రి అన్నమాట!) తక్కువగుండె నిబ్బరంకలవాణ్ణా?" (ఇందులో అహంకారం కొంత!) అది పురుషోత్తంగారివాదన.

మణి కీవార్తవినగానే ప్రాణం పోయినట్టయింది. తనకు సహాయం చెయ్యగలవారెవరు? గణపతిస్థితి ఎవరు గమనించకపోయినా మణి గమనిస్తున్నది. అతను కొంతకాలంనించీ అదోరకంగా ఉంటున్నాడు. ఎప్పుడూ పైనే ఉంటున్నాడు. సరిగా భోజనం చెయ్యటంలేదు. మర్నాడే తనకు ప్రాయశ్చిత్తంచేస్తారు. అతనొక్కడే తనకుదిక్కు.

మణి కేశఖండనను గురించి గణపతికేమీ తెలియదు. రాత్రి తొమ్మిదిగంటలు దాటింది. అతనాపూట భోజనం చెయ్యలేదు. కిందికిపోలేదు. పక్కమీదపడుకుని తపనపడటం మొదలుపెట్టాడు.

తలుపు చప్పుడయింది.

"బావా!"

మణి! తన్ను రాక్షసత్వాన్నించి మానవత్వానికి లాగిన మణి! అతను లేచి తలుపుతీసి మణిని లోపలికి రానిచ్చాడు. మణి ఏడుస్తున్నది.

"మణీ!"

మణి ఏడుపు జాస్తయింది.

"ఎందుకు?" అన్నాడు గణపతి అర్థంలేకుండా.

"రేపు—నా—నాజుట్టు—" పైన మణికి మాట రాలేదు.

"నీకా?"

మణి కళ్ళుతుడుచుకుంటూ తలఊపింది.

"ఎవరు?"

"నాన్న."

గణపతి మాట్లాడలేదు. ఇంకా రాక్షసులున్నారన్నమాట ప్రపంచంలో!

"నాకు జుట్టు తీయించుకోటం ఇష్టంలేదు బావా!"

గణపతికళ్ళవెంట నీళ్ళుకారటం మొదలుపెట్టినై. శుష్కించిపోయినట్టు కనపడ్డహృదయం తిరిగి చెమ్మగిల్లింది. సావిత్రికూడా ఇట్లాగే అనుకుని ఉంటుంది. సావిత్రి ఎవరితో చెప్పుకుంటుంది?

"నేనేం చెయ్యను? మణీ!"



టోకియోనగరమందలి యొక దృశ్యము



తొమ్మిదడుగులు పొడవుగల మనుజుడు.

"నువ్వాపలేవా?"

"నేను దుర్మార్గుణ్ణి! అనాథను! నా చేతేమవుతుంది?"

మణి తలవంచుకుని వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. అయిదునిమిషాలయింది. గణపతి అక్కడేనిలబడ్డాడు. అతని కక్కడలేనిశక్తిరావటం ప్రారంభమైంది. రక్తం వేగంగాపారటం మొదలుపెట్టింది. శరీరం పొంగిపోయింది. ఒకవిధమైన తీర్మానానికివచ్చింది మనస్సు. కనిబొమలు ముడిబడ్డై.

తన శరీరంలో ప్రాణముండగా మణికి జుట్టెట్లా తీస్తారో చూస్తాడు! తనకామాత్రం మగతనంలేదా? తనక్కడవుండగా ఇంకోరాక్షసకృత్యం జరగనా? ఉత్తది. గణపతి తలుపుతీసుకుని బయటికి పరిగెత్తాడు.

ఇంకా పురుషోత్తంగారూభార్యా నిద్రపోలేదు. మణి నిద్రపోతున్నట్టు పడుకుంది కాని నిశ్శబ్దంగా ఏడుస్తున్నది. ఇంతలో దభాలునపెద్ద చప్పుడైంది. కేక వినపడ్డది. పురుషోత్తంగారు లేచికూర్చునివిన్నాడు. ఏమీఆకళించలేదు కొంతసేపు. పైన మూలుగు వినపడ్డది. కొంపమునిగిందని భార్యాభర్తా దీపంతీసుకుని బయటికి పరిగెత్తారు. మెట్లకిందనుంచి పట్టటానికి వీలులేకుండా గణపతిశరీరం మసులుతున్నది. అంతా నెత్తురుమయం. అతని మొహం భయంకరంగావుంది. పురుషోత్తంగారు "గణపతీ!" అన్నాడు.

గణపతి మూలిగాడు.

"ఏమిటిది?"

"నేనే చేశాను!... రాక్షసప్పని!" మాటలు స్పష్టంగా వినపడలేదు. పురుషోత్తంగారికి దగ్గరికిపోవటానికి ధైర్యంలేదు. ఇప్పుడే కాళ్ళు వణుకుతున్నై.

"నాప్రాణం ఉండగా... మణికిజుట్టు... నాదే ఆ పాడుపని!" గణపతి ఒకపక్కకుపొర్లి నిశ్చలంగా పడుకున్నాడు. అతనినోటివెంట ఇంకేమీ గొణుగుడు వినపడలేదు.

# ప్రణయభిక్ష

శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు

నీమనోహరగీతికాశ్రుతులదోగి
వర్ణనాతీతసౌఖ్యానుభవమువడసి
పులకలందున నామేను మునుగుచుండ
లీనమగుదును నాథ! నీలోననిపుడె.

కారుమొయిలులచేతను గగనమెల్ల
అంధకారమ్ము నలుదెసలావహించె
నీదుకైదండబాసి నే నిలువలేను
హృదయనాయక! పాలింప వేగరమ్ము.

చారుశారదయామినీచంద్రకాళి
ప్రేయసీ! యని నీవు ప్రేమమీర
బిలిచినంతనె ఓ! యని బలుకుచుందు
విమలమందాకినీలసద్వీచికలను
తేలిపోదాము అలవిరి తెప్పలెక్కి.

మోముచిరునవ్వుసుధ లలమోడ్చగనుట
ప్రేమవాత్సల్యరసము వర్షించునట్టి
రాగయుతమైన నీమధురాధరమున
నీయగాధపుప్రేమ నిండిపోయె
లీనమగుదు నాథ! నీలోననిపుడె.

ప్రణయసందేశహారులు నక్షత్రకోటి
శాంతసంతోషవిమలవీక్షణములందు
నీదుమృదుకరపరిరంభమోదగరిమ
నందు స్వర్గీయసుఖమున కవధిలేదు
వేడెదను నాథ! ప్రేమభిక్షకొరకు.

# రహస్యము

పురాణం కుమార రాఘవశాస్త్రి గారు బి.ఎ.

౧

ఒక స్త్రీయొక్క నిరాడంబరజీవితమిది. విశ్వమానవజీవితము నిరూపించే గొలుసుకు ఒకచిన్నకొక్కె మీపేదరాలిచరిత్ర. ఆమె హృదయపుటీధ్వనులెప్పుడూ స్వర్గమార్గాన్నే అనుసరించేవి.

హిందూస్త్రీకి ప్రపంచము చాల సంకుచితమైనది. కాని యీచిన్నివలయములోనే సంచరించుతూ, దానికివన్నె తెచ్చే ఒకహృదయోత్కంఠ, ఒకఆశయము, ఒకపరమావధి ఆమెకు లేకపోలేదు. ప్రేమమయ మామె జీవితమంతా. భయవిహ్వలచిత్తముతో భర్తను కలసినరోజుమొదలు, మృత్యుదేవి తన్నుకోరేవరకూ ఈప్రేమనిధివున్నదామె హృదయమునింపుటకు. ఆమె స్వరూపమే ప్రేమ. ఈప్రేమే అంతమొత్తంతో మళ్ళీ తనకు తిరిగివచ్చినప్పుడు భగవంతుడే ఆమె సౌఖ్యముయొక్కఅంతు తెలిసికోగలుగుతాడు. కాని వేరువిధముగా పరిణమిస్తే స్త్రీకి ప్రపంచమే శూన్యము. జీవితము తనకు ప్రసాదించే ఆఅమూల్యవస్తువూపోయింది. దానికి తులతూగేది మరేమీ ఆమెకు కనుపించదు.

నేనొక హిందూస్త్రీని. ఒంటరిగా దుఃఖంలో గడపేదాన్ని కాలం. మాఅత్తగారు నన్ను చాలాప్రేమించేదే. నేను సుఖంగా వుండటమే ఆమెఏకోద్దేశము. నేను గొడ్డురాలనూకాను. దేవతలు నాకొక చక్కని తేజోవంతుడగు కుఱ్ఱవాడిని ప్రసాదించారు. కాని నాదేహములో ఆత్మనశించింది. నాభర్త ఎప్పుడూ నన్ను నిరసించి నాకు విముఖులై తిరిగేవారు. తన్మూలమైనవ్యథ నాహృదయమాక్రమించుకొని అనంతంగా కనుపించేది. అత్తగారు నాదుఃఖమంతాచూచి నాపక్షమువహించి, తరుచు వారితో పోట్లాడుతూ, తిట్టుతూ, నాపై జాలికలిగేలాగు వారిని ఎలాగైనాత్రిప్ప ప్రయత్నంచేది. కాని,అయ్యో, మార్పుకనిపించలేదు. మరింత చెడుగా పరిణమించినదికూడా. తల్లిగారి కోపవాక్యాలు వారినిఇంటినుండి తరిమివేసేవి. ఒక్కొక్కప్పుడు కొన్నిరోజులవరకూ వారిని నేను చూచేదాన్నికాను. అప్పుడునాకు జీవితము నిరంజనము—నిరాశపడేదాన్ని. వారికి నేనంటే కిట్టకపోవచ్చు. కాని ఆమూర్తి నాకన్నులముందుంటే చాలు నాహృదయం శాంతిపడుతుంది. అబ్బ! వారు నాకు కనుపించనప్పుడు నేననుభవించే గుండెయారాటము పిచ్చిదాన్నౌతున్నానా అనిపించేది. ఆయనచేతుల్లో నాకెట్టిఆదరణజరిగినా ఆముఖముచూస్తుంటే నాకుచాలు.—ఇదంతా వివేకరహితమైన యుద్రేకమనేవాళ్ళు కొందరు.

మా అత్తగారు నా యెడలచూపేజాలికి కృతజ్ఞురాలనుకాదు. వారిపై ఆమె కోపించకపోవడమే నేనుకోరింది.

ఒకపదిహేనురోజులు వారింటిచాయరానేలేదు. వారినిచాలామంది వెతకబోయారు. కాని వారందరూ తెచ్చిన దుఃఖవార్త

మాత్రం ఒక్కటే. "వారక్కడ లేరు. ఆయిల్లుబీగము వేయబడియున్నది."

తల్లిగారిఆరాటము హద్దుమీరినది. ఇక నేనో? నిద్రాహారములెరుగను. ఆదుఃఖంలో నాబిడ్డను నాహృదయానికదుముకొని భగవంతుని ప్రార్థించాను. ఒకమానవహృదయము భరించలేనంతవున్నది నాదుఃఖము. కానీ, దేవతలున్నారు. మర్త్యప్రపంచము మీద ఒకకన్నుంచి జాలితో, ఏడ్చేవాళ్ళను ఓదార్చకపోరు.

సూర్యోదయము కాలేదింకా. రాత్రి అంతా ఏడ్చిఏడ్చి అప్పుడేనిద్రపట్టింది. ఒక కల కన్నాను. విచిత్రంగానూ, మహైశ్వర్యకరంగానూవున్నది. ఆకాశమంతా ఒకస్వర్గీయమగు వెలుగుచే దీప్తిమంతమైంది. ఆవెలుగులో ఒక స్త్రీ. ఆమె తనచేతులూపుచున్నది. ఒకతమ్మిపూవు నాచాయగిరాటువేయబడినది. "తీసికో అమ్మా! దాన్ని. నీజుట్టులో ధరించుకో; నీప్రభువు నిన్ను ప్రేమిస్తాను" అన్నదామె పువ్వుతీసికొని మేలుకున్నాను. ఇంకా తెల్లవారలేదు. ఐనాతొందరగా లేచి అత్తగారివద్దకు పరుగెత్తి అంతాచెప్పేను.

"పువ్వుఉన్నదా నీదగ్గిర?"

"లేదు. కలలోచూచానాపువ్వును."

"అమ్మా!" ఆమె చెప్పింది. "కాళికాగుడికి పో ఇప్పుడే. పూజాపుష్పమొకటి తెచ్చుకొనిధరించు. తొందరగా! ఆలస్యము కూడదు."

౨

మేము నివసించేది భవానీపురంలో. కాళికాగుడి మాయింటికెంత దూరంలోలేదు. ఈవరకుపలుసార్లు నేనచటికిపోయి దేవికి నాదుఃఖతాడితహృదయాన్ని వ్యక్తపరచాను. కాని ఈమారు ఆనెత్తురుకాల్వలుదాటి గర్భగుడిలో ప్రవేశించేసరికి నాశరీరము కంపించినది. తల తిరిగిపోయింది.

"ఎంతభయంకరంగావున్న దీకాళీస్వరూపం" అంటున్నాడు ఒకనాస్తికుడు. భక్తులకు మాత్ర మాతల్లి సౌందర్యమూర్తియని అతనికి తెలియదు. ఇతరులకంటికెలాగు కనుపించినను, తల్లి కుమారునకుమాత్రము ప్రేమమయి. అట్లె కాళీమూర్తిలో గర్భీభూతమైన అపారప్రేమ భక్తుడే చూడగలుగుతాడు. నాకుమాత్ర మీరోజున ఆమె భయంకరత్వమే గోచరించినది. ఏరులై అక్కడ పారుచున్న రక్తము నాచర్మచక్షువులకు కనుపించి దేవి క్రూరురాలని అనుకున్నాను. కాని నిన్నరాత్రి కలలో కనుపించిన ఆస్వర్గీయసౌందర్యము మాత్రము నాహృదయాంకితమైయున్నది. ఈవ్యత్యాసమువలన దేవి మఱింతవికృతముగ కనుపించుతున్నదినాకు.—నాలుక బయటకు చాచివున్నది. ఒకచేతిలోఖడ్గము, మఱొకచేతిలో రక్తమయమైన మానవశీర్షము కనుపించుతున్నవి. ఐనను తక్కిన రెండుహస్తములతో దేవి భక్తజనులను ఆశీర్వదించుతుందని ఎఱుగుదును. జీవితములో పలుమార్లామె దయారసము రుచిమెఱిగియున్నాను. కాని ఈరోజు నాకు మనసుకుదురలేదు. ఆమె బహిస్స్వరూపమే నాకు కనుపించుతున్నది. నిన్నటిరేయి నాకు కనుపించిన ఆసౌందర్యమూర్తి యొక్క ప్రతిబింబమాయిది? విగ్రహము చూచి భయముతో వెనుకకుగువేశాను.

కాని మళ్ళీ నిన్న నానిద్రలోని యూరూపము హృదయవీథిలో పరుగెత్తింది. క్రొత్తయూహ మొలకెత్తింది. ఈపరస్పరభిన్న భావములలో మునిగి యూగర్భగుడితలుపుదగ్గిర నేలకొరిగి పడిపోయినాను బలహీననై.

అప్పుడు నాకు సహాయురాలుగావచ్చిన పనికత్తె ఉమ తత్తరపడి కేకలువేసింది. నన్ను బాగాఎఱిగియున్న అర్చకుడు లోనుంచి పవిత్రజలముతెచ్చి నాపై చిలికెను. గుంపులోనుంచి నన్నావలకుగొంపోమని ఉమకుచెప్పుతూవున్న ఆయన మాటలు నాకు అస్పష్టముగావినపించినై. కొంతదూరములోవున్న ఒకవృక్షముచూపించి "ఈమె నక్కడకుతీసుకపో. విశ్రాంతితీసుకోగలదు" అని చెప్పేడాయన.

వృక్షచ్ఛాయకుకొనిపోబడ్డాను. అక్కడ తెలిసీతెలియని స్థితిలోపడిఉన్నాను. అక్కడ మరొకస్త్రీకూడావున్నది.

ఆమె పరిచయముసంపాదించుటకు ఎంత కాలమూపట్టలేదుఉమకు. తనహృదయము విప్పి ఆమెకు నాకథంతా కాలహరణము కాకుండా చెప్పేసింది.

"నామనస్సు డోలాందోళితమైంది; అమ్మమూర్ఛపోయింది.—ఐతే మీవాస మెక్కడతల్లీ!" అడిగింది ఉమ.

"చాలాదూరము. మీరు నన్నెఱుగరు. మీనివాసమో?" ఇదీ మందస్వరమునవచ్చిన జవాబు.

"మేము భవానీపురంలో కాపురం. గోపాలబాబును మీరెన్నడూ వినియుండలేదా? ఒకప్పుడాయన చాలమంచివాడు. అయ్యో! ఇప్పుడు—" ఉమ నిట్టూర్పువిడిచి ఊహాప్రపంచములో మునిగిపోయింది.

"ఆయన కేమౌతుందీమె" అని మరల ప్రశ్నించిందామందస్వరం.

"ఏమౌతుంది! ఆయనభార్య. మరెవరు?" ఉమకు వాగ్ధాటి హెచ్చింది. "అయ్యో! అదంతాతలస్తే నాహృదయంపగిలిపోతుంది. ఒకతమ్మిపూవు మురికికాలువలో విసువబడింది. అగ్నిసాక్షిగాచేసికొన్న భార్యాస్థానము ఒకకులటచేత ఆక్రమింపబడింది. చూసుమామెవైపు. స్త్రీజాతిలో ఒకరత్నముగా ప్రకాశించడములేదా? ఐతే ఏమి; ఆమెను లక్ష్యముచేయడాయన. అనుపనుచు ఏమిచేస్తుంది? ఆరోగ్యభంగమయ్యేటంత వరకూ ఏడ్చివేసింది."

ఉమకు ఉద్రేకముమీరిపోయింది. గౌరవహీనమగు కోపవాక్యముల ప్రవాహము గుప్పించేస్తున్నది.

మరల నాకు స్మృతిగలిగినప్పుడావాగుడు కత్తెతో సహేతుకముగా వాదింపమొదలెట్టేను. "ఉమా! ఎందుకాయన్ను గూర్చి చెడుమాటలాడుతావు. సుఖబాహ్యమైన జీవితము నాముఖాన వ్రాసివుంటే వారిదా తప్పు?"

ఆ అపరిచితవ్యక్తి నావద్దకు మెల్లగానడచి వచ్చినది. నావైపామె నిశ్చలముగా చూచింది. మృదుమధురమైనజాలి ఉన్నదా కన్నుల్లో.

"పద్మావిలాసినీ!" ఆమెధ్వనికంపించింది. "నీ భర్తచేత తృణీకరింపబడుచున్నావా? చాలవిచారకరముసుమా?"

"తృణీకరణము మాత్రమేనా?" ఉమ ముగించలేదు తనకథ. "పట్టితృణీకరణమేనా? దానితో ముగిసినదా? ఈమె సొమ్ములన్నీ దోచేశాడు. భార్యనుగురించిన ప్రేమాలోచనేమీలేకపోయినా సొమ్ముకు మాత్రం వస్తాడుదగ్గరకు. ఎన్నిమార్లుచెప్పిచెప్పి నోరు పోయిందిమాకు, ఆయనకు సొమ్ములీయకూడదని. సంబంధముతీరిపోయింది. ఇక నాయనకు బంగారమీయడము పాపకృత్యమన్న మాట.—టక్కులన్నీ నేర్చుకున్నవాడాయన. కొంచెముబుజ్జగించితే ఈమెకు చైతన్యంపోతుందని బాగాఎఱుగు. ఏదోఆపత్తులో వున్నట్లుచెప్పుకుంటాడు. ఇంకేం. ఈపాల మనసుతల్లి తనచేతిలో కీలుబొమ్మౌతుంది. ఈమెనని లాభంలేదు.—ఆనాడు మరికొంత సొమ్ముతీసుకపోయినందుకు తల్లిగారెంత తిట్టిపోసినారు. నాటినుంచీ మళ్ళీకనుపించలేదు. సగముపిచ్చియెత్తి యీమె ప్రాణాలుగోలుపోటానికి సంసిద్ధురాలైంది."

ఈవాచాలత నాకు కష్టమనుపించింది. "ఉమా! అపు నీ ధోరణి. కోపంపుట్టిస్తున్నావు నాకు."

"ఆ అమ్మాయి తప్పులేదు. అటువంటి భర్తను నేనైతే ఎదుటికేరానీయను." అపరిచితవ్యక్తిఅన్నది. "అమ్మా! నమ్మకముండనీ. మరలఅదృష్టము నీమీదచిఱునవ్వుగుఱిపింపగలదు. నీవంటిదానిఆర్తి దేవతలు చాలకాలముసహించరు."

ఆమెకన్నులు దయాగర్భితములై ప్రకాశించినవి. నాచేయిపట్టుకొని మెత్తినదామె. అర్ధనిమీలితములైన నామెనేత్రాలు.

"నీవు దేవతలుప్రసాదించిన వరమనుకోక నిన్నుకష్టాలుపెట్టేవానికి దుఃఖమే నిల్చుగాక!" ఆమెవిచారముతో కొంచెమాలోచిస్తూనిల్చున్నది.

"అమ్మా! నీజీవితదుఃఖమంతా నాపాలుగానీ; దేవి కాళిక నీప్రార్థనఅంగీకరించునుగాక!"

ఇవియే ఆమెకడసారిమాటలు. ఇక వెళ్ళిపోవటానికి లేచింది. ఆమెమూర్తిలోనుంచి దైవసంబంధమైనజ్యోతి ప్రకాశించడము కనుపించిందినాకు. అయితే స్వప్నములో నేనుచూచినస్త్రీ యీమేనా?

3

చాలారోజులుగడచిపోయినై. ఒకనాడు మధ్యాహ్నం మేమెవ్వరూ ఎరుగని ఒకస్త్రీ మాయింటికివచ్చింది. తానెవరో మొదటచెప్పకోకుండానే మమ్మల్ని సంబోధించి "ఇవిగో మీసొమ్ములు. ఋణమంతాతీర్చుకున్నాడు బాబు. ఇవి మీకిచ్చేయమన్నారు. ఇవిగో చూచుకోండి,అన్నీసరిగ్గాఉన్నాయోలేదో."

అత్తగారు మూగపడిపోయినారు. ఎన్నడూ సంభ్రమమెరుగని ఉమమాత్రం నాలుకతెరచింది. "బాబుమళ్ళీ వెనుకటిస్థితికివచ్చారు. జగన్మాతప్రభావము కాబోలు." సొమ్ములన్నీవచ్చాయని సంతోషంగాచెప్పింది ఉమ.

నామనస్సు సొమ్ములమీదలేదు. అవన్నీ మాఅత్తగారు చూస్తున్నారు. నేను మావారినిగురించి ఆలోచిస్తూకూర్చున్నాను. ఈస్త్రీ ఆయన్న చివరసారి ఎప్పుడు

చూచిందో. శాంతిఎఱుగనినాహృదయం కొట్టుకుంటున్నది.

“బాబుగారు నీకీసొమ్ములన్నీ ఎప్పుడిచ్చారు?” అని అడిగేనుఆస్త్రీని.

“సుమారువారమురోజులక్రింద. నాకు పనివుండటముచేత ఆలస్యంగావచ్చాను. ఈసొమ్ములన్నీ నాదగ్గిరేఉన్నవిన్నాళ్లనుంచీ.”

“నాకొడుకు ఇంటికెప్పుడువస్తాడో చెప్పలేవా?”—ఇది అత్తగారు ఆతురతతో అడిగినప్రశ్న.

“అది నేనెలాగుచెప్పుతానమ్మా? ఇదిగో మీసొమ్ము—మీప్రాణముమీకువచ్చినది.” ఈమాటలతో ఆ స్త్రీ వంగి నమస్కరించి తొందరగావెళ్ళిపోయింది.

వారినిగురించి ఇంకాతెలసికోవాలనివుంది నాకు. కాస్సేపు ఆమెనుండుమందామనుకున్నాను. కాని నేనుమాటచెప్పకముందే వెళ్ళిపోయింది.

నే నింకా కృశించిపోనవసరములేదు. ఆ నాటిసాయంత్రమే ఆయన—నామనోనాథుడు తిరిగివచ్చారు. మనఃపూర్వకస్వాగతమిచ్చాము. గృహమంతా ఆనందపరవశమైంది. భోజనసమయమప్పుడు మాఅత్తగారు మాటలుకలిపింది. “బాబూ! ఆభరణాలన్నీ ఇంటికంపినందుకు చాలాసంతోషించాను. అంతకంటేఎక్కువగా ఆనందిస్తున్నాను భగవంతుడు నీహృదయంలో పరివర్తనతెచ్చి నిన్నింటికితెచ్చినందుకు.”

నాభర్త ఆశ్చర్యముతో చూచారామెవైపు. ఆమెమాటలు అర్థంకానట్లున్నది.

“ఏంఆభరణాలు? ఏమిటమ్మా! నీవు చెప్పేది?”

“ఆముసలిస్త్రీదగ్గిర ఏనగలు తాకట్టుంచి డబ్బుతెచ్చుకున్నానో అవి. ఈరోజుమధ్యాహ్నమామె తనంతతానేవచ్చి నగలిచ్చిపోయింది. ఋణముతీర్చివేశావనిఆమెచెప్పింది.”

ఆశ్చర్యనిమగ్నునివలెకనుపించారాయన. ‘అలాగా’ అనిమాత్రమే వారన్నది. మనసులోని కలవరముమాత్రము అణచుకోలేకపోయినారు.

తరువాత వారు నాయేకాంతగృహమునకు వచ్చి నగలన్నీ చూపమన్నారు. తెచ్చి ముందుంచాను. ఒక్కొక్కటి జాగ్రత్తగాపరిశీలించారు. ఆయనముఖవైఖరిలో మనోవ్యాకులత కనుపించుచున్నది. నాకేమీతోచకుండావున్నది. ఆయనప్రవర్తన నన్ను కలతపెట్టినది. బహుశః ఈఆభరణాలు తిరిగిఉపయోగించుకోతలచారేమోననుకొని అవన్నీ వారికర్పించి ‘తీసికోండి’ న్నాను.

“వద్దు” ఆయన కంఠముకంపించింది.

ఇంటికివచ్చినకొద్దిసేపటికే మళ్ళీ వెళ్లిపోవడము మామూలాచారమే. దుఃఖసూచకమైన వారిముఖాకృతి నామనోవీథి విడిచిపోలేదు. ప్రక్కమీద అశ్రద్ధగాపడుకున్నా కుఱ్ఱవాణ్ణి చేతుల్లోపట్టుకుని. దేవతలు దయామయులు. నాకు వెంటనే నిద్రపట్టింది. ఈవరకు చాలరోజులనుంచీ ఎరుగనిసుఖసుప్తి అనుభవించాను. మరుచటిఉదయం నాచిన్నికుమారుని బిలిబిలికేకలు నన్ను నిద్రలేపినవి. ‘పపా! పపా!’ అంటూ సంతోషంలో చేతులూ, కాళ్ళూ ఆడిస్తున్నాడు చిన్నవాడు.

యదార్థము కాని ఒకమనోదృశ్యమా

ఇది! నిజముగా స్వప్నప్రపంచములోనే ఉన్నానా? కండ్లు బాగా తుడిచికొని చూచాను. నాఆత్మనాథుడే నిలబడిఉన్నారు నాముందు. వారి చూపులు నామీదే ఉన్నవి—నామీదా, వారికుమారునిమీదా. కాని వారిముఖము వెలవెలబారి దుఃఖతాడితమువలెఉన్నది. కొంతహృదయమథనము కూడా వ్యక్తమౌతున్నది.

"మీరేనా?" అన్నాను నాకన్నులు నేను నమ్మలేనిస్థితిలో. "మీరేమోబాధగా వున్నారు దేనికి? చాల పాలిపోయారు!"

వారుమాట్లాడలేదు. బిడ్డనెత్తుకుని హృదయానికదిమికొన్నారు. కన్నీళ్ళు చెంపలవెంబడి స్రవించినై. ఇట్టిస్థితిలో వారిని నేనీవరకెన్నడూచూడలేదు.

"మీదుఃఖమంతా నన్ను ముంచుకోనీయండి. వెనుకటిలాగా మీరు సుఖంగా వుండటమే కోరుతానునేను. అందుకు నాజీవితమిచ్చుకోవలసివచ్చినాసరే." నన్నాయన హృదయముదగ్గరకు లాగికొన్నారు. "క్షమించగలిగితే నన్ను క్షమించు" ఆమాటలిప్పటికీ నాచెవిలో మ్రోగుతూఉంటవి, ఆకంఠము అపరిచితముగానూ, దుర్బలముగానూఉండి.

ఆతరువాతి నిమిషములసంగతి నే నెఱుగను. నాజీవితంలో అప్పుడు కలిగినమూర్ఛ నాయింద్రియాలను కప్పేసింది. వారిపాదాలమీద మూర్ఛపోయాను. ఇంతకన్నా మరేమీయెరుగను. ఎవరో కొద్దిమంది మనుష్యవ్యక్తులకుమాత్రమే అనుభవనీయమైన సుఖసముద్రంలో తేలిపోతున్నట్లనిపించిందినాకు. ఎప్పుడో, ఏనిముసానో దేవతలు తమ స్వర్గసౌధద్వారాలు తెరచి ఆనందకిరణమొక్కటి ప్రసాదిస్తారుటమానవులకు. అలాంటిస్వర్గీయజ్యోతిలో కృతస్నాతనౌటకు నాకు ప్రసాదింపబడిన వానాల్గునిముషాలు.

నాభర్త ఇప్పుడు పూర్వమువలెకాదు. ఇప్పుడాయనకిల్లు రుచించకపోవడములేదు. ఆయనజీవితక్షేమము నాకూ, ఆయనకుమారుడికీ చెందియున్నది. కాని నాకు మాత్రమారహస్య మింతవరకూ గోచరించలేదు. తద్విషయములో నాభర్తగారికెప్పుడూ మూకీభావమే. దాన్నిగురించిన ప్రస్తావనతేనే లేదు. ఒక్కసారిమాత్రము నేనే అడిగిచూచాను. జరిగిపోయినదాన్ని జ్ఞాపకము తెచ్చుకొనడము తనకిష్టములేదనిచెప్పేరు. నామనస్సుకుమాత్రము కలతగానేవున్నది. తరచు ఆలోచించుకుంటాను దాన్నిగురించి. నేనాలోచించినకొద్దీ అదిఅభేద్యమౌతున్నది. పాఠకులలో ఒక్కరైనా చెప్పలేకపోతారా ఈరహస్యము.

# సరస్వతికి

వడ్లమాని అప్పారావుగారు

నామధురార్తితోడ భువనమ్ములమ్రోగు సుధావిలాప, మా
శామిహికాశ్రుబిందుతతిచాఱ్పున, నూత్నకళాప్రపంచ స్వ
ర్గామృతకావ్యమందు నొకయంకముగా నెపుడుండుకోసమై;
కోమలి కోరుచుండె దనకుంతితమా భవదీయసత్కృపన్!

# చిట్టితమ్ముడు

పిలకా గణపతిగారు

౧

"అమ్మ! తమ్ముఁడువద్దు తీర్థ
మ్మ"నకనినఁ దాఁ బాలుద్రావుచు
గ్రుక్క వేయుటమాని నను ని
శ్చలముగాఁజూచున్.

౨

నేను పఠనవ్యాపృతుఁడనై
యుండ మెల్లగవచ్చిచేరును;
కణికెతో నాళులకనున్నలు
చుట్టఁగాదొడఁగున్.

౩

పెద్దలెవరో మాటలాడఁగ
వచ్చి వాకిటజోడువిడిచినఁ
దొడుగుకొను తనచిట్టికాళ్ల షి
కారుగానేగున్.

౪

చదువునేదో పుస్తకములో
మెల్లగా నావలెన దానును;
నేను దనవైపునకుఁజూడఁగ
సిగ్గుపడిమూయున్.

౫

ముఖముపై జీరాడు నెఱ్ఱని
ముంగురులఁబోఁ జట్టికన్నులఁ
జివురుచేతులమూసికొను; "దో
బూచి"యననవ్వున్.

౬

అమ్మచదువుచునున్న పొత్తము
చేతదొరకొని పరువులెత్తును;
వెంటఁదరుమఁగఁ దిరిగిచూచుచు
పకుచు బరువెత్తున్.

౭

క్రొత్తవారలువచ్చి చేతులు
చాప నీతని నెత్తుకొనుటకు;
అమ్మదగ్గిర కేగి వారల
వింతగాఁజూచున్.

౮

ఎండవేళల నిదురపోవును;
రాత్రి మారామునకు మొదలిడు;
"బూచి! రారా"యనిన విని లో
లోననే యేడ్చున్.

౯

మల్లెమొగ్గలనన్నిటిని దన
చిట్టిచేతులపుణికి వైచును;
చెల్లెచూచినఁ గొట్టఁబోవఁగ
ముద్దుగాజూచున్.

౧౦

చింతలన్నియు సమసిపోవ, న
మేయమోదమ్మనుభవింపఁగ
ముద్దుమాటల చిట్టితమ్ముని
గృష్ణుఁడేపంపెన్.



ఇంగ్లండు దున్నలతో దున్నుట



శ్రీరంగపట్టణమునందలి టిప్పుసుల్తాను వేసవిమందిరమగు దెరియాడౌలత్ నందలి లోపలిభాగము:



మైసూరు రాజభవనము. కోటద్వారము.

—ఛాయాచిత్రగ్రాహకులు: డి. అన్నాజీరావుగారు.

# సిగ్గు

తేకుమళ్ళ రామచంద్రరావుగారు, ఎం.యే , బి.యల్.

రమణరావు తనగదిలో పందిరిపట్టెమంచముపై కూరుచుండెను. అతనిముఖము విచారమును, నొకవిధమగు విసుగును సూచించుచుండెను. "జీవితములో మాధుర్యమున్నది. కాని—" అను వాక్యమునందలి భావము తు, చ, తప్పకుండ అతనివదనమండలమున సుచిత్రితమై యుండెను.

రమణరావుగదితలుపు మూసియుండెను. ఆగదిలో నాతఁడుదప్ప నింకెవ్వరును లేరు. అతఁడు పందిరిపట్టె మంచముపై గూరుచుండి ఎడమపాదమును నేలమీదను కుడిపాదము నేలకుకొంచె మెత్తుగను పెట్టుకొని యుండెను. మంచమున కెదురుగనున్న నిలువుటద్దములో నాతనిమూర్తి కనబడుచు నేయుండెను. కాని రమణరావు అద్దమువంక చూచుటలేదు. అతనికన్నులు మాత్రము నేలవైపునకు తిరిగియుండెను. కాని ఆ కన్నులు దేనినికూడ చూచుచుండుటలేదు. అతని ఆత్మగతమై విచారసమ్మిళితమై యేభావముకలదో ఆభావ మాతని సంపూర్ణముగ వశ్యము చేసికొని యుండెను.

ఆకసమును గ్రమ్మిన మేఘములను ప్రచండ వాయువు చిమ్మివైచి గగనమును తేటోవంతముగ నొనర్చును. అటులే ఎట్టకేలకు రమణరావు తన మనోవీధిని క్రమ్ముకొన్న విచారము నొక్కనిట్టూర్పుతో తాత్కాలికముగ విదళించివేచెను.

"అచ్చే; దానికి తోచాలిగాని ఒకళ్లుచెపితే తెలుస్తుందా! మనస్సులో లేనిది చెవిలేమట్టుకు ఎక్కడ నించి వస్తుంది!"

ఈమాటలు తనలోతా నేయనుకొని దిటవుబూని కండువా తనభుజములమీదవైచికొని పాదరక్షలను తొడిగికొని రమణరావు బయలుదేరియెచ్చటికో వెడలెను.

* * *

రమణరావు బయలుదేరిన నాలుగైదునిమిషములకు రాధ ఆగదిలో ప్రవేశించెను. రాధ పదునాఱు పదునేడేండ్లబాలిక, రమణరావుభార్య. ఆమె కాపురమునకువచ్చి సుమారొకసంవత్సరమైనది. అప్పుడే ఆమె జడవైచుకొని ముఖము సబ్బుతోరుద్దుకొని, చక్కగతుడిచికొని చాదుచుక్క పెట్టుకొన్నది. చాదుచుక్క పెట్టుకొన్నచేతిని కడుగుకొనుచుండగ రమణరావు వెడలుటను ఆమె చూచినది. ఆపిమ్మట ముఖము కడుగుకొనుటచేత రేగిన ముంగురులను దువ్వెనతో దువ్వుకొని తెల్లనిచీరకట్టుకొన్నది. రమణరావు లేఁడుగదా అన్నధైర్యముతో గదిలోప్రవేశించినది.

గదిలో మాత్రమేమున్నది? ఆమెకు ప్రాణప్రియుఁడగు రమణరావులేఁడు. అతఁడులేనిదే ఆమెకేమి తోచగలదు? రాధ కొంతసేపాగదిలో తారట్లాడినది. నిలువుటద్దము దగ్గరనిలిచి తనయందమును ముమ్మారు చూచుకొన్నది. గదిలో బల్లమీద సరిగ నమర్చబడియే యున్న పువ్వులనుతీసి మరల నమర్చినది. పందిరి పట్టెమంచముమీద కూర్చున్నది. ఏమితోచినదో కాని దిగ్గనలేచినది.

రాధ గబగబ హార్మోనియము పెట్టెదగ్గరకువెడలి, పెట్టెమూతతీసినది. క్రింద చాపవైచికొని పెట్టెలోని హార్మోనియమును చాపమీదపెట్టుకొని పాటలు మొదలుపెట్టినది. ఇట్లు కొంతసేపైనతరువాత రమణ రావుతమ్ముడు తొమ్మిదిపదేండ్ల బాలుఁడు అచ్చటికి వచ్చినాఁడు. రాధ పాడుచునేయున్నది. ఆపాట ముగియగనే రాధ హార్మోనియమును పెట్టెలోపెట్టి వేయబోయెను.

"ఇంకోపాట పాడుదూ, వదినా!"

"ఒద్దమ్మా, మళ్ళీ అమ్మకి కూరతరిగియ్యాలా మరి"

"అబ్బా ఒక్కపాటపాడితే అరిగిపోతావు గాబోలు రెడ్డూ?"

"మళ్ళీనాన్నా, అన్నయ్యారారా? ఇంకానంట కాలేదా, అంటారు."

"మరీ; అన్నయ్యనుచూస్తే నీకుభయమా?"

రాధ తనలో తానునవ్వుకొన్నది. ఆబాలుఁడిది చూచినాఁడు.

"చెపుతాలే, అన్నయ్యతో; నువ్వు హార్మోనియం వాయించావని"

అని ఎగురుచు గంతులువైచుచు బాలుడు పరుగెత్తెను.

* * *

రాత్రి ఏడుగంటలన్నరయైనది. రాధ మామగారు క్లబ్బునుండి వచ్చినారు. తరువాత నైదునిమిషము లలో రమణరావువచ్చి కాలుసేతులు కడిగికొనెను. తండ్రియు, కుమారుడును భోజనమునకు కూరుచుండిరి.

ఇంతలో వంతకుముందే భోజనముచేసిన రమణ రావు తమ్ముడచ్చట ప్రత్యక్షమయ్యెను. అతఁడు వదినదగ్గరకు పోయెను.

"చెప్పనా? చెప్పనా?"

రాధ చిరునవ్వునవ్వి యూరకొనెను. బాలుఁడు సంబరముపడుచుండెను. ఇదిచూచి రాధమామగారు ఇట్లనిరి:

"ఏమిటిరా, ఆడావిడి?"

"వదిన హార్మోనియం వాయించింది."

"దీనికేనా? వచ్చును; వాయించింది."

బాలుఁడు రమణరావు ముఖమువంక జూచెను. అతనిముఖ మానందమును సూచించుచుండెను. కాని యుత్తరక్షణమున విచారసమ్మిళితమైన యొకరకపు విసుగొప్పటివలె నాతని ముఖరంగమున తాండవించుచుండెను.

* * *

రాత్రి తొమ్మిదిగంటలన్నరయైనది. రమణరావు తనగదిలో కుర్చీమీదకూరుచుండియుండెను. ఎదుట దీపము వెలుగుచుండెను. సాధారణముగ నాతఁ డేవవలనో, లేక పత్రికనో, మరిదేనినో చదువుకొను చుండెడివాఁడు. నాడాతఁడట్టిపని యేదియు చేయు చుండుటలేదు. అతఁ డేదోదీర్ఘాలోచనలో మునిగియున్నట్లు కనఁబడుచుండెను.

"ప్చ్. దానికి నామీదప్రేమలేదు. ఉంటే యిలా చేస్తుందా? ప్రేమలేనిచోట వృధాగా నాప్రేమ నే నెందుకు ధారపోయాలి?"

రమణరావు మరల ఆలోచించెను.

"పాపము దానికేమి తెలియదు. తెలియనిదానికి చెప్పాలిగాని, దానిమీద ఊరికే కోపంతెచ్చుకోడం పొరబాటు."

ఈసమాధానమును రమణరావునకు సంతృప్తికరముగనుండలేదు. ఇట్టిస్థితిలో రాధ గదిలో ప్రవేశించెను. తలుపు గడియవైచెను. రమణరావు దగ్గరకు వచ్చి నిలుచబడెను.

రమణరావేమియు మాటాడలేదు. ఇన్నిదినముల నుండియు తానువచ్చుటతోడనే ప్రేమతో సంబోధించు ప్రాణకాంతుఁడు నేడిట్లెందుకు మారిపోయినాఁడు? కారణమేదియు నామెకుగోచరించలేదు.

"ఇవ్వాళపత్రిక చదువుకోలేదేం?"

రమణరావు మాటలాడలేదు.

"ఏమిటాలోచిస్తున్నారు? నాతో చెప్పండి ఆదేమిటోను."

"ఏదైతే నీకెందుకు? నీసంతోషం నువ్వు అనుభవిస్తున్నావుగా? నామాట నీకెందుకు?"

"చూశారా! చూశారా! మరి; నామీదకోపం తెప్పించుకున్నారు. నేనేంజేశానమ్మా?"

"నువ్వేంజేశావు! నువ్వేమీ చెయ్యలేదు. నువ్వేం జేశావన్నాను?"

"నేనేంసంతోషం అనుభవించాను"

"నీయిష్టంవచ్చిన సంతోషం అనుభవించు, నేనొద్దన్నానా?"

"అదంతా కాదు. అలా చెబితే నాకు తెలియదు. నామీదమీకు కోపంవచ్చిందా?"

"కోపంలేదు; కొరివీలేదు."

"ఏమిటమ్మా ఈమాటలు?"

"అమెరికాలో ఐదేళ్ళకంటే యెక్కువకాలం భార్యాభర్తలు ఒకరినొకరు ప్రేమించుకోరుట. మన దేశంలో ఏడాదికంటే ఎక్కువకాలం ప్రేమించు కోరులాఉంది."

"అయితే, నేనంటే మీకిష్టంపోయిందా?"

"నీకే నామీద ఇష్టంపోయింది."

"మాయమాటలు చెబుతారు, అన్నీని."

"మాయమాటలుకాదు. నిజమే అంతా. నాకు స్పష్టంగా కనిపించడంలేదా?"

"పోనీ నామీదకోపం ఎందుకు వచ్చిందో చెప్పండి."

"నేను నిన్న మధ్యాహ్నం హార్మోనియం వాయించమన్నానా?"

"అన్నారు."

"వాయించావా?"

"ఎలా వాయించేదమ్మా మరి?"

"సాయంత్రం ఎలావాయించావు?"

"అదికాదు. మీరు పరీక్షలూ, అన్నీ హ్యాసై యిలా అంటే నేనేం జెప్పేదీ మరి? మధ్యాహ్నం వాయించమంటే మామగారింటోవున్నారా? మామగారు వినేలాగు వాయించేదా? చెప్పండి."

"నీకు హార్మోనియంవాయించడం వచ్చునని మామగారికి తెలియదుగాబోలు."

"తెలిస్తేమాత్రం వాయించేదా? అందరూ ఏమంటారు?"

"ఏమంటారు? ఏమీఅనరు. ఎందుకంటారు?"

రాధ మాటాడ లేదు. రమణరావామెవంక జూచెను. ఆమెను దగ్గరకు తీసికొనెను. రాధ రమణరావు నెంతపవిత్రముగ గాఢముగ ప్రేమించుచుండెనో రమణరావుగూడ రాధనట్లే ప్రేమించుచుండెను.

"మీకేం? మీరు మొగవాళ్ళు. ఎవరన్నా అంటే నన్నంటారుగాని మీకేం?"

"అందుకే నువ్వు హార్మోనియం వాయించుకొని సంతోషం అనుభవించు; నాసంతోషంమాట నీకెందుకు? అన్నాను."

"ఒక్కటి చెప్పండి. మీసంతోషంమాట నాకక్కరలేదని మీరు మనస్ఫూర్తిగా నమ్ముతారా?"

"మధ్యాహ్నం నాకేమీతోచక కలవరపడంచేత ఏమీతోచక నీతో కబురులాడుదామని నిన్ను రమ్మన్నానా?"

"అత్తగారూ, మామగారూ పెద్దవాళ్ళుంటే వాళ్ల కెదురుగుండా నేను మీతో రాచకార్యం చెయ్యడానికివచ్చేదా?"

"ఏమీ? తప్పా?"

"తప్పేమరి. అందరూ ఏమనుకుంటారు? ఇదేమిటి? భోగంసానిలాగుఅనుకోరూ?"

"మొగుడితో మాట్లాడడానికిగాదూ మరి పెళ్లి చేసుకున్నది?"

"అయితే ఎప్పుడూ ఎదురుగుండా కూర్చుంటారా?"

"ఎప్పుడూ కూర్చోమన్నానా?"

రాధ కొంతసేపు మాటలాడలేదు.

రమణరావామెవంక జూచుచు కూర్చుండెను. రాధ వదనమండలమున నేదియో యొకదివ్యజ్యోతి ప్రకాశవంతమయ్యెను.

"అయితే మీసంతోష మంతా నేను చెడగొట్టేశానా?"

ఈమాటలందలి పరిపూర్ణమును, మంజులమునగు విచార మాతనిమనస్సును వశముచేసికొనెను. రమణరావామెను దగ్గరకుతీసికొని తనవ్రేళ్లతో నామె ముంగురులను సరిచేయుచుండెను.

"అయితే యిప్పుడు హార్మోనియం వాయించమంటారా?"

ప్రేమతో నిండియున్న రమణరావు కంఠబిలము నుండి ఈ క్రిందిమాటలు నిర్గమించెను.

"వాయించు"

"అయితే సరే"

రాధ రమణరావుదగ్గరనుండి హార్మోనియం పెట్టె కడకు నడచిపోబోయెను. రమణరా వామె చేతిని వదలిపెట్టలేదు.

"వాయిస్తే నీకు సిగ్గుగా ఉంటుందా?"

"నాకుసిగ్గూలేదు; ఏమీలేదు; మీరెలా చెయ్యమంటే అలా చేస్తాను."

"ఇక చెప్పవేమోను, నేను పిలిచినప్పుడువస్తావా?"

"వస్తాను."

"నీకు సిగ్గువెయ్యదూ?"

"వెయ్యదు."

"నిజంగా?"

"అవును."

రమణరా వాలోచించెను.

"నువ్విప్పుడు హార్మోనియం వాయించొద్దు."

"సరే"

"రేపుమధ్యాహ్నంవాయించు."

"అలాగే."

"రాధా! నీదగ్గిర యివ్వాళ ఒకపాఠం నేర్చుకున్నాను. ఆడవాళ్ళకు సహజంగా సిగ్గుంటుంది కాదూ?"

"సిగ్గులేకపోతే అసలు ఆడజన్మ ఎందుకు?"

"అసిగ్గును చంపివేస్తే, ప్రేమలోమాధుర్యమే చచ్చిపోతుంది. ఎండిపోయిన చెరుకుముక్క ఎంతో అప్పుడా ప్రేమ అంత. అమెరికాలోని ప్రేమ ఉన్నదే అది మాధుర్యవిహీనమైన ఎండిపోయిన చెరుకుముక్కలాంటి ప్రేమ."

"వాళ్ళది ప్రేమకాదు; మోహము అరక్షణముంటుంది; క్షణముంటుంది. మహా ఉంటే విడేళ్ళుంటుంది."

"మన ప్రేమో?"

"ఒకమాటు భార్యాభర్తా అయితే పదునాలుగు జన్మాలదాకా మళ్ళీ భార్యాభర్తా అవుతారట."

రాధగాని, రమణరావుగాని కొన్ని నిముషములు మాటలాడలేదు. వారిరువురును నేదియో ఆలోచించుచుండిరి. తుదకు రమణరా విట్లనెను.

"నిన్ను రేపటినించీ మధ్యాహ్నం రాచకార్యానికిపిలవను. గాటమైన కోరికఉంటేకాని ఏఅనుభవంలోనూ సంతోషం ఉండదు. అస్తమానం నీతో సంతోషము అనుభవిస్తూ నేఉంటే నీమీదవిరహమే ఉండదు. విరహంఉండకపోతే కోరికేఉండదేమో? కోరికలేని అనుభవంలో సంతోషం ఎంతమాత్రమూ ఉండదు."

* * *

"అయితే నామీద కోపంలేకుండా ఉంటారా?"

"ఎందుకుండనూ?"

## ప్రియతమా!

చేబ్రోలు సూరన్నగారు

చిత్రకారుడనౌదునా? చిత్రమార
మంజులత్వదీయాననాసమధురమూర్తి
నీసకలభువనైకవిలాసగతుల
హృదయపుటపైని చిత్రించుకొందు.

కవికుమారుడనౌదునా? కాంక్షదీర
భావకీనకళ్యాణలీలావిశేష
ములను భువనాలుతలలూప మోహనముగ
జీవితమె గీతములుగ రచించుకొందు.

గాయకాగ్రణినౌదునా? కలవుదీర
హృదయరంజకమైన నీమధురనామ
కీర్తనము కిలకిలరవ పృథివినెల్ల
నిత్యమును జీవితాంతము నింపివైతు.

* * *

# మనగృహాలు

అతఃశోక ఏకాకి.

అతని తెలుపుదీరిన వెంట్రుకలు, గడ్డం చిందరవందరగా అటుఇటు వ్రేలాడుతుండేయి.

అన్నీ అనుభవించినాడు_నేడో రేపో అనుకుంటుండేవారు ప్రజలు.

ఆగర్భశ్రీమంతుడై, ధనధాన్యాదులతో, భార్యాబిడ్డలతో తులతూగుతూవుండటము సంవత్సరాలు దొర్లిపోయినాయి నిముసాల్లా.

అతనివైభవము, భాగ్యం మాసిపోగానే అలాటి అతనిగృహ మరణ్యమైపోయినది. తలెత్తి తన గృహాన్ని చూడ్డానికే దుఃఖించేవాడు. ఆతలపాతని హృదయంలో కలిగినప్పుడు ఆనాడాతని కళ్లు ఎరుపు తేరేవుండేవి. నిముసాలు గడిచిపోయినాయి సంవత్సరాల్లా. అలాగే ఒంటిరిగా ఏకుస్తూ ఒకచోటపడుండేవాడు.



అతనిభార్య బిడ్డలకోసం ఏకుస్తూనే అతనిరక్షణకి జాగ్రత్తవహిస్తేనే లేకపోతే అంతే. ఎప్పటిలానే. మళ్ళీ తేరుకొన్నాడు. అతనిగృహాన్ని మళ్ళీ పూర్వపువైభవం అలంకరించింది. తన ఒక్కబిడ్డనే చూచుకొంటూ తన తక్కినబిడ్డల్ని వారిమధురవచనోక్తుల్ని మరిచిపోయేడు.

అతని ఆఖరుదశలో...

భార్య అతన్నివిడిచిపెట్టి వినిర్మలపరంజ్యోతిలో కలిసిపోయింది.

గృహం తనదారిని చూచుకొన్నది. అప్పటికతడు విరక్తినసుసరించి అనుకొన్నాడుగదా, "ఎప్పటికైనా ఎలానయినా ఏరికైనా ఇంతేగదా" అని. అతనిబిడ్డ వారికోసం ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లినాడు.

మనగృహాలుకూడా అగ్గృహానుసరణాలేగా!

శ్రీమతి
సూరత్తు
నాగమజెమ్మ గారు

* * *

# సమ్మేళన ముహూర్తము

తటవర్తి సూర్యనారాయణమూర్తిగారు

౧

వాసవదత్త సౌందర్యము పూర్ణచంద్రునికంటె నధికపూర్ణము. ఆమె దేహము కమలముకంటె కోమలము. ఆమెవాణి విపంచీస్వరమును దిరస్కరింపజాలియుండెను. ఆమె లజ్జాన్విత నేత్రములు హరిణీనిలక్షింప గలిగియుండెను. స్వర్గసౌందర్యము తనరుచిననుసరించి నిజకోమలహస్తములచేత యీసజీవస్వర్ణప్రతిమను నిర్మించెను. ఇట్టిభువనమోహినిశోభ- ఇట్టిరూపరాశి - యొసంగికూడ నామెను వేశ్యగాబుట్టించుట విధాతకు ధర్మమేనా? పంకమందు పద్మములు, కంటకములందు పుష్పములు మొలిపించు నతని కేరయెఱుక.

ఆసమయమున బాలవసంతమందలి సుషమాపూర్ణప్రభాతమందు, పికకరుణగానమును హృదయమున కానుకొని మలయసురభియుల్లాసముగావీచుచుండెను. అట్టితఱి నొకశ్రమణుఁడు భిక్షకై వాసవదత్తయొక్క నువిశాలప్రాసాదమునకేగి ద్వారముకడనిలువఁబడెను. అకాత్తుగవాసవదత్తదృష్టి యాబౌద్ధభిక్షుకునిపై బడెను. ఆమె అతని నొకసారి చూచెను; నూఱుసారులుగాంచెను- వీక్షించుచునేయుండెను.

అతని పేరుపగుప్తుఁడు. సాంసారికదృష్టిలో నాతఁడుభిక్షుకుఁడుగాని స్వర్గీయదృష్టిలో నాతఁడొక రాజరాజేశ్వరుఁడు. మనస్సును మించినశ్రేష్ఠమగు స్వతంత్రరాజ్యమింకేదియు లేదు. ఉపగుప్తుఁడు తన ఆరాజ్యమందు జయలబ్ధిగాంచెను. అతఁడు రాజరాజేశ్వరుఁడు. సమస్తేంద్రియము లాతనిప్రజలు.

విశ్వచంచలత్వము, అశాంతి నాతఁడు బాగుగ నెఱుఁగును. అతనినయనము లచంచలములు, శాంతములు. స్వర్గీయదివ్యప్రకాశముచే నాతనిముఖమండలము భాసమానమైయుండెను. కాషాయవస్త్రము లాతనికపూర్వశోభాప్రదానము జేయుచుండెను.

నిజసౌందర్యముచే జగత్తును బరాజితముచేసెడి వాసవదత్త ఆభిక్షుకుని సమీపమున బరాజితయైపోయెను. అతనిసౌందర్యముపై ముగ్ధురాలైపోయెను. ఆమె కౌశేయాంచలము జాఱిపోయెను; కబరీశిథిలమైపోయెను. తద్గ్రథితపుష్పరాశి ముక్తమై భూపతనమయ్యెను.

ఆమె యుపగుప్తుని సమీపాగతయై—"భిక్షు! భిక్షాపాత్రము ముందునకు జాపు"మనియెను.

భిక్షాపాత్రము ముందునకుజాపి అకాత్తుగ నాశ్చర్యచకితుఁడై యుపగుప్తుఁడు"—కాని నీహస్తద్వయము రిక్తమైయున్నది. ఇది నాకేమియొసంగగలుగును?" అనెను.

వాసవదత్త—నీకింతవఱకు లభియించనిదియు, ఈకరములు ఇదివఱకెవ్వరికి బ్రదానము జేయనటువంటిదియునగువస్తువు నిదియిచ్చును.

ఉపగుప్తుఁడు—అనఁగా?

వాసవదత్త—ఈహస్తములు రిక్తములుకావు.

ఉపగుప్తుఁడు—నేనీస్వర్ణభూషణముల నేమిజేసికొందును?

వాసవదత్త—నేనీసువర్ణాభరణములవిషయమై చెప్పుటలేదు. అబోధయువకా! ఈహస్తములు శూన్యములుగావు. ఇవి ప్రేమాలింగనపరిపూర్ణములు: నేనాయాలింగనమే నీకొసంగెదను. ఊహించుకొనుము. భిక్షుకా! ఏవాసవదత్తయొక్క ఛాయాస్పర్శమునకై గొప్పగొప్పరాజాధిరాజులు వ్యాకులులగుచుందురో యామె నీకు ప్రేమాలింగనమొసంగును.

ఉపగుప్తునిముఖభావములలో బరివర్తనమించుకంతయు గలుగలేదు.

వాసవదత్త మఱల—"భిక్షాపాత్రము ముందునకుఁజాపుము. నేను నీకుభిక్షలో నాహృదయ మొసంగెదను." అనిపలికెను.

ఉపగుప్తుఁడు—దీనియర్థము?

వాసవదత్త—నీయీసుకుమార దేహము భిక్షావృత్తికొఱకుగాదు. ఈయనుపమసౌందర్యనూతనము సంసారస్పర్శావిహీనమై దూరముగ వనవక్షమందు మ్లానమగుటకుగాదు. ఇదియే దీనియర్థము. రమ్ము, భిక్షూ! మాసదనమునకు జనుదెమ్ము. నేను విశ్వస్వామినిని. నీకు దాసినయ్యెదను.

ఉపగుప్తుని వాసనాప్రభావరహితముఖమండలమం దొకసస్మితరేఖ ప్రకటితమయ్యెను. అతఁడూరకుండెను.

వాసవదత్తవికలరై "జవాబొసగుము భిక్షూ" అనిపలికెను.

ఉపగుప్తుఁడు జవాబిచ్చెను—"కాని కొన్ని కారణములచే నిప్పుడే సమయముకాదు."

వాసవదత్త—"అయితే ఎప్పుడు?"

ఉపగుప్తుఁడు—"కొలఁది దినములతీగినపిదప మఱలవచ్చెదను"

"మఱల కొన్ని దినములపిదప వచ్చెదను" వాసవదత్తమనస్సులో నాలోచింప మొదలిడెను—"రమణీరూపమునకిట్టి యవమానమా? ఒకసామాన్యభిక్షు నాసౌందర్యతిరస్కారమొనర్చెను. ఒనర్పఁగలిగెను. మాదెదనుగాక, నేనాదినమును ప్రతీక్షించెదను."

ఉపగుప్తుఁడు ద్రుతగతి సంఘముకై పునఃకునిర్గమించెను. వాసవదత్త సువర్ణమూర్తివలె నాతనిని నీరవయై, నిశ్చలయై గాంచుచుండెను.

౨

నిజాల్పజీవనముయొక్క క్షణికప్రభనొకదానినిజూపించి సంధ్య శీఘ్రగతితో గడచిపోయెను. శారదీయశుభ్రాకాశప్రాచీదిశయందు దరహాస్యముఖసుధాంశుకిరణములు రూపోజ్జ్వలచంద్రికను విరజిమ్ముచుండెను.

ఒకసఘనవనలపాదముదఱుపుచు గలకలరవరతయగు గంగ ప్రవహించుచుండెను. దినమంతయు భిక్షాభారసహితుఁడైన యుపగుప్తుఁడు-అవనమునుండియే-తనమఠమునకు తిరిగివచ్చుచుండెను.

అభయంకరహింసకపశువగు సింహముపై గరుణావతారుఁడగు బుద్ధభగవానుని యుపదేశము కొంచమైనను పనికివచ్చియుండలేదు. దానిరాక్షసప్రవృత్తి పరివర్తితముకాలేదు. సింహముపగుప్తునిరాకచూచి మిక్కిలి వేగముగ మీఁదకుఱుక సిద్ధమయ్యెను. ఉపగుప్తుఁడిదిగాంచి నిజమస్తక మవనతమొనరించుకొనెను.

ఒకవైపున సింహముపగుప్తుని భక్షణార్థమై సిద్ధమైయున్నది. రెండవప్రక్క నుపగుప్తుఁడు సింహమునకాహారుఁడై నిలబడియుండెను.

దగ్గఱనే యొకనిబిడకుంజముండెను. తత్కుంజమునకొక ఛిద్రముండెను. వసంతపూర్ణప్రతులతమందు యథాశక్తి ప్రయాసయొనర్చినప్పటికిగూడ నాకులుదానిని బూడ్చజాలకపోయెను. ఆఛిద్రమునుండి వ్యాధుఁడొకఁడీభయానకదృశ్యముగాంచెను.

పంచాననము భిక్షుకునిపైదుముక సిద్ధమైనంతలో వ్యాధుఁడు నిజకార్ముకముపై బాణమెక్కిడి యొడఁటికుంజపత్రమును విదీర్ణమొనరించి కేసరిని భూతలశాయిగనొనర్చెను.

ఉపగుప్తుఁడు చకితుఁడై నాల్గువైపుల దిలకించెను. నిజకార్యసాఫల్యముపై చిరునవ్వునవ్వుచు కిరాతుఁడు ధనుర్ధారియై యాతని వైపునకఱుదెంచుచుండెను.

భిక్షుకుఁడు దుఃఖమిశ్రితవచనముల వ్యాఘ్రునితో-"హా!! నీవేమి చేసితివి? మృగరాజా నీకేమియపకారము చేసెను? అకారణముగ నిరపరాధహత్యయెందుకు గావించితివి?" అనివచించె. వ్యాఘ్రుడు మనస్సునందే ఆలోచించెను—"సింహము-నిరపరాధమా?" తనదయాహీనకఠోరజీవనమందు మొట్టమొదట వ్యాఘ్రుఁడిచ్చట కరుణాదేవిని దర్శించెను. ఆతఁడు చిత్రాంకితమూర్తివలె కొద్దిసేపటివఱకు నిలచియుండెను. ఉపగుప్తుఁడు కరుణాపరిప్లావితదృష్టి నాతనిమీదని క్షేపించెను. నేత్రములుచూచెను; హృదయము హృదయసందేశము తెలిసికొనెను.

వ్యాఘ్రునికరద్వయము కంపించెను. ఆతఁడు భుజముపైనుంచి తూణీరముదీసి గంగావక్షమందు విసరివైచెను.-ఆతనినిర్దయత గంగయందు మునిఁగిపోయెను. నిజబలిష్ఠహస్తములతో ధనస్సునురెండుముక్కలుగ జేసి భూమిపైబడవేసెను.-ఆతని కఠోరత్వమంతిమశ్వాసములు గొనుచుండును. తదుపరి భిక్షుకునిపాదములపై బడి వ్యాఘ్రుఁడు—"దేవ! ఇదియే నాయంతిమహత్య" అనియెను.

ఉపగుప్తుఁడు ప్రసన్నముఖముతో నాశీర్వదించెను. వ్యాఘ్రుఁడు తన నవీనసంసారమందు ప్రవేశింప జనియెను. కరుణయాతనికి పథప్రదర్శినియయ్యెను.

దయార్ద్రహృదయుఁడగు యుపగుప్తుఁడు భూశాయియగు సింహము వైపుగాంచెను. దానిరొమ్ములందు దుస్సహముగ బాణముదూరియుండెను. భిక్షుకుఁడు దానినతికష్టములో గంగాతీరమునకు గొనిపోయి దానిగాయములు గడుగుచుండెను.

చంచలగంగాహృదయమందు, దళదిళలగీతసుధావృష్టిగురిపించుచు నొకనావపోవుచుండెను. శారద నిర్మలచంద్రిక బాగుగవ్యాపించియుండెను. వనప్రాంతమందు, గంగాతరంగములందు నపూర్వశోభాంకితమగుచుండెను.

ఉపగుప్తుఁడు తనపనియందు ప్రవృత్తుఁడయ్యెను. సింహము బ్రతుకుననుయాశ లేకుండెను. కాని భిక్షు దత్తచిత్తుఁడై తనకార్యము చేయుచుండెను.

నావ ఆవైపునకే రామొదలిడెను. గానస్వరము పగుప్తునికిప్పుడు స్పష్టముగవినిపించుచుండెను. నావయందితరులెవ్వరును లేక - నాముక్తకుంతల వాసవదత్త శరచ్చంద్రునిధిక్కరించుచు పాడుచుండుట- నాతఁడు గాంచెను.

భిక్షు సింహవక్షమందలి బాణము బయటకుదీయహస్తముజాచెను. అకాత్తుగ గానమాగిపోయెను. నావ భిక్షుకుని సమీపమునకువచ్చి తగిలెను.

నావలోనుంచి వాసవదత్త చకితరాలై అరచెను—"భిక్షు! ఇదియేమి చేయుచున్నావు? జీవనలాభము బొంది యీభయంకరహింసపశువు తన జీవనదాతనునుర్తింపజాలదనువిషయము నీకు తెలియదా? ఇది నీ సర్వనాశ మొనర్చివైచును."

ఉపగుప్తుఁడుపలికెను—"రమణీ, నీవు పొరబడుచున్నావు. ఇది బాహ్యమందరమున్న హింసకపశు పులకంటె నధికభయంకరము గాదు. ఏసుందరరూపముచాటుననిలబడి మనుష్యశత్రువు, మారుఁడు వాని పథకైఆకర్ణాంతము ప్రత్యంచలాగి నిలబడియున్నవాఁడో, దానికంటె-ఆసుందరరూపముకంటె-నిది భయంకరమైనదికాదు. ఎవరు నిజమోహబంధనముచే మనుష్యునిబందిగజేసియుంచిరో ఆసుందరమోహముకంటె నిది అధికభయానకముగాదు. దేనివెనుక మనుజుఁడు నిజధ్యేయధర్మమునుమఱచి అనంత- జన్మ- జరత్తులలో తిరుగుచున్నవాఁడో- అట్టిహస్తమందు స్వర్ణముకుటముదాల్చి ఛాయాసమాననిస్సారలోభ - లాలసత్వము కంటె - అధికభీషణముకాదు."

వాసవదత్తకొంచెముకూడ కదలికొనజాలకపోయెను. ప్రేమాధీరయైయామె—"భిక్షు, నేను నీప్రతీక్షజేయుచుంటిని. నీవురాలేదు. ఏమి మఱచిపోయితివివాయేమి?" అనియెను.

ఉపగుప్తుఁడు—"లేదు. మఱువలేదు. నేనువచ్చెదను. కొలఁదిదినములపిదప వచ్చెదను."

వాసవదత్త—"నేఁడేరమ్ము భిక్షు. ఇంతకన్న సుందరతమసమయమింకెప్పుడువచ్చును? నేఁడుచంద్రుఁడు సంసారము నాలోకితముజేయుచున్నాఁడు. నీవునాగృహాంధకారమును దూరీకృతమొనర్పుము."

"నిలువు"మని చెప్పి భిక్షు మెల్లమెల్లన సింహవక్షమునుండి బాణమును వెలికిదీయనారంభించెను.

వాసవదత్త—"నీవు నీసౌందర్యశరముచే నన్నాహతను చేసితివి. మొదట నాకు ప్రాణదానమొనర్పుము"

ఉపగుప్తుఁడు—"ధైర్యవైయుండుము సుందరీ! నేనవశ్యముగ చనుదెంతును"

వాసవదత్త—"ఎప్పుడువచ్చెదవు? నీప్రతీక్షజేయజేయ నానేత్రజ్యోతి నిర్గమించినపిదపనా? దినగణనము జేయఁజేయ సమయము నానుండి జవ్వనమునులాగికొనినతరువాతనా నీవువచ్చుట?"

ఉపగుప్తుఁడామెవైపునకుగాంచి యాలోచించెను—"సరే, ఇదియేమి! ఇంతజ్ఞానమున్నమకూడ నీమెగొయ్య లోపడబోవుచున్నది?"

వాసవదత్త మఱలనడిగెను—"ఎప్పుడువచ్చెదవు?"

ఉపగుప్తుఁడు—"ఈజీవనమందే"

వాసవదత్త—"ఈజీవనమందా? ఇదిచాల దీర్ఘావధి."

ఉపగుప్తుఁడు—"మఱియెప్పుడు?"

వాసవదత్త—"ఈక్షణమందే. చెప్పుము"

ఉపగుప్తుఁడు—"కాదు"

వాసవదత్త—"ఈ మాసమందే"

ఉపగుప్తుఁడు—"ఈ వర్షమందే వత్తును. ఇదిసత్యమని నమ్ముము"

వాసవదత్త—"నేను నావ్రేళ్లతో దినములు శ్వాసములతో క్షణములు లెక్కించుకొందును"

వాసవదత్త వెడలిపోయెను. ఉపగుప్తుఁడు మృతప్రాయసింహహృదయమునుండి శరముదీయప్రవత్తుఁడాయెను.

## 3

శరత్కాలమేగెను; శిశిరముగడచెను; హేమంతముచనెను; కాని యుపగుప్తుఁడురాలేదు. వాసవదత్త ఆనేకసారులు లక్షపూర్ణప్రతీక్షణముజేసెనుగాని యుపగుప్తుఁడురాలేదు. ఆమె యనేకసారులు శృంగారము జేసికొనియెను, సర్వమువ్యర్థమయ్యెను.

మమత, సురభి సంజీవినిగొని యంతమున వసంతర్తువుచనుదెంచెను. అప్పుడుకూడనతఁడు రాలేదు. చూచుచుండఁగ నీయవధికూడగడచిపోవవచ్చెనుకాని యుపగుప్తుఁడురాలేదు. అతృప్త-ఆక్రాంత-నేత్రములతో వాసవదత్త-ఆ యెప్పుడును రాని వానిమార్గము గాంచుచుండెను. అన్నియువచ్చెను. రానిదియొక యుపగుప్తుఁడుమాత్రమే.

మితిదాటుటకు రెండుమాసములుండెను-ఒకమాసముండెను. సంసారముయొక్క పాంథనివాసమందాగిన పథికుఁడు"వర్ష"మేగసంసిద్ధుడవజొచ్చెను. అతఁడు శిశిరకంబళము భుజముపై వైచుకొనియెను; హేమంతమృదుశయ్య గట్టిచేసికొనియెను; వసంతపుష్పవస్త్రము సవరించుకొనెను; గ్రీష్మఛత్రము హస్తమున, జోళ్లు కాలికి దీసికొనియెను; వర్షాకాలరిక్తపాత్రముత్రాడుగూడ గైకొనెను. అతఁడు తనఅంతిమవస్తువు శారదచం

ద్రిక గ్రహించుటకై హస్తముజాపినంతలో వాసవదత్తవికలయై—"ఏమి నిజముగా నాప్రియతముఁ డీవత్సర మునకు రాఁడా?" అనిపలికెను.

రజనీసమయము. సమస్తపృథ్వియు నంధకారమునమునిఁగియుండెను. వాసవదత్తభవనము సహస్రాలోక మాలలచే బ్రకాశించుచుండెను. జ్యోతిఃకిరణము లామెస్వర్ణభూషణములపై బ్రతిఫలించి వానికాంతినియినుమడింపజేసి యపూర్వశోభఁగొలుపుచుండెను. అసంఖ్యదీపములు తారకాసమానములుగనుండెను. వాటిమధ్య వాసవదత్తముఖము శశినిభమై శోభితమైయుండెను.

ఆనాఁజన వాసవదత్తగృహమున యుత్సవము. ఈయుత్సవమామె ప్రేమియగు లక్షపతి స్వాగతార్థమై రచింపఁబడెను. ఒకప్రక్కసంగీతధారలు రెండవప్రక్కను మద్యధారలు బ్రవహింపుచుండెను. మధ్య నభాగ్యుఁడగు లక్షపతి మునుఁగుచుపోవుచుండెను.

అర్ధరాత్రియగుటకు బూర్వమే లక్షపతి సురాప్రభావముచే నచేతనుఁడైపోయెను. అతనికి-నిజ పరయనుజ్ఞప్తిలేకుండెను. సంగీతమాగిపోయెను. దాసి, పరిచారికాదులు సెలవుగొనిరి. కక్షయందు లక్షపతి వాసవదత్తతప్ప నితరులెవ్వరును లేకుండిరి. కాదుకాదు. ఇంకొకపిశాచినియొకర్తకూర్చుండియుండెను. అదియెవరు? వేశ్యయగు వాసవదత్తప్రతిఛాయ.

వాసవదత్త నాలుగువైపులదిలకించి ఒకఛురికదీసెను. రాత్రిసమయమున యొక వేశ్య చేతిలో ఛురికయా? ఆమె ఇదేమి చేయఁదలఁచుచున్నది? సంగీతసుధనువర్షించు ముఖచంద్రుఁడు వజ్రమునుగూడ రాల్ప గలుగుచుండెనా?

ఆమె ఆ అచేతనుఁడగు లక్షపతినివధింపజనెను. ఆమె సఛురికాహస్తమును గగనమువైపునకెత్తెను. "జాగ్రత. పైనభగవంతుఁడున్నాఁడు. ఆతనిభయముంచు" మనునట్లుండెను. పాపిని ఆమూకహస్తసంజ్ఞ గుర్తింపజాలకపోయెను. ఆమె ఆఛురికనులక్షపతిహృదయమున గ్రుచ్చివైచెను. లక్షపతిచీత్కారమొనర్చెను. —"హాఛలనామయీ, పిశాచినీ"—ఇవి అతనియంతిమశబ్దములు.

రూపవతిరాక్షసి- సుకుమారపిశాచిని- తనగెలుపుపై ప్రసన్నురాలయ్యెను. ఈ సమయముననే వెలుపలినుండి యెవరో కరుణకంఠముతో—"వాసవదత్తా"అనిపిలచిరి.

కంపిత వాసవదత్త గవాక్షద్వారము తెఱచి—"ఎవరని"అడిగెను. ఉత్తరమున కావశ్యకత లేకపోయెను. గవాక్షద్వారమునుంచి గదియందలిదీపమువ్యక్తిముఖమండలముపైఁ బ్రసరించెను. ఆతఁడు శ్రమణుఁడగు యుపగుప్తుఁడు. వాసవదత్తహర్షయై—"భిక్షు! నీవువచ్చితివా?"అనియడిగెను.

ఉపగుప్తుడు—"లేదుకాని శీఘ్రిముగ నేవత్తును."

వాసవదత్త—"మాతీ-యీకుసమయమందు రాఁగారణమో?"

ఉపగుప్తుఁడు—"ఏమియులేదు. నేను నావిహారమరుగుచుంటిని. ఇచ్చటనాకు నీవుజ్ఞప్తికివచ్చితివి. నీవు నిద్రించితివో లేక మెలకువగనుంటివో తెలియనుత్కంఠితుఁడనైతిని",

వాసవదత్త—"నేను మెలకువగ నేయుంటిని"

ఉపగుప్తుఁడు—"కాని నీకండ్లురెండు మూసికొనియున్నవి. మంచిది. పోవుచుంటిని. నేఁడు నాకాలస్యము మిక్కిలియైపోయినది"

వాసవదత్త—"ఆగుము. నీకు నీప్రతిజ్ఞజ్ఞాపకమున్నదా?"

ఉపగుప్తుఁడు—"ఉన్నది"

వాసవదత్త—"నీవీవత్సరములోపలనే నన్నుగలియవాగ్దానమిచ్చియుంటివి"

ఉపగుప్తుఁడు—"ఇప్పటికి వర్షములో నెన్నిదినములు శేషమున్నవి?"
వాసవదత్త—"కేవలమొక పక్షము"
ఉపగుప్తుఁడు—"అవశ్యముగ దానిలోపల నే వచ్చెదను"
వాసవదత్త—"నీవసత్యమాడుచుంటివి. నన్ను మోసపుచ్చుచుంటివి"
ఉపగుప్తుఁడు—"ఆమితాభునిశిష్యుఁడు కల్లలాడఁడు, మాయమర్మములాతని ధర్మములుకావు."
ఉపగుప్తుఁడు యామినీ గంభీరాంధకారమునఁగలసి యదృశ్యుఁడయ్యెను.
వాసవదత్త గవాక్షద్వారముబంధించి లోనికిజనియెను.

౪

వాసవదత్త ధనముకొఱకై లక్షపతినివధించెను. భేదము విడిపోయెను. ఆమె విచారణకై న్యాయాలయమునకు గొంపోఁబడెను.

ఆమెధనమామెకు పనికివచ్చినదికాదు, ఆమె ప్రేమీజనమామెకు సహాయమొనర్పలేదు; ఆమె అనుపమ సౌందర్యముగూడ నామెను శిక్షనుండి తప్పింపజాలకపోయెను.

దురదృష్టవంతురాలగు నామెకు న్యాయాలయమునుండి యురిశిక్ష ప్రాప్తించలేదు. ప్రాణదండమామె యశాంతజీవనమునకు శాంతిప్రదమైయుండెడిది. అదిశిక్షకాదాశీర్వాదము.

ఆమెరూపము కురూపము చేయఁబడెను. ఆమె చంద్రవదనమందలి నేత్రములులాగివేయబడెను; కర్ణనాసికలు ఖండింపఁబడెను; మృణాలకరములు ఛేదింపబడెను; ఆమె సమస్తధనసంపత్తియు లాగికొనబడెను.

వాసవదత్తకీ భయంకరశిక్ష లభించుసమయమున నామె మిక్కిలి కరుణస్వరమున ప్రార్థించెను. —"నేనొకవారము గడవదగుచుంటిని. నేను నాప్రేమియొకనితో. గలియవలెను; అతఁడీవారములోపల రాఁగలఁడు. అనంతరమున అత్యంతహర్షముతో ఘాతకునిహస్తములకు న్యాయకుఠారమునకు నాదేహమర్పించెదను."

ఆమెవినయము నెవ్వరు నొప్పుకొనలేదు. ఘాతకుఁడు వాసవదత్తను గురూపినిగను గుత్సితముగను నొనర్చి రాజపథమందు విడచివైచెను. ఆమెపాపకథ యుచ్చస్వరముతో వినిపించుచు నొకమనుజుఁడామె వెంటదవిలియుండెను.

ఎంతభయంకర బీభత్సదృశ్యము! ఆమె క్షతములనుండి రక్తము, చీముకాఱుచుండెను; దానియందీగలు వ్రాలుచుండ నామెహస్తహీనయగుటచే వాటినిఁ దోలుకొననైనజాలకుండెను. ఆమె కరుణస్వరమున కేవలము రోదనమొనర్చుచుండెను.

ఇంతకుముందామెసౌందర్యోపాసకులైనవారామెను ఘృణాదృష్టితో గాంచుచు, దూరమునుండి చూచియే పాఱిపోవుచుండిరి. జనులందఱామెపై నుమియుచుండిరి. మార్గమందలి భిక్షుకులు, అంధులు, కుంటివారు, కుష్ఠరోగులుకూడ నామెస్పర్శచే తొలఁగఁ బ్రయత్నించుచుండిరి.

ఎప్పుడామెకడ విశ్వాకర్షకరూపములేదో, యౌవనములేకుండెనో, విత్తములేకుండెనో, ఎప్పుడుప్రపంచమంతయు నామెను నైచ్యభావమునఁజూచుచుండెనో, ఆమెజీవమాత్రసమవేదనచే దూరమైయుండెనో అప్పుడు-ఇట్టి దుర్దినమం దుపగుప్తుఁడు చనుదెంచి యామెమస్తకముపై నిజహస్తముంచెను.
వాసవదత్తచకితయై—'ఎవరని' యఱచెను.
ఉపగుప్తుఁడు—"నేను."

వాసవదత్త కంఠస్వరము గుర్తించెను. తనభ్రమను తొలగించుకొనుటకై — "ఎవరు, నీవుపగుప్తుఁడవేనా?" అని యడిగెను.

ఉపగుప్తుఁడు — "అవును. నేనుపగుప్తుఁడనే"

వాసవదత్త దీర్ఘశ్వాసమునుఁబుచ్చి పలికెను — "తిఱిగిపొమ్ము. నీవెందులకేగుదెంచితివి? ఏమినన్నపహసింప నరుదెంచితివా?"

ఉపగుప్తుఁడు — "నీవు నన్ను తిఱిగిపొమ్మని చెప్పుచుంటివా? నేను నీవుచెప్పినట్లుగనే నీవద్దకువచ్చితిని. నే వచ్చుటలో నాలస్యమవలేదు. ఇంకావర్షపూర్తికి రెండుదినములు శేషించియున్నవి"

వాసవదత్త నిరాశాస్వరముతో — "హా! నాదేహము వసంతసురభిచే సౌరభవంతమైయున్నప్పుడు నీవు రాలేదు; మదీయశోభాచంద్రుఁడు పృథ్విపై సుధావృష్టియొనర్చునప్పుడు నీవురాలేదు. ఘాతకులు నాజవ్వనము నశింపజేయ తమశస్త్రములు ప్రశస్తవస్త్రఖండముమీద పదునుగొల్పునప్పుడును నీవు రాలేదు. భిక్షు. నీవింత యబోధుఁడవాయేమి? మత్ సౌందర్యదీపము నిర్వాణమునొందెను; మామకశోభాసూర్యుఁడస్తమించెను! ఇట్టి సమయమున నీవెందుకరుదెంచితివి?" అనియెను.

ఉపగుప్తుఁడు — "భగినీ! నేనింద్రియప్రేరితుఁడనైగాని మఱి ఏస్వార్థసుఖమునకై నీవద్దకువచ్చియుండలేదు. శారీరకసౌందర్యమువ్యర్థము; నీయీశరీరము దీనికిసాక్షీభూతము. ధనముకూడనిస్సారము, నీయతులైశ్వర్యమిందులకుత్తరమొసఁగును. నేను నీవద్దకువచ్చితిని. చెప్పుము. నీవుచెప్పదలఁచినదియేమి?"

వాసవదత్తనయనములు విడివడెను. ఆమెపలికెను — "నేనేమి చెప్పగలను భిక్షు! నీయీప్రశ్న నాయుత్తరమును లాగివైచినది. నేనొక స్వప్నమువెనుక, ఒకఛాయవెనుక, ఒకమరీచికవెనుక బఱుగెత్తుచున్నట్లు తోచుచున్నది. నేఁజెప్పఁదలఁచినదేదియులేదు. నీవు నాసమీపమున కొద్దిసేపటివఱకు నిలబడియుండుము. భవత్స్పర్శచే నా యాతన తగ్గిపోవుచున్నది; నీ పలుకులచే నాసంతాపము దూరమగుచున్నది. భిక్షుశ్రేష్ఠ, నీవే యేదైనచెప్పుము."

ఉపగుప్తుఁడు — "ప్రపంచదుఃఖములకుమూలము తృష్ణ, నీవీ తృష్ణావశవై తిఱుగులాడుచుంటివి. నీవు నీధర్మమును దర్పకునిహస్తముల కమ్మివైచితివి; నీవుధనార్థమై నీప్రేమి లక్షపతిని వధించితివి. నీదుఃఖసమయమున నీకు సహాయముజేయ నెవఁడునురాఁడయ్యె."

వాసవదత్త — "హా! భిక్షు. ఇంతకుముందువచ్చి నేను మోసపడకుండ నెందుకురక్షించితివికావు? నీవు వచ్చితివి; కాని చాలఆలస్యముగవచ్చితివి."

ఉపగుప్తుఁడు — "విలంబమేమియు జరుగలేదు; ఇప్పుడింకను చాలసమయముగలదు. నీ విప్పుడు బాహ్యనేత్రశూన్యవు; కాని నీయంతర్నేత్రములు తెఱువఁబడియున్నవి. రమ్ము. భగవానుఁడగుబోధిసత్త్వుని హస్తముగ్రహింపుము. ఆయన నీదుఃఖములుహరింపగలరు. నిన్నుముక్తిచేయగలరు."

వాసవదత్త మరుసంసారమందాకసమునుండి సుధాబిందువర్షమయ్యెను. ఆమె సాత్త్వికప్రవృత్తిమేలుకొనియెను; ఆమెకు సంసారక్షణభంగురత్వము తెలసెను; తెలియుటయేకాదు; అనుభవముగూడనయ్యెను. ఆమె భిక్షుపాదములపై నిజశిరస్సు నవనతమొనరించి — "నేనుప్రస్తుతనైయుంటిని. నన్నుగొనిపొమ్ము, మదీయాంచలముగ్రహించి నన్ను శాంతిరాజ్యములోనికి గొనిపొమ్ము" అనిపలికెను.

భిక్షు నిజపవిత్రకరములచే నామెను స్పృశించెను. ఇద్దఱు సంఘమువైపునకేగిరి.

పాపతాపవిదగ్ధ వాసవదత్త ప్రాయశ్చిత్తసురనదీస్నానమొనర్చెను. ప్రవ్రజ్యాగ్రహణయై నిజశేష జీవనమందు శాంతిబొందెను.

# శూన్యమందిరం

యం. వి. యస్. యస్. అవధానిగారు

పరిగెత్తుకు వెళ్తున్నాను. చటాల్న నాకంటికొక మందిరం కన్పించింది. తలుపు తెరిచివుంది. లోపల ప్రవేశించాను. దానంతటదే మూసుకుంది దానితలుపు. అది ఒకశూన్యమందిరం. లోపలదట్టమైన చీకటిదప్ప యింకేమీలేదు. భయంవేసింది. కూచున్నాను భోరున యేడుస్తూ. తలుపునెవరోతట్టారు. ద్వారంవంక చూశాను. తలుపు మెల్లిగా తెరుచుకుంది. ఒక బాలిక నవ్వుతూఆడుతూ లోనప్రవేశించింది. తలుపుమూసుకుంది. నాదుఃఖం మాయమయింది. మెల్లిగాఅడిగాను: నువ్వెవరు? నవ్వుతూ చెప్పింది: నాపేరుప్రభాతం. నేనూ, ఆబాలికా యెంతసేపాడుకున్నామో?

* * * *

మళ్లాతలుపుతట్టినధ్వని. తలుపు తెరుచుకుంటూంది. "నేను వెళ్ళిపోవాలి" అంది. రెండుబాష్పబిందువులు విడిచాను. ఆబాలిక వెళ్లిపోయింది. ఒకయువతి లోనప్రవేశించింది. తలుపుమూసుకుంది. ఆమెనవ్వింది. ఆనవ్వువేరు. "నీపేరు?" అన్నాను. "మధ్యాహ్న"మంది. ఎంతఆనందం! ఏంతసేపాడుకున్నామో? కాలం కనబడలేదు.

* * * *

మళ్లా తలుపుతట్టినధ్వని. నాగుండెలో బండపడింది. "నేను వెళ్లిపోవాలి." "నువ్వా?" ఏడుస్తూ ఆమెచేతులుపట్టుకున్నాను. మెల్లిగానాచేతుల్లోంచి జారిపోయింది. ద్వారందాకా వెంబడించాను. లాభంలేదు. ఒకవృద్ధస్త్రీ లోనప్రవేశించింది. తలుపుమూసుకుంది. నాహృదయం చలించింది. "నీపేరు?"అన్నాను. "సాయంత్ర" మంది. ఎంతభయంవేసింది! క్షణం...యుగం.

తలుపుతట్టినధ్వని. తలుపు తెరుచుకుంది. ఎవరూలేరు. "పద వెళ్లిపోదాం" అంది. "ఎక్కడికి?"అన్నాను. "రా" "నేనురాను." ఈంద్రపడ్డాను. ఏడ్చాను. లాభంలేకపోయింది. నన్నుగొరగొరాయీడ్చుకుపోయింది. తలుపుమూసుకుంది. అది శూన్యమందిరం.

# దీపావళి

ములుగు రాజలింగ ఆరాధ్యగారు

దీపావళియనగా దీపములవరుసయని యర్థము. (వరుసలుగా దీపములతో అలంకరించుట). ఈమహోత్సవము దేశమంతటను జరుపబడుచున్నది. బాలకులందరును అమావాస్య ఎన్నడో ముందువచ్చుననగా నే యుద్ధసామగ్రితో తయారగుచున్నారు. (టపాకులు మొ॥నవి.) ఈకాలమున దేశమంతయు భయంకర ధ్వనులతోను, వాయువంతయు గంధకపువాసనతోను నిండిపోవును. ప్రతిసంవత్సరమును మనదేశమునుండి కొన్నికోట్లరూపాయల నెగుమతి చేసి చైనా, జపాను, జర్మనీ, మొదలగు విదేశములనుండిగూడ, మందుసామానులతెప్పించి తగులబెట్టుచున్నారు. విదేశీవస్తువులకై అనవసరముగా ద్రవ్యమును గవ్వరైనను వెచ్చించవద్దను కాంగ్రెసు ఆదేశమునుగూడ గమనించక యింకనుకొని తగులబేయుటలోనైనను ఏదో ఉద్దేశ్యముండవలెనుగదా! అదేమి?

ఈపండగలో రెండిమిడియున్నవి:—

i. నరకచతుర్దశి, ii. దీపావళి.

## నరకచతుర్దశి

ఈ ఆశ్వయుజబహుళ చతుర్దశినాడు తైలాభ్యంగ స్నానముచేసి యమతర్పణము చేసినవారికి యమలోక దర్శనముకూడ లేదనియు, చేయనివారికి, సంవత్సర కృతధర్మము నశించుననియు శాస్త్రములందుండుటచే, నరకబాధావిముక్తికై ఏర్పడినచతుర్దశిగాన 'నరకచతుర్దశి'యనుట యుక్తమే. ఐనను లోకమున దీనికి నరకాసురవధతో సంబంధమున్నటుల ప్రచారముండుటచే దీనియొక్క చారిత్రకప్రాధాన్యతగూడ గమనించకతప్పని సరియగుచున్నది. కాన నరకాసురుడు వధింపబడిన రోజగుట 'నరకచతుర్దశి' యనుటయు సమంజసమే.

## నరకాసురుడు

ఈతనితలిదండ్రులగూర్చి దెలియజాలము. వరాహావతారమెత్తిన విష్ణువువలన పృథివీదేవికి కల్గెనని హరివంశ, భాగవతములచెప్పబడినను ఇట్టి పౌరాణిక గాథ ప్రకృత్యతీతము అసంభవములలో నొకటిగాన విశ్వసింపజాలము. తల్లి పృథివీపర్యాయశబ్దముగల స్త్రీ కావచ్చును. తండ్రిసంగతి తెలియకపోవచ్చును. దానికిట్టి కవితాచమత్కృతికల్గవచ్చును. లేక తల్లిదండ్రులెవరో తెలియని అనాథశిశువై ఏఅరణ్యముననో దొరకుటచే పృథివీపుత్రుడు కావచ్చును. జానకిని భూపుత్రియనినట్లు (భూమిపైదొరకుటచే). పెంచిన తండ్రిపేరుకూడ దొరకకుండుట శోచనీయము.

## విజయయాత్రలు : ప్రభుత్వము

ఆకాలమందలి సమ్రాట్టునకు ఇంద్రుడని బిరుదునామము (చక్రవర్తి). ఆతడుండు రాజ్యము స్వర్గరాజ్యము (త్రివిష్టపము Tibet). ముఖ్యపట్టణముస్వర్గము.

నరకుని ప్రథమప్రధానదండయాత్ర స్వర్గముమీద. అతడేచక్రవర్తి. మిగతదిక్కులయందుండు రాజులందరును సామంతులు. వారేదిక్పాలురు. ఇంద్రుడు మొదలగునామములు చక్రవర్తి మొదలగు శబ్దార్థసూచకములగుపదములె. ఆ యుద్ధమున సామంతులగు దిక్పతులు (వరుణాదులు) సహాయముగావచ్చి యుద్ధమొనరిచి ఓడి పారిపోయిరి. చివరకింద్రుడును జయించబడెను. అటుల స్వర్గరాజ్యమును సాధించి ఆసింహాసనమున అభిషిక్తుడాయెను.

యజ్ఞభాగమును యింద్రునికిచ్చుట ధర్మము. గాన మామూలునను సరించి యింద్రపదవినందిన తానుకబురంపగా వారలుతిరస్కరించుటచే వారల దండించి యజ్ఞభాగస్వీకరణమొనర్పవలసివచ్చెను. అందందుగల చక్కనికన్యకాజనంబు తెచ్చి చెరయుందుంచెను. ఈవిజయముచే ఈతనికి చక్రవర్తిత్వమేగాక విశాలరాజ్యమును, ఐరావతాదివస్తుసముదయంబును, ఎనిమిదివేలఏనుగులును కరగతమాయెను.

## నరక : చతుర్దశీవివాహము

విజయలక్ష్మీకరగ్రహణానంతరము, మాహిష్మతీపురమునకుచేరి త్వష్ట, ఉదాహర యనువారి సంతానము 'చతుర్దశి' యను కన్యకను అనేకామూల్యరత్నాభరణాదులసమర్పించి భార్యగాగ్రహించెను.

ఇంకను పదారువేలకుపైగా దేవ, గంధర్వ, మానుషకన్యకల నెరపట్టితెచ్చి మణిపర్వతమున పట్టణంబుచేసి కావలియుంచుంచెను.

## మురః నరకాసురులసఖ్యము

అదివరకే స్వర్గీయులతో నొకతూరి పోరితెచ్చిన అదితియొక్క అమూల్యమణికుండలముల నరకాసురునకర్పించి తనకుమారుల షడుండ్ర సంరక్షింప జేసెను. వారిని నరకాసురుడాత్మరక్షణార్థమును, కన్యా, నగర, రక్షణార్థమును నియమించెను. శుంభ, నిశుంభులతోడు చేసి ప్రాగ్జ్యోతిషపట్టణరక్షణకై మురుని నియమించెను.

## కృష్ణనరకులవైరము: దోషారోపణము

అప్పటికాలమందలి గొప్పరాజనీతిజ్ఞుడగు కృష్ణుని జేరి ఋషులును, యింద్రుడును తమ్ము రక్షింపుమని మొరలిడిరి. అందు వారు నరకునిమీద నొనర్చిన దోషారోపణములివి. ఎంతవరకు న్యాయమో విమర్శింతుము.

1. స్వర్గరాజ్యమును హరించుట:—ఇందు రాజధర్మముచే శత్రువులజయించి రాజ్యమును వశబరచుకొనియెను.

2. ఋషులబాధించుట:—యజ్ఞభాగమును యింద్రునికివ్వవలసియుండగా తత్పదవినందిన నరకునికివ్వక తిరస్కరించుటచే దండించి గ్రహించవలసివచ్చెను. అందును ఎక్కువగా దండించలేదు. మాంసాదులు విదజల్లిరనువాక్యములు కవుల స్వభావికపదములేగాని వేరుకావు. ఆజ్ఞాతిరస్కృతుల శిక్షించుటయు రాజధర్మమే. అసలు యింద్రునిచరిత్రమునను యిట్టివగపడుచునేయున్నవి.

3. కన్యాహరణము:—యుద్ధకాలమున సహజమే. కృష్ణుడుకూడ వారినే తరువాత స్వాధీనముచేసుకొనెనుగదా! కృష్ణుడే బహుస్త్రీప్రియుడై నరకాసురుని రాజ్యమందలి స్త్రీలను హరించగా వానియందలి భక్తిచే పౌరాణికులు నరకునిచేతనే తెప్పించిరేమో చెప్పజాలను.

3. అదితికుండలములహరించుట:—ఇందును దోషమసలేలేదు. మురాసురునిచే కానుకగా సమర్పింపబడెనుగాని అతనిచే బలాత్కారముగా లాగుకొనబడలేదు. అటులలాగుటకూడ రాజులకుసహజమే. కృష్ణుడు నరకాసురవధానంతరము నరకునిభండారము, అమూల్యవస్త్రాభరణాదులన్నియు పంచలేదా?

5. ఇంద్రుడుకూడా కృష్ణునిదర్శించి ఈవిధముగా విన్నవించి సహాయము వేడెను:—

క. పురములు గైకొని కోరకుల
తెరవులబట్టించె నన్ను దిక్పాలకులన్.

చ. చోరనిబిలంబులున్ వెడలజూడనిక్రంతలు గాలు
రాపడన్| దిరుగనిత్రోవలున్ విడిచుదీర్పని
గొందులు జాలుబిడ్డలే| కరయునిరేలు తీమచిటు
కన్నను విప్పనిమాకలున్ బయిం|జిరుగనిచీరలున్
గలవె చేరినయాసురకోటికి? కచ్యుతా!

శా. లోకాలోకనగంబుదాపలకు గల్లోలాహతాంభో
ధివే| లాకుంజంబులకున్ జనంజనగనాలారెంత
చింతాభరం| బాకంపంబు మనంబునన్ వెను
వగా నైరావతోచ్చైశ్రవస్స్వీకారంబున
దిక్కులందిరుగవచ్చెన్ దేవకీనందనా!

—ఉత్తరహరివంశము

ఇదిఈకాలమునగూడ ఓడిపోయిన రాజులకు సహజమగునవస్థయే గానయింద్రునికై చింతించపనిలేదు. ఇట్టులారోపించిన నేరములెవియు రాజులకనర్హకృత్యములుకావు. అతడు దుష్టుడనియనుట కసలేచాలవు.

## నరకాసురునిరాజ్యము

ఆకాలమున ఈతనిరాజ్యమేగొప్పది. ఈతడే సమ్రాట్టు. మిగతవారందరును ఈతనిసామంతులే. ఈతని విశాలసామ్రాజ్యమున యిప్పటి, యిండియా, చైనా, బర్మా, టిబెట్, మధ్యఏషియాలలోని చాలభాగమిమిడియుండినది.

ఈతనిప్రధానరాజధాని ప్రాగ్జ్యోతిషపురి. దీనికే మరియొకపేరు మాహిష్మనగరము. ఈపట్టణము యిప్పటియిండియాకు ఈశాన్యపుదిక్కున చైనారాజ్యమునందున్నది. ఈతనికి జలదుర్గ, వనదుర్గ, గిరి

దుర్గ, పవన, దహనాది దుర్గములుండుట గొప్పనాగరిక రాజ్యమని తెలియుచున్నది. ఇంకను యితని రాజ్యవ్యవస్థనుగూర్చి పూర్ణముగా తెలియు నవకాశము లేదు.

## జాతి

ఈతనికి అసురుడు, దైత్యుడు అనుపదములు వాడుటచే నీతడు అనార్యజాతీయుడో! లేక అసుర శబ్దము చేతను, త్వష్ట, ఉదాహరయను నామములు గలవారితో సంబంధముండుటచేతను పారశీకుడో! లేక దుష్టజనుఉద్దేశ్యముతో వాడబడిన రాక్షస పర్యాయముగల ఆర్యుడో నిర్ణయించు నవకాశమగుపడుట లేదు.

## నరకాసురవధ

కృష్ణుడు నరకాసురునిజయించుటకై దండెత్తి ప్రాగ్జ్యోతిషమునకు వెడలెను. అప్పుడు సత్యభామ గూడ యుద్ధము చూచుకోరికయున్నదని తెలుప వద్దని చెప్పెను. గాని:—

"నేలాది ఏతెంచి నీదేవిసంహతికల్లజెప్పెద భవద్దీప్తప్రతాపోన్నతుల్" అని సత్య ఆశబెట్టుటచే వెంటనే తీసుకొనివచ్చెను.

కాపలివారల సంహరించి కోటముట్టడించెను.

వెంటనే ఎదుర్కొనిన ఆరువేలసైన్యమును హతమొనర్చెను. మురాసురాదిసేనాప్రముఖులతో పోరి సంహరించెను. తదుపరి ఎనిమిదివేలమంది భటులొక్కతూరివచ్చి తలపడగా పోరుపెద్దదాయెను. ఇట్లుండ నరకాసురుడే స్వయముగా యుద్ధమున కేతెంచెను. వానితో ప్రబలయుద్ధమొనర్చి కొన్ని ప్రహారములగూడభరించి కొన్నిమారులు మూర్ఛనొంది ఎట్టులో అతికష్టమున కృష్ణుడాతని సంహరించి అతనికుమారుని భగదత్తుని రాజుగాచేసి యతని యధీనమందున్న ధనధాన్యములనేగాక కన్యకాసహస్రముల గూడ గ్రహించెను.

## సత్య నరకునితో పోరెనా?

పోరివధించెనా? యనునది యొకవిచారణీయాంశము. కొందరీ యపూర్వగౌరవము సత్యకేయంటగట్టుచున్నారు. ఇది ఎంతవరకుసత్యము.?

ప్రాచీనకాలమందలి వీరనారీమణులలో నాయకమణియనదగు సత్య కీర్తియపూర్వగౌరవములభించుట మాకును ఆనందదాయకమేగాని సత్యాన్వేషణమునకై ఆమె నరకాసురునితో యుద్ధముగూడ జేయలేదనియు, ఇతరులతోనే యుద్ధమొనర్చెననియు, చెప్పసాహసింపవలయున్నది.

ఆమె కృష్ణుని కాపదలో ఎక్కువసహాయము చేసి మూర్ఛపోయినప్పుడును, అలసినప్పుడును రక్షించియుండుటచే కృష్ణునియందలి భక్తిఅతిశయించినకొలది ఆమె కీర్తిఅపూర్వగౌరవమొనగూర్చపాగిరి.

ఈవిషయమును వివరించినగ్రంథములు హరివంశ, భాగవతములు. అందును ఒక్క హరివంశమున మాత్రమే సత్య నరకాసురునితలపడి యుద్ధమొనర్చెననియున్నది. హరివంశమున (ఆంధ్ర) ఈవిషయము కొంత అసభ్యముగగూడ వర్ణింపబడియున్నది. రెండుగ్రంథముల లోను చక్రియే వధించెననిగలదు.

ఇక భాగవతముననో సత్య నరకాసునితో యుద్ధమొనర్చెనని లేకపోవుటేగాక, నరకాసురుడు స్త్రీలతో నేను యుద్ధమొనర్పనని స్పష్టముగా చెప్పినటులయున్నది.:—

క. మగువ మగవారిముందర | మగతనములునూప ర
ణము మానుటనీకుఁ మగతనముగాదు | దనుజాలు
మగువలదెసజనరు| మగలమగలగుటహరీ||

భాగవతం (ఆంధ్ర).

అని కృష్ణునివీరత్వమునుగూడ నిరసించియుండెను. కాన కృష్ణుడుసంహరించుట సంభవించెను.

## యుద్ధకాలము

ఈతనికుమారుడగు భగదత్తుడు కౌరవపక్షమున భారతరణమునపోరి అర్జునుని చేత మరణించెను. భారతయుద్ధము క్రీ॥పూ॥ 16 వ శతాబ్దియందుజరిగెనని పండితులందరి సిద్ధాంతముగావున యీ యుద్ధమును కొంచెమించుమించుగా యీ శతాబ్దముననే జరిగియుండును. కాని నరకాసురవధ ఆశ్వయుజబహుళ చతుర్దశినాడే జరిగెననుటకు ప్రమాణములేదు.







## గీ తి క

దా మెర రా జ గో పా ల రా వు గా రు

ప్రాణేశ్వరునిమీద
పదముకూర్చుటెకాని
పైడివీణియపైన
పాడనేలేదంట!

మల్లెపూవులు తెచ్చి
మాలగుచ్చుటెకాని,
జీవితేశ్వరుని కయి
సేయనేలేదంట!

ఆత్మేశ్వరునిపదము
లంటిమ్రొక్కుటెకాని
కన్నీటికెరటాల
కడుగనేలేదంట!

మనసులో తనయాస
మరచిపోవుటెకాని
హృదయేశ్వరునకునెఱి
గింపనేలేదంట!








# ఆశ్వయుజారాధనము

శ్రీ రాధాకృష్ణమూర్తిగారు

పొలుపగు పుష్పచేలమును బొంది ఘనాఘనకేశజాలముం
గలియఁగఁజుట్టి క్రొమ్ముడిసి కైరవబాంధవరేఖదాల్చి మై
యలయఁగ లేతచూలున నయంబునఁజేరెడి నిన్నుగాంచినం
గలితవిలాసభాసియగు గర్భవతిం దలపింతు మాసమా!

కిసలయముల్ వెలార్చు నవకృత్రిమధూపక మింటిమండలం
బెనఁగు విధాతచంద్రిక ఫలేందిర క్రొన్ననలెత్తుమాసవుల్
పసలదనర్తు రింతకును బంటవెలంది మిసల్ రహించునో
యసమ సమస్తముం బొదలునగ్గలమై భవదాగమంబునన్.

ఉత్సవంబుమీఁద నుత్సవంబుదనర్చు
నొనర సుకృతికనెడి యుక్తిదోప
ఆశ్వినమ్మ! నిన్ను నాశించు పండువుల్
సుకృతమేమొ యీవిశుద్ధికొరకు.

సరగున శైలపుత్రియును సత్యయు ముక్కిడిరాక్షసాధులన్
దురమునగెల్చి సద్యశముతోడ రహించిరి మున్ను నీయెడన్
గరువమదేల నేటికినికల్గదు మాయభిమానశీల లీ
గరువతనంబుజూచి మదిగాంతురు సంతసమో శరద్రమా!

విజయారంభులు సర్వకార్యములు నిన్వీక్షింపగాసత్కృతిన్
విజయంబున్ గొనుసంచు పల్కెదరిదే విశ్వాసమోనమ్మ నీ
విజలంబైన నభఃప్రదేశమున నభ్రవ్రాతముప్పొంగు నే
విజయధ్వానముమ్రోయునో తెలుపరావే మాసమా! సద్దయన్.

### స్మృతిచిహ్నము

శత్రువగు నరకాసురవధకై సంతసించి, అభ్యంగనాదులాచరించుట, నూతనవస్త్రధారణము, తిరిగి రాజ్యప్రవేశమై సుఖమొందుట, మొదలగునవి పూర్వులకు జరిగినరీతి జరుగుటచే ఇప్పటికి నరకచతుర్దశిని ఉత్సాహపూరకముగా, టపాకులు కాల్చుట, విందులొనర్చుకొనుట, అలంకారాదులచేతను ఉత్సహింగుచున్నారు. అప్పటివారు కృష్ణుని కృతజ్ఞతతో గౌరవించిరి. ఇప్పటివారో కృష్ణునికి దేవత్వము స్థిరపడినకొలది మిక్కిలి స్మరించుచున్నారు.

### దీపావళి

ఈఆశ్వయుజబహుళ అమావాస్య కర్మకాండమునకు, పితృదేవతార్చనకును, ముఖ్యమైనరోజులలో నొకటి. భాద్రపదబహుళపాడ్యమి మొదలు పితృదేవతలు దీపావళివరకు క్షుధార్తులై ప్రేతపురమువిడిచి మనుష్యలోకమున పుత్రాదులనాశ్రయించియుందురు. కాన మహాలయపక్షమున శ్రాద్ధము చేయనివారు ఈఆఖరురోజైనను చేయనిచో పాపముగల్గునని శాస్త్రముల విధింపబడియున్నది. ఈదినమున దీపదానము చేసిన మహాలయపక్షమున భూలోకమునకేతెంచిన వారి పితృదేవతలకు స్వర్గయుకమార్గదర్శకమగును అని శాస్త్రము.

ఈరోజు దీపములవెల్గించుటయే ప్రధానకృత్యముగానున్నది. ఈరోజు అన్ని జాతులవారును అన్ని దేశములవారును సాయంత్రముకాగనే వీథులన్నియు దీపములతో చిత్రవిచిత్రములుగా అలంకరించెదరు. పిల్లలు రకరకములకాంతులుగల మతాబాలను వెలిగించి నేత్రపర్వమొనర్చెదరు.

ఇట్టిదీపముల కీరోజంత ప్రాధాన్యత ఎందుల కివ్వబడెను? అందు కీక్రిందిసమాధానములు వెలువడి ప్రచారముననున్నవి:—

1. దీనివెంటనే కార్తీకమాసమారంభమగుచున్నది. కార్తీకమాసమంతయు విష్ణుప్రీతికరమైనది. అందు దీపమాహాత్మ్య మెక్కువగా చెప్పబడియున్నది. ప్రతి దినము సాయంకాల మింటిముందర పురుషప్రమాణము గల స్తంభముమీద తిలతైలదీపము పెట్టినవారికి రూపసౌభాగ్యాభివృద్ధికల్గునని శాస్త్రమతము. ఒక్కదీపమునకే ఇంతఫలముండ దీపావళికెంతఫలమో వేర చెప్పవలెనా!

2. ఆరోజుచీకటి ఎక్కువగాన దానినివారణార్థమిట్లాచరింపబడుచున్నది.

3. ఈకాలమున దోమలు మొదలగుపురుగు లెక్కువగానుండును. కాన వాటినాశన మొనర్చుటకై ఈ దీపములెక్కువ సహాయకారియనియు, అందును గంధకాదులపొగచేఎక్కువగనశించుననియు కొందరిమతము.

4. ఈకాలమున చలిగాలిలో చెడ్డపదార్థములు ఎక్కువగాన వాటినివారణార్థమై, దీపములవేడి, గంధకముయొక్కవాసన సహాయకారులని కొందరి అభిప్రాయము.

5. నరకాసురవధచేగల్గిన సంతోషపారవశ్యమున ఏర్పడిన గృహశృంగారాదికమున కేర్పడినవి, దీపములనియు, యుద్ధపరికరముల విజ్ఞానమునభివృద్ధి చేయుటకును, వీరుల ప్రోత్సాహమునకును సహాయకారులగుటచే ఈతోటాలకాల్పులనియు మామతము.

కాదనే కొన్ని పట్టణములలో ఇప్పటికిని ఆరెండు-మూడు-రోజులలో యుద్ధము (లడాయి) తోటాలు మొదలగు సామగ్రితో జరుపబడుచున్నది. దీనివలన భారతప్రజలలో యుద్ధప్రియత, జాతీయత, శౌర్యధైర్యాది సజీవలక్షణములు నశించలేదని వ్యక్తమగుటగాక తోటాలు వస్తువులక్రిందవినియోగించు కొంతద్రవ్యముకూడ సార్థకమేయని గ్రహించుట కవకాశమేర్పడుచున్నవి.

## హోలికుఁడు

టి. జయ్యరుదాసుగారు

పాలనసేయురాజులను భావములన్ వెలిబుచ్చు మంత్రులన్
ఆలమొనర్చుసైన్యముల హాయిజరించెడు కోడెగాండ్ర వే
యేల? సమస్తధాత్రి నివసించెడు ప్రాణులనెల్ల బ్రోచు నీ
హోలికు డెంత పుణ్యుడొకో! ఆరయ భారతదేశమందునన్.

# రాణా ప్రతాపసింహునకుఁ బృథివీరాజు లేఖ

పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు

"రసపుత్త్రవీరులలో రాణాప్రతాపసింహునికన్న మిన్నయగు రాచవాఁడు లేఁడు. అతఁడు మూర్తీభవించిన క్షాత్రతేజము. అన్నము లేక యల్లాడిన నాఁటనైనియు సంధికియ్యకొనని యా మహారాజు ఒకనాఁడు కన్నకూఁతురు సగమురొట్టెతిని మిగిలిన సగము దాఁచుకొనఁగా ఆముక్క వనపిల్లి యెత్తుకొనిపోయెను. బాలిక గోలుగోలున ఏడ్చినది. ఆయేడ్పు ప్రతాపునిఁ గలఁచివైచినది. అక్బరునకు సంధికై లేఖను బుత్తెంచెను. అక్బరునొద్దనున్న రసపుత్రవీరుఁడగు పృథివీరాజు ఆలేఖఁగని ప్రతాపుఁడు సంధికిట్లు వ్రాయుటకు వగచి యక్బరుతో ప్రతాపుడు ఈలేఖ వ్రాయలేదని చెప్పి తానొక లేఖ సంధికియ్యకొనవలదని ప్రతాపునికి వ్రాసెను. ప్రతాపుఁడు సంధిమాని ఎట్లో కష్టములకోర్చి తుదకు తన సామ్రాజ్యమునంతను సంపాదించుకొనెను."

"కటకంగత్తుల పోటుతూఁటులు నిరాఘాటంబులై నెత్తురుల్
పెలుగఁజిమ్మెడువేళ నేని యకటా! వెన్నీని మన్నీనికిన్
వెఱపో, బాధయొ, కూడులేమియొ, యెదో పీడించ లేకుండినన్
మొఱకుండై యొఱఁబెట్టి ఖడ్గము సలామున్ జేయునే సంధికై.

వ్రేలుంగొమ్మల బట్టియుయ్యెలలలో వ్రేలాడి నీపుత్త్రికల్
పాలేలేక శయింప; నై నకుజముల్ పత్త్రాక్షి కోణంబులన్
బాలేయాశ్రుకణంబులొల్కుట ప్రతాపా! నీదు దైన్యస్థితిన్
బోలంగాంచుటగాదు సంధికొఱకై పుత్తెంచుటన్ లేఖలన్.

వండినవంటకంబు తినుపట్టున క్షాత్రవులై తిరాఁగ నా
వండినకూడు పట్టుకొని వారక కాననసీమ యంతటన్
గొంకక వాఁడునున్ సతియుఁ గూడఁ జరించిన నాఁడు నేని లే
కుండిన భీరుభావమిపు డుద్భవమొందఁగ నేమి హేతువో!

డంబుగ 'మానసింహుఁడు' కడంకవనంబునఁ దన్నుఁగాంచఁగా
సంబరమందివచ్చినఁగ సాయికి నాత్మజ నిడ్డహీనుఁ డా
"యంబరు" రాజపుత్త్రుఁడని, యన్నము బంతి నిరాకరింపకే
పంబినకిన్కమై బిరుదుపల్కు ప్రతాపుఁడు మోఁకరిల్లునే?

ఆరినక్షాత్రతేజము నిజాహితమారణకేళిఁ గ్రమ్మఱన్
గౌరికృపాకటాక్షమునఁ గ్రాలఁగఁ జేసెదనంచుఁ గానలన్
జేరియునన్నమున్ దినక చెందక నిద్దుర సంచరించు నా
ధీరుఁ డధీరుఁడై తురక దేశపుఁజేతులనొగ్గి మ్రొక్కునే!

ముందుమ్రోసెడు రణదుంధుభుల్ పిఱుఁదుల మ్రోఁగింప నాజ్ఞ నేభూపుఁడొసఁగ
శత్రుమారణదీక్ష స్వర్ణపాత్రాన్నంబు విడనాడి తినవేఁడు విస్తరులను
హాయము'నక్బరు'లాయమునఁ గట్టెడువాఁక దర్భశయ్యనె వంతు దాశయించెఁ
జిత్తూరి రమతోఁటి స్వేచ్ఛ వెలగెడుదాఁక క్షురకర్మమేనిట్టితోఁటఁగివైచెఁ
గటకవరమాచుఁ జిత్తూరు గ్రాలుదనుక నుదయపురినిల్వననుచు మహోగ్రవిపిన
సీమకుంజనె నేరాచసింగమతఁడు సైజతేజంబువిడిచె నిన్నాళ్లకిపుడు

కాటక మొక్కచక్కఁ; నిరశాటపుఁగొండలలోనఁ బోరు; సం
పాటితమయ్యె మేను, పెనుబల్లెపుపోటులఁ గత్తియేటులన్;
'కైటక'మావిఁబాసెను; బికాపికలాయిరిసైనికోత్తముల్
పోటుప్రతాపుఁడూడెనను వాక్కులఁ జీములు గట్టఁ గర్ణముల్.

చింపిరిచింపిరై ఘటితచేలము కాళ్లులఁజీలుకాడఁగా
న్బొంపిరిపోవునాఁకట ననూనపరాభవహిన్నతప్తుఁడై
తెంపునఁ గత్తిదూసి తెగతెంపుగ 'నక్బరు'ధిక్కరించు నా
తెంపరియే కటా! యిటులఁ దేఁకువమాలుటకల్గె నేఁటికిన్.

కావలుఁడాతతాయి ప్రభుఘాతుకుఁడాతఁడు దుర్మదాంధుఁడై
'దేవరకొండరాజు'భవదీయ చమూజనమంతరింపఁగాఁ
ద్రావుజలంబులన్ విసము తక్కకగల్పిన నాఁటనేనియున్
బోవనిమానసం బెటులఁబోయెనొ సంధికిచేతులొగ్గఁగన్.

ఓహరిసాహరిన్ భటులు యుద్ధముసేచెడు పట్టులందు నీ
సాహసకృత్యముల్ పొగడి సారెకుఁ బౌరుషమిబ్బడింపఁ బ్రో
త్సాహముచేయునట్టి కవిచంద్రుఁడు వైరులచేతఁ గ్రుగ్గినన్
ఓహటిలంగనేరని మహోన్నతచిత్తుఁడు మెత్తగిల్లునే!

'సంత'నుపేరిలున్ దుదకు క్షత్రియకాంతలతోడిపాటుగా
నంతిపురంబునందుఁగల యంగనలెల్లరఁగాంచువేడ్కమై
నెంతలు చేయుచుండినను నీవుగలాఁడవటంచునున్న మా
కింతలువ్రాసెధాత ఇఁక నెందుల కిందుల విందుపొందులున్?

గరడీదేలినరాజపుత్త్రికకెట సంగ్రామాభిసంరంభియై
తురకంజెండిన యోధవీరుఁడకట నీ! దోస్సారమున్ వీడి కూ
తురికై దప్పినగడ్డిరొట్టెకొఱకై దోదూయమానాత్ముఁడై
చిరకాలార్జితక్షాత్రతేజ మకటా! చేసేతలన్ వీడునే?

మాసెన్ మాసె నీ కేమి యున్నదకటా! మార్తాండవంశంబిలన్
గూసెంగూసె నీ కేమియున్నదవిగో కోటన్ శివాకాకముల్
చేసెంజేసె నీ కేమియున్నదరెరే చిత్తూరుగిత్తూరుగా
వాసిన్వీడి 'ప్రతాపరాణా' తురకన్ బ్రార్థించుటన్ సంధికై."

## కోయిలా!

వనవిహారి

పండుటాకులురాల—
పసరుచివురులు మెక్క—
నిండుసంతోషాన
'రండురండ'ని పిలువ
కొండకోనలగూయు కోయిలా!
నీకు
నిండుజోహారులే కోయిలా!

అందమాప్రకృతి నా
నందమాధురి దేల్చి
'సంగీతసంజీవి
స్వనములివిగో'యంచు
కొండకోనలగూయు కోయిలా!
నీకు
నిండుజోహారులే కోయిలా

నల్లన్నిరూపుతో
యుల్లమలరగబాడి
'శ్యామాంగినీబాల
ప్రేమరూపమ'టంచు
కొండకోనలగూయు కోయిలా
నీకు
నిండుజోహారులే కోయిలా.

# రాధప్రార్థన

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి. ఏ; బి. యల్.

ఎచ్చటికిపోయితివి కృష్ణా! నా
ముచ్చటలుతీర్పకే కృష్ణా!
ఇతరగోపికలేల కృష్ణా! నీ
సతిని నేనుండగా కృష్ణా!
ఎంతబ్రతిమాలినా కృష్ణా! నీ
పంతాలుమానవా? కృష్ణా!
రాధప్రార్థించెరా కృష్ణా! యీ
బాధతొలగింపరా కృష్ణా!
దరినీవులేకున్న కృష్ణా! నా
తనువేమిసఫలంబు కృష్ణా!
విహగములకలకల, కృష్ణా! నీ
వేణుగానమెవిందు కృష్ణా!
పాలకడవలలోన కృష్ణా! నీ
లీలలేజూతురా కృష్ణా!
ఆలమందలయందు కృష్ణా! నీ
యాటపాటలెగాంతు కృష్ణా!

నానీడనేజూచి కృష్ణా! నీ
వేనంచుభ్రమియింతు కృష్ణా!
కనులుమూతలుపడిన కృష్ణా! నా
మనసునిద్దురపోదు కృష్ణా!
ఎన్నియుండినగాని కృష్ణా! నీ
వున్నట్లెయుండునా కృష్ణా!
విడనాడిపోయితివె కృష్ణా! నే
పడుబాధతెలియదే కృష్ణా!
వెన్నపూసనుబెడుదు కృష్ణా! నీ
చిన్నిమోమునుజూపు కృష్ణా!
పాలుమీగడలిడుదు కృష్ణా! నీ
వాలుగన్నులజూడు కృష్ణా!
నగలునాసొమ్ములిత్తు కృష్ణా! నీ
నవ్వువెన్నెలజల్లు కృష్ణా!
ప్రాణమర్పింతురా కృష్ణా! న
న్వదలిపోకుము ముద్దుకృష్ణా!

# ప్రాచీనభారతి: నవ్యభారతి

కాశీరాజు రామమోహనశర్మగారు

నాఁడు శ్రావణపూర్ణిమ. మింట శశాంకుఁడు షోడశకళాపూర్ణుఁడై వెలుఁగొందుచుండెను. ఉద్యానవనములో విమలాంబుపరిపూర్ణకాసారతీరమున, విమలచంద్రోపలవేదిపై నాసీనయైయున్నది ప్రాచీనభారతి. ఆమె పవిత్రమూర్తి ముఖమున శోకచిహ్నములు పొడగట్టుటలేదు కాని విషాదసూచనలు కానరావు. మొగము ముడుతలుపడియున్నను కళాహీనముకాదు. మలయసమీరునిసంచలనముతో నామె వదనమున నించుక నెరసినవెంట్రుకలు కదలుచున్నవి. పూర్ణిమాసుధాకరునివదనమునగల శాంతరసము, చల్లదనము నామె కటాక్షములనుండి వెల్లువలై పారుచున్నవి.

ఆమె రత్నగర్భ. మహాపతివ్రతలనదగు అనసూయ, సీత, సావిత్రిమున్నగు మానవతీమతల్లులకు; కార్యధురీణలగు సంయుక్త, ఝాన్సీ లక్ష్మీబాయి మున్నగు పురంధ్రీలలామములకు; మాతృదేశమునకై జీవితము ధారవోసిన శివాజీ, జతీంద్రులవంటి యోధులకు; భగవత్స్వరూపులగు రామకృష్ణునివంటి పురుషోత్తములకు మాతృమూర్తి ఆమెయే! పునీతయై శివుని జటాజూటమలంకరించిన గంగాభవాని ఆమె ముద్దుబిడ్డయే! నేఁడామెయొడిలో నవ్యభారతియున్నది. నవోదితచంద్రబింబముకన్న ప్రకాశవంతముగనున్న దాబాల.

ప్రాచీనభారతికి మఱియొకపేరు ఆర్య. ఆమెహస్తపల్లవములలో నొకవిపంచికలదు. ఆవిపంచి ఆర్యకు ఆబాలసహవాసి. ఆర్య దానితో నెన్నియోమారులు తన వైభవోన్నతిని శ్రావ్యముగపాడినది. ఆ ఆరామములోనే—ఆ సరస్తీరముననే—ఆశిలావేదిపైననే. గంధర్వులు ఆపాటకు సిగ్గిల్లినారు. ఆవైభవమునకు దిక్పాలురు తలలువాల్చినారు.

నవ్యభారతి నవ్వుమొగములో చిన్నిచేతులను పైకెత్తిచూపినది. ఆర్య తలయెత్తిచూచెను. ఆ విమల వినీల వియద్వీథిలో పశ్చిమదిశనొక చిన్నిమబ్బుతునుక కలదు. నెలబాలుని వెన్నెల కాంతులలో ఆనీరదము హృదయాహ్లాదముగనున్నది. కాని ఎల్లరకు నదిముదమొసంగజాలదు. ఒకింతతడవున కానీరదముప్రబలి చంద్రవంకను మ్రింగివైచినది. జగమును తమోవస్త్రమున మాటుచేసి ఉరుములతో పిడుగులతో వర్షించినది. చండమారుతము వీచినది.

ఆర్య అచంచల. ఆకారుమొగిళ్లజీమూతపటలములలో నామెతనూలత శంపాలతవలె మెరసినది. నవ్యభారతితో ప్రాచీనభారతి యేమియోబోధించెను. అపుడు వర్షించినవర్షముకన్న నశ్రుఝరులు స్రవించిన నామెకనులనుండి.

ఆవిపంచిని సవరించి పాడదలచెను ఆర్య. పాప మావీణాతంత్రులు సడలిపోయినవని యెరుంగజాలదు. సర్వశక్తులను వినియోగపరచెను. ఎంతప్రయత్నించినను తంత్రులు పరస్పరముకలియుటలేదు. ముగ్ధయగు నవ్యభారతి అప్రయత్నముగ తంత్రులను సవరించెను. కాని ఆర్యహృదయవీణాతంత్రులపుడే చలించిపోయినవి. చిరస్మరణీయమగు తొల్లిటి తనయౌన్నత్యము నిక పాడజాలదు.

లయసమన్వితమై ఆవీణమ్రోగినది. ఆస్వరము తొల్లిటిస్వరముకాదు. నూతనము. ఆపాటకు నవ్యభారతి సంతసిల్లినది. ప్రాచీనభారతి దీర్ఘనిశ్వాసము విడిచి తలవాల్చినది. మరియెత్తలేదు. ఆభయంకరతిమిరసంహతులలో ప్రబలఝంఝామారుత్తు ఆనిట్టూర్పును మోసికొనిపోయినాఁడు.

# విజయదశమి

శ్రీమతి యు. సత్యబాల సుశీలా దేవి గారు

౧

[సాయంసమయము:—మధురాపురీశ్వరుని భవనంలో చక్కని గది. (ప్రవేశం) రాజు: జయసింహుడు. రాకుమారి: విజయలక్ష్మి - పీఠములయందాసీనులైయుందురు.]

"తల్లీ! నిన్ను సమస్తవిద్యాపరిపూర్ణనుగా వించాను. ఇక నేను సుపుత్రవంతుణ్ణి కావాలి."

"విపులంగాచెప్పండి. బాబా!"

"సమానవిద్యావంతులగు స్త్రీ పురుషులు - సరిసమానులే గదూ?

"సందేహమేమి?"

"బిడ్డా! నాకు పుత్రభాగ్యము లేదుగదా?"

"ఉన్నచో వారిజీవిత మెట్లుండవలెనని మీయూహ?"

"బాహుబలవిద్యాధనమాత్రసహాయులై తమభావిజీవితరంగమునకు సాధన సామగ్రి సమకూర్చుకోవాలి."

"ధన్యను. బాబా! ఒకరాజుకు ఏకపుత్రికనైన నేను నాకర్తవ్యం నెరవేర్చి మీఋణం తీర్చుకుంటాను - ఈ సుముహూర్తాన్నే వెళ్లిపోతాను నాజీవితరంగంలోకి."

"విజయసహితయగు విజయను మళ్లీ చూస్తానా?"

"అది భగవన్నిర్ణీతము గదా!"

"సర్వజ్ఞవగు నీమాటకు ప్రతిచెప్పలేను, బిడ్డా"!

"బాబా! విచారమెందుకు? అసమానము అపారములగు విద్యాబలం నాకనుగ్రహించేరు. ఇంకేం కావాలి? మరిచాను-ఈయాభరణాలన్నీ ఒకటే నాకవుసరం లేదు."

(తీసివేయును).

"విజయా!........."

"కాలమతిక్రమిస్తోంది. ఎందుకు విచారిస్తారు, బాబా! నన్ను పుత్రుడిగాభావించండి. ప్రాప్తముంటే మళ్లీ ప్రపంచరంగంలో కలుసుకుందాం - ఆశీర్వదించండి, బాబా!

(పాదములకు నమస్కరించును.)

"సఫలీకృతమనోరథవై కన్నులపండువగుము. తల్లీ! నేను విజయదశమి. నీ జన్మదినము - నేను నీహృదయమున నాటబడిన ఈ పవిత్రాంకురము - వచ్చేడీ విజయదశమికి ఫలాన్వితమై నిన్ను సార్థకనామగ నొనర్చుగాత!"

"విజయా! అచిరకాలంబు తిరిగిరమ్మ."

౨

[సాయంసమయం - శ్రీనగర రాజోద్యానవనం - ఒకయశోకవృక్షముక్రిందిచలువరాతిపైన రాజు: రామసింహుడు - ప్రధానమంత్రి: అభయసింహుడు కూర్చొనియుందురు.]

"అభయా! శోభాయుక్తమై, సునిర్మలవాయుసంయుతమై, సుందరంగావున్న ఈ వనంలో, యీసాయంవేళ యెంతఆనందంగా ఉందోచూశు!"

"లోకంలోని ఆనందమంతా మూర్తీభవించినట్లున్నది."

"ఒకానొక యానందం నూతనంగావుద్భవించి ప్రేమాంబువులు వర్షించడంవల్ల, చిరవిచారావృతమైన నాహృదయదంకూడా ఈవనంలాగ సంతోషతరంగితమై పోతూన్నది."

"ప్రభూ! ఆ ఉత్కృష్టానందానుభవమీ భృత్యున కనుగ్రహింపవలెనని ప్రార్థిస్తున్నాను."

"చెప్పరానిదేమి? నాకుగలిగిన పుత్రభాగ్యమే కారణము."

"(ఉలికిపడి) ఇదేమి ప్రభూ! ఇదెట్లు సంభవము?"

"నే ననృతవాదినా? అభయా?"

"క్షమించండిప్రభూ! భావగర్భితమైన తమ గంభీరవాక్కులు సేవకునికర్థం కావడంలేదు."

"బిడ్డా! మనపట్టణంలో ప్రస్తుతం చేయబడుతూన్న అలంకారవిశేషాలకి కారణం తెలుసునా?"

"దేవర వానప్రస్థాశ్రమం స్వీకరింపదలచినారు గనుక - తగినవారికి రాజ్యభారం వొప్పగించడానికిగదా - పట్టణం అలంకరించమన్నారు?"

"ఆభారం ఎవ్వరియందుంపబడునో తెలియునా?"

"అవ్విషయ మనేకమారులు తమను ప్రశ్నించియు విఫలమనోరథుణ్ణై కాలంనిరీక్షిస్తున్నాను."

"నాపుత్రుడు నాసమక్షముననుండ నిరీక్షణమెవరికొరకభయా?"

"(రిచ్చపడి) తమసమక్షముననా? ఎవరు? ప్రభూ!"

"నాప్రధానామాత్యుండగు నీయభయసింహకుమారుడు."

"అసంభవము ప్రభూ! అభయుడు తమ భృత్యుడు."

"భృత్యుడు రాజు, రాజు భృత్యుడుగా మారుతూంటారు. అది ప్రపంచనటన - నీవు నాపుత్రుడివి. నాకోర్కెకు వ్యతిరేకించవద్దు."

"క్షమించండి, న్యాయం దట్టియర్హత లేనిచో............"

"అర్హలెన్నటికినిగాదు. నీయందు లోకమంతయు ఏకచ్ఛత్రాధిపతివై పాలింపగల అర్హతాసామర్థ్యములున్నవి. కానిచో కేవలం సైనికుడివిగా నాదగ్గరకువచ్చిన నీవింతస్వల్పకాలంబున నిట్టి యుచ్ఛదశనొందుటకును, నాకుపుత్రవాత్సల్యము గలుగుటకును కారణమేమి? నీ ప్రభుభక్తి నిరుపమానము. నీవిద్యాబల బాహుబలంబు లసమానములు. వేయేల? సుగుణములప్రోవగు నీయట్టి రాకుమారుడు ప్రస్తుతరాజలోకంలో కనబడడు - నాబంధులోకంలో నీకంటెయాప్తులును - నారాజ్యము గ్రహించుటకు నీకంటె అర్హులునులేరు. బిడ్డా! నాపుత్రపదవి స్వీకరింపదగినవారిలో నీవేప్రథముడివి. నాఆశలత్రుంచవద్దు. నీవిందులకొప్పుకొననిచో నాయాత్మకు శాంతిలేదు. అభయా! నేను పుత్రవంతుణ్ణికావడం నీకిష్టంలేదా?."

"తండ్రీ! మరి నే ను మాట్లాడితే మీ మనసు నొచ్చిపోతుంది. ఇంతవరకును మీ యాజ్ఞ జవదాటియెరుగను. నే డున ట్లే యగునుగాక!"

(ఆనందముతో అభయుని కౌగలించుకొని శిరముమూర్కొనును) "ధన్యుణ్ణి! క్షత్రియకులాలంకార! అభయా! నీయట్టి సుగుణమణిని పుత్రుడిగా ననుగ్రహించిన భగవంతుడికి ప్రణామసహస్రములు...... కుమారా! పోవుదమురమ్మా. నిర్ణిమిత్త పట్టాభిషేకప్రయత్నాల్ని గురించి అలజడి

పొందుతూన్న ప్రజలకీశుభవార్త చెప్పాలి."

3

[సాయంసమయం - శ్రీనగరసమీపారణ్యం - ఇరువదిమంది విగతజీవులైపడియున్న సైనికులమధ్య ఇద్దరు రాకుమారులు.]

"తేజోశాలీ! నన్ను మహాపదనుండి కాపాడిన నీవెవరివి?"

"మిత్రమా! నేనుకాపాడు టనగానేమి? అదంతా భగవదనుగ్రహం. మాది శ్రీనగరము. నన్నభయు డందురు."

"రామసింహభూపాలుని వరపుత్రుడివి నీవా? నేడెంతసుదినము! తండ్రికి తగిన కుమారుడివిగాదా? బాలుడవయ్యు నీశౌర్య మసమానము."

"మిత్రమా! తమనామధేయము తెలిసికొనవచ్చునా?"

"పారిజాతనగరపు యువరాజును - నన్నమరుడందురు."

"అయినచో మీ సైనికులెచట? - మీకీయాపదెట్లు వచ్చినది?"

"నేను ప్రకృతిసౌందర్యపిపాసిని. అందుచేత అప్పుడప్పు డీలా ఒంటరిగా యీసుందరారణ్యాల్లో తిరుగుతూంటాను - అసూయాగ్రస్తుడైన పిరికిపందయెవడో రహస్యంగా నన్ను చంపాలని వీళ్లనిపంపి ఉంటాడు."

"సన్మార్గులకు భగవంతుడేతోడు. కాని మిత్రమా! ఎన్నడైన నిట్లొంటరిగవచ్చుట ప్రమాదకరముసుమా!"

"నిజమే - ఇంతటినుండియు జాగ్రత్తగా వుంటాను. (పైకిచూచి) మిత్రమా! సూర్యుడస్తమిస్తున్నాడు. ఇక్కడవుండడం మంచిది గాదు - నీవున్నూ పారిజాతానికివచ్చి నేను చేసే అతిథిసత్కారంపొంది - నన్ను సంతోషపెట్టాలి. నీరుణం నేనీజన్మలో తీర్చుకోలేను."

"నన్ను స్తుతించవద్దని ప్రార్థిస్తాను. సహాయమనేది ప్రతిమానవునికిని, అందునను క్షత్రియునికి ముఖ్యకర్తవ్యము. అందు నాగొప్పతన మేముంది? నారాకననుంచి, నీవున్నూ అంతదూరంలోవున్న పారిజాతానికిప్పుడుపోవడం మంచిదికాదు- కాబట్టిమరోకమాట చెప్పకుండా నావెంట శ్రీనగరానికి వచ్చేసి రేపువెళ్లవచ్చును."

"(ఆలోచించి) సరే, నీయిష్టమే కానిమ్ము. శత్రుభయంతో ఇక్కడ ఇంకా ఉండడం కూడనిపని - త్వరగాపోదము రమ్ము."

4

[శ్రీనగర రాజభవనంలోని ఒక కోణము - రాత్రిసమయం. రామసింహాభయసింహులు - అమరసింహుడు రజితపీఠముపైన ఆసీనులైవుందురు.]

రామసింహుడు

అమరా! సకలవిద్యావిశారదుడవనీ, అసమానబలపరాక్రమసంపన్నుడవనీ, నిరుపమానసౌందర్యరాశివనీ, నీకీర్తి వినడమే గాని నేను ప్రత్యక్షంగా చూడగలిగినాను. సంతోషము. కుమారా! నీవివాహమైనది గదా?

అమరసింహుడు

(సిగ్గుతో) లేదు, కాలేదు.

రామసింహుడు

కారణము—?

అమరసింహుడు

తగినకన్య లేనందున.

రామసింహుడు

నిజమే! నీయట్టి తేజోశాలికి యర్థాంగ

లక్ష్మికాదగిన కన్యను "విధి" ప్రయత్న పూర్వకంగా సృష్టించాలి. చెప్పుము - అమరా? ఎట్టిలక్షణవతికి నీహృదయమున స్థానమొసంగదలచితివి?

అమరసింహుడు

అనన్యసామాన్యసౌందర్యనిధియై, స్వార్జితరాజ్యము ప్రజారంజకముగా పాలించు నదియైన కన్యనేగాని వివాహమాడనని ప్రతిజ్ఞ చేసియుంటిని.

రామ

నీ కోర్కె ప్రశంసనీయమే గాని, కన్య సులభ గాదని దలంచెదను.

అభ

(సాలోచనముగ) అమరా! అట్టికన్యలభించిన తప్పక వివాహమాడెదవుగదా?

అమ

అట్టికన్య గాన్పించవలెనేగాని - సిరిరా మోకాలొడ్డువారుందురా?

అ.భ

ఆయువతి-ఏకారణముచేనైన కొన్నిదినంబులు పురుషవేషంబున రాజకీయోద్యోగిని యైయున్న...

అమ

(అర్థోక్తిలో) అట్టి ఉన్నతాశయరూపిణి నిజముగ కారణాంతరములవల్ల నే రూపమున నున్నను- నీచతప్రాపించుకొనదు- సంశయింప వలసినపనిలేదు.

రామ

(స్మృతినభినయించుచు) మరచితిని-మధురానగరాధిపునికుమారియు నిట్లే స్వాతంత్రాభిలాషిణియై యిలు వెడలి- సంవత్సరమైన దట. పాపము-జయసింహామహారాజు సౌందర్యవతియు, గుణవతియు, విద్యావతియునగు ఏకపుత్రికావియోగంబుసహింపలేక వెదకుకొనుచునచ్చి నేడుమనకతిథిగానున్నాడు. దైవయోగంబున, నాకుమారి అమరుని భార్యయైనచో...

అభ

(ఆత్రముతో) తండ్రీ! యామహాత్ముడెచట నున్నాడు?

రామ

అదిగో! సమయానికే వస్తున్నారు.

—ప్రవేశము: జయసింహుడు.

[అభయుడు "తండ్రీ!" యని జయసింహునిపాదములపై పడిపోవును.]

జయ

(అభయుని లేవనెత్తి ముఖము కేసిచూస్తూ) 'విజయా! నాభాగ్యలక్ష్మి! నీవేనా?' (కౌగలించుకొని శిరముముద్దాడును)

రామ

శ్రీనగరాధిపుడగు అభయుడు!...

విజయ

అవునుతండ్రీ!ఆఅభయుడే ఈవిజయలక్ష్మి. (అమరుని కేసిచూస్తూ లోనికిపోవును.)

రామ

మిత్రమా! ఈపారిజాతనగరాధిపతి మన కల్లుడుకానుండుట యింతకన్న భాగ్యము సుమా!

జయ

సుదినముగదా? అదెట్లు?మిత్రమా!

రామ

ఈకుమారుడు నీతనయంబోలు లక్షణవతిని వివాహమాడుటకు ప్రతిజ్ఞ చేసినాడట.

సీతనయకరగ్రహణముచే ప్రతిజ్ఞ పూర్తవుతుంది. కాదా? అమరా!

అమరు

(తలవంచుకొని) పూజ్యులిట్లువచించుట నాపూర్వపుణ్యంగా భావిస్తూన్నాను.

—(ప్రవేశము: నిజరూపంతో విజయలక్ష్మి.)

విజ

(రామసింహునిపాదములు గ్రహించి) తండ్రీ! పురుషరూపంతో మిమ్ము మోసం చేసేను. క్షమించవలెను.

రామ

(లేవనెత్తి) తల్లీ! మోసముగాదు. నాయెడల భగవంతుడనుగ్రహించినవరము-సుపుత్రుడొసర్పదగినపని పుత్రియొసర్చుట భాగ్యముగదా? బిడ్డా! మునుపటికంటె నాసంతసము శతాధికము.

విజయ

(జయసింహునికరములు నిజకరమున గ్రహించి) బాబా! నాకు "విజయదశమి" నేకు "విజయదశమి." మీయాశీర్వాదము-నామనోరథము సఫలమొనర్చిన భగవంతునికి ప్రణామములు. మీరుకోరిన విట్టి శుభదినములు గాదా? బాబా!

జయ

విజయా! సార్థకనామధేయవగు నీవు పుత్రికవై యుండ శుభములకు కొరతవకునా. బిడ్డా! శుభమయంబులగు నిట్టి 'విజయదశమీ' శతంబులనుగాంచి సుఖంతురుగాక!

రామ

బిడ్డలారా! ఇటురండు - (విజయ, అమరుల కరములనుగ్రహించి) ఈపర్వదినంలో ఏకీభావమందిన మీకరకమలములు చిరకాలమునకును వియోగమునొందకుండునుగాక! మీగుణంబులవలె మీదాంపత్యంబును ఆచంద్రతారార్కము ఆదర్శరూపమై వెలుగొందునుగాక! సకలైశ్వర్యసంపన్నులై "విజయదశమీ"శతంబులు నిరాటంకముగ రాజ్యపాలనమొనర్తురుగాక! (ఇరువురి కరముల నొక్కచోచేర్చును.)

జయ

తథాస్తు! తథాస్తు! తథాస్తు!

# రామచంద్ర ప్రభూ!

శ్రీమతి పి. సీతారామమ్మగారు

శా. నిన్నేరీతిభజింపనిష్టమగునో నేర్వంగరాదయ్య! యా
పన్నున్ నిన్నటులెంచి నీకరుణకున్ పాత్రంబునైదాన
న్నీ కన్నన్ మించిన దీనరక్షణచణున్ గానంగలే నింక నా
కన్నన్ దీననుగాన వేలుకొనువేగన్ రామచంద్రప్రభూ!

శా. ఇక్కల్ వోయిసపుల్లుపోల్కి మనుదారిన్ జేరలేకుంటి నీ
దిక్కేనమ్మితి నింతపై జిలుక నీదివ్యత్కృపావార్థితా
స్రుక్కంబోవునె, జాలమేల, శరణంచున్ వేడుచున్నట్టి నా
యిక్కట్లెడ గరావలంబమిడుమోయీ రామచంద్రప్రభూ!

# ద్రౌపదీవస్త్రాపహరణము

ఒంగోలు పద్మరాజుగారు బి.ఏ.

భారతీయేతిహాసగ్రంథములలో మహాభారత మొకటిగ బరిగణింపబడుచున్నది. ప్రస్తుతము మనకందియుండు గ్రంథమంతయు వేదవ్యాసులు వ్రాసినది కాదనియు చాలభాగము ప్రక్షిప్తమనియు వ్యాఖ్యాతల నేకులు సప్రమాణముగ నిరూపించియున్నారు. అయినను లోకమంతయు దృఢముగ నమ్ముచుండి ధర్మరాజు సయితము బద్ధమాడినటుల లోకోక్తులదాక ప్రాకి వేమన మొదలగు తత్వజ్ఞులు పద్యములుగా రచియించిన సంగతుల భారతమున ప్రక్షిప్తమనియు నిట్టిదన్నదును జరుగలేదనియు జెప్పనుంకించుట సాహసమయినను కొంచెమాలోచించినమీదట దేటబడగలవిషయము లనేకములున్నవి. ఏగ్రంథమునైనను పరీక్షించి చదివినయెడల అందు మనము సాధారణముగ నిజమని నమ్ముచుండెడి సంగతుల కొన్నింటి ననుమానింపవలసి వచ్చుచున్నది.

ద్రౌపదీవస్త్రాపహరణవృత్తాంతము ప్రక్షిప్తమనియు, నిట్టిదన్నదును మహాభారతమున జరుగలేదనియు, నిట్టి యపూర్వమును, అసంభవమును, పరమక్రూరమును అయినట్టి చేత దుశ్శాసనుమూలమున జరిగినదని కథకొంచెము పెంచినయెడల యీవిషయము సుయోధనాదుల మరింతదుశ్చరితులుగ గణింపజేయుటకాధారము గలుగజేయుననుతలంపుతో నిట్టి విషయమును ఇతరులు మహాభారతమునజొప్పించి కొంచెమును గొప్పజేసి యతిశయోక్తులతో నింపియుందురనియు తోచుచున్నది. ఇట్లే ప్రక్షిప్తమైయున్న విషయములనేకములు భారతమున గానవచ్చుచున్నవి.

మహాభారతమందలి పదునెనిమిదిపర్వములకథయంతయు ఆదిపర్వముననే పర్వసంగ్రహాధ్యాయమున వ్రాయబడియున్నది. అందు సభాపర్వభాగమందు ద్రౌపదీవస్త్రాపహరణవిషయ మేమియులేదు. సభాపర్వమునుగురించి పర్వసంగ్రహమందీక్రిందివిధమున వ్రాయబడియున్నది:

“మఱియు ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ, గింకరదర్శనంబును, నారదువలన లోకపాలసభావిభవశ్రవణంబును, రాజసూయమహాధ్వరారంభంబును, జరాసంధవధయును, గిరివ్రజనిరుద్ధులైనరాజులఁ గృష్ణుండు విడిపించుటయును, దిగ్విజయంబును, రాజసూయంబు, నర్ఘ్యాభిహరణంబును, శిశుపాలవధయును, రాజసూయవిభూతికి దుఃఖితుడై సభాస్ఖలితుండైయున్న దుర్యోధనుంజూచి ద్రౌపదీభీమసేనులు నగుటయు, దత్కారణంబున జూదంబాడుటయు, నందు శకునికైతవంబున ధర్మరాజపరాజయంబును, ద్యూతదుఃఖార్ణవమగ్నులైన పాండవులం బాంచాలియుద్ధరించుటయును, బునర్ద్యూతపరాజితులై పాండవులు వనవాసగతులగుటయు, ననువృత్తాంతంబులనొప్పి నాలుగువేలున్ మున్నూట పదునొకొండు శ్లోకంబులుగలిగి,

కం. పర్వ సభాప్రభృతిగ నవపర్వములను విస్తరిల్లి పండితచేతో
నిర్వృత్తిఁజేయుచు రెండవపర్వము నారమ్యమగు సభాపర్వమిలన్.”

మహాభారతమునకు విషయసూచియైన పర్వసంగ్రహాధ్యాయమున వస్త్రాపహరణప్రసక్తియే లేదుగదా! వస్త్రాపహరణవృత్తాంతము మహాభారతమునకంతటికిని చాలముఖ్యమయినవిషయముగ గన్పట్టుచున్నది. అంతటిముఖ్యమయిన విషయమునుగురించి ప్రస్తావమించుకయినను పర్వసంగ్రహమందుండకుండుట మనయనుమానమునకవకాశము గూర్చుచున్నది. వస్త్రాపహరణ విషయము మిథ్యయనియు ప్రక్షిప్తమనియు జెప్పుటకు మొదటి కారణమిదియే.

అనుమానము బలమగుటకింకను యనేక కారణములున్నవి. వనవాసక్లేశమనుభవించుచుండు పాండవుల నోదార్చుటకయి వారిబంధుగు శ్రీకృష్ణుడు వారికడకువచ్చినపుడు ద్రౌపది తనకు సుయోధనాదులవలనజరిగిన యవమానమునంతయుఁ జెప్పినది. పాండవులకు సన్మిత్రుడును తనతో సోదరభావమున మెలగుచుండిన శ్రీకృష్ణునితో ఆమె జరిగినది జరిగినట్లుజెప్పినది. దుర్యోధనునివలన పాండవులకుకలిగిన యపకారపరంపరల నామె యుపన్యసించినది. దుర్యోధనుడు పసితనమునుండియు భీమసేనుని ప్రాణములదీయు నుద్దేశ్యముతో జేసిన దుష్ప్ర

యత్నములకడ ప్రారంభించి ద్యూతమువరకుగల ఘోరకృత్యములన్నిటిని వరుసబెట్టి చెప్పికొనినది. తనను సభలోనికీడ్చిన వృత్తాంతము.—మరియు దుర్యోధనుడు తనను దాసిదానిగగణించిన దుఃఖమును జెప్పికొనినది.

శ్రీకృష్ణుడామెనూరడించుటలో ద్యూతకాలమున సాల్వాదులపై జైత్రయాత్రకై వెడలినట్లును [illegible] మాసములకాలము ప్రవాసముననుండెననియు—ఆమధ్యకాలమునజరిగిన కౌరవదుర్వృత్తముల దానెరుగడనియు మన్ననవేడుకొనియెను. దీనినిబట్టిజూడ వస్త్రాపహరణమందలి కృష్ణచర్య కేవలమున్మిథ్యగనే గన్పట్టుచున్నది.

మరియు ద్రౌపదికి నిజముగా మానహాని గలిగియున్నయెడల అయ్యది ఆమె కత్యంతాప్తులగు వారిసమక్షమునసే జరిగినది. అంతకంటే అధికతరమైన మానహాని దురూహ్యము. ఆమె తనభర్తలయెదుట శ్రీకృష్ణునితో జెప్పినవిధమెట్లనిన తనను సభారంగమునకీడ్చిన కాలమున తనకు నెలసరియై యుండెననియు కట్టుపుట్టంబు ఆర్తవరక్తసిక్తమై యుండెననియు తనకవగుంఠనోత్తరీయమయిన లేకుండెననియు చేటతెల్లముగ జెప్పికొనినది. పెఱవారు వెనవేలుగజూచిన విషయము శ్రీకృష్ణునితో జెప్పుకొనుట వెక్కసమాయెనా?

వస్త్రాపహరణసమయమున శ్రీకృష్ణుని స్తుతించినంతనే యామహాపురుషుని ప్రభావమువలన నాయమకు మానరక్షణజరిగినదని ఇప్పటిభారతమునగలదు. ఇట్టిది నిజముగాజరిగియుండిన ద్రౌపది కృష్ణునియెడ తనకృతజ్ఞతను వెల్లడిజేసికొనదగినతరుణమును వృథాజేసుకొనునా! కవి ఇట్టి యనౌచిత్యప్రసంగమునకు పాల్పడియుండునా? ఈవృత్తాంతము వస్త్రాపహరణము మిథ్యయనియే సూచించుటలేదా.?

వనవాసానంతరము సంధికై సంజయుడు పాండవులయొద్దకువచ్చి ధృతరాష్ట్రునిమాటగా యుధిష్ఠిరునకు ధర్మోపదేశములజేయ మొదలిడెను. తత్సమయంబున శ్రీకృష్ణుడు సంజయుని ధర్మోపన్యాసమును విని సముచితముగ నాతని దిరస్కరించుచు "నీవిప్పుడు రాజగు యుధిష్ఠిరునకు ధర్మోపదేశములగావింప గుతూహలపడుచుంటివి. కాని ఆసమయమున సభామధ్యమున దుశ్శాసనుడు ద్రౌపదియెడల వినరాని యత్యాచారముంగావించినపుడు నీవు వానికెట్టి యుపదేశముగావించితివి?" అనియెను. ద్రౌపదికి గలిగిన పరాభవములంతయు జెప్పెనుగాని యిందుగూడ వస్త్రాపహరణప్రశంసలేదు.

తరువాత కృష్ణుడు రాయబారమునకై బయలుదేరుసమయమున పాండవులందరు కృష్ణునికేమేమో జెప్పిరి. ద్రౌపదికూడ నిట్లనియెను. "ఓజనార్దనా! దురాత్ముడగు దుశ్శాసనుడు నాయీచికురదామము నాకర్షించియున్నాడు. శత్రువులతో సంధిప్రస్తావము గావించుసమయమున నీవీకేశకలాపమును జ్ఞప్తియందుంచుకొనుము—"యనిమాత్రము జెప్పినదిగాని వస్త్రాపహరణమేజరిగిన ఆఘోరమును సయితమేల జ్ఞాపకపరిచియుండదు? శ్రీకృష్ణుని కౌరవులపై కోపోద్రేకునిజేయ తనకుజరిగిన పరాభవమంతయు జెప్పుచుండిన సమయమందు ద్రౌపది మానభంగవిషయము జెప్పకుండునా?

రాయబారకాలమున శ్రీకృష్ణునిబంధింప దురాలోచనల సాగించుచుండిన సుయోధనాదుల, శ్రీకృష్ణభక్తుడగు భీష్ముడనేకవిధంబుల కటూక్తులచే నిందించి యాసభనుండి లేచిపోయెను. ఒకనొకపురుషుని బంధించుటకై జరుగుచుండిన యాలోచననే సహించనంతటి ధర్మజ్ఞుడు తనకు కేవలము మనుమలగు పాండవుల భార్యయొక్క మానభంగమును కనులారజూడ గల్గెనా?

ఇదేవిధముగ ద్రౌపదికి జరిగినయవమానవిషయ మెందువచ్చినను వస్త్రాపహరణప్రసక్తియేగానరాదు. ఇట్టిఘోరకృత్యముజరిగినయెడల యేమానవుడునుసహించజాలడు. పరస్త్రీయెడ యొకపురుషుడు అత్యాచారమాచరించి సభలోనికీడ్చుకొనివచ్చుటయే యసంభవము. అంతియగాక యామె మానభంగముజేయబూనిన వాడెట్టి బలవంతుడయినను లోకము సహించదు. ఎదుటివాడు భీరువయినను తనచేతనయినంతవరకు వారింప సమకట్టును.

ఇత్యాది హేతుసముదాయములవల్ల వస్త్రాపహరణము జరిగియుండదనియు ఈవిషయము మహాభారతమున ప్రక్షిప్తమనియు రూఢిగజెప్పనగును.

# కల్యాణగీతి

శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

౧

ఇది శుభోదయవిజయవాసర
హృద్యబాలప్రత్యూషానిల
భంగ సంభృతదివ్యమోదా
క్రాంతసమయమ్ము.

౨

ప్రథితమోహనయౌవనాగత
బాలికామణివగిది విశ్వ
ప్రకృతినూత్నవిలాససంపద
రాగదృష్టిహసించెడున్.

౩

విజయవాసరమంజుగీతా
ప్రేమయౌవనపరిమళంబులు
దివ్యమోదశ్రీలొసంగుచు
దిరిగిప్రబ్బెడున్.

౪

వాగ్వధూటీభక్తిగేయ
వ్రాతశోభలు తెనుగుభూమిని
విరిసిపోవు సువర్ణయుగసం
వృతమనోహరలీలతో.

౫

చవులగీతికిజీవమొసగెడు
కవికుమారికలేఖినీమణి
నేడు మూగతనంబునూనిన
బాడువడినట్లే.

౬

మేలుకొమ్మోయాంధ్రబాలిక!
మెఱుగుచూపుల బంధుగడునై
సరవివచ్చినప్రాణకాంతుని
సరసిమురియంగన్.

# ప్రేమ శపిస్తుంది!

కుక్క... అల్లారుముద్దుగా పెంచుకున్న నాబాబి! ఏదీ? ఇంట్లోనించి తరిమివేయబడ్డది... దొరకక దొరకక దొరికింది పెంచుకోటాని కా కుక్క. ముద్దుగా 'బాబీ' 'బాబులూ' అని పిలుచుకునేదాన్ని ...అత్తవారింటికది వొందుకని ఇంటనే విడిచి వెళ్ళాను... అప్పుడు బాబియేడ్చింది. క్రూరకర్మను, పెడచెవినిపెట్టి వెళ్ళాను....



ప్రేమభిక్షకై వెళ్ళిననేను తిరస్కృతనైనాను. తండ్రిచేసిన వాగ్దానాలన్ని నెరవేర్చకపోయెనట. అదీ కారణము. తండ్రిచర్య నాకు నయిష్టమేగా. అతని యెడల నేను నలుకజెందితినిగా.......ఏనాడునన్ను అతనికి ధారవోసికొంటినో అనాడే యాతనిదాననై తండ్రికి దూరమైనాను—ఆయనమీద కోపమున 'నావస్తువును నాజీవితమున కానందమును పోద్రోసికొనుచున్నాను' అని తెలియక వెడలనంటినాడు...

ప్రేమ యెచ్చట నిక నాకు. ఆ ..నా బాబు లున్నదిగా ఇంటికిపోగానే నాస్థితిచూసి వాపోయి ఓదార్చి సంతసపెట్టుననుకున్నాను...ఏది? బాబి?— దాని తల్లికి పిచ్చియెత్తిన నదియేమిచేసినది? అది దానితప్పా! అమ్మ దాన్ని తిండిపెట్టక వెళ్ళగొట్టిందిట. అది వాకిలివీడక, ఏమీ తినక, నన్నే—నన్నే, శపించుచూ అర్చిఅర్చి ప్రాణములు వాసిందిట... బాబీ! నువ్వేధన్యవు. ప్రేమలేనియెడ జీవితసమాప్తియే మెరుగని యెరిగినావు. ప్రేమబంధాల్ని తెగగొట్టితే ప్రేమ యెదురుతిరిగి శపిస్తుంది!

శ్రీమతి
గరికిపాటి
లక్ష్మీనరసమ్మగారు

# దసరా ఉత్సవములు

డాక్టరు వి. వి. యస్. ఆరాధ్యగారు యమ్. ఐ. యస్.

ఈపదిరోజులును హిందువులందరును ఆనందమున నోలలాడుచు, గృహములన్నియు పచ్చనితోరణములతోను, పసుపుకుంకుమలతోను, వివిధాలంకారములతోను చక్కగానలంకరించెదరు. వివిధమేళ తాళములతోడను, నృత్యగీతాదులతోడను, బంధుమిత్రుల గూడి దేవతాపూజల సల్పెదరు. పిండివంటలతోను, అనేకపక్వాన్నవిశేషములతోను ప్రియజనమును గూడి సంతసమున విందులారగించెదరు. విద్యార్థిబృందమంతయు తమతమ గురువులతోగూడి చేతగడలు (పతాకలు) విల్లంబులు మొదలగు యుద్ధోపకరణములు స్మృతిచిహ్నముగాధరించి మహోత్సాహముతో గ్రామమునసంచరించుచు క్షేత్రపర్యటన చేయుదురు. మైసూరు మొదలగుసంస్థానములయందు ఈరోజులలో దేవీయుత్సవాదిక మొనర్చుటేగాక మల్లయుద్ధములు, ఖడ్గచాలనములు మొదలగు నానావిధవీరబల ప్రదర్శనములు చేయించి అందు గెల్పొందినవీరులకు పారితోషికములిచ్చుటేగాక విద్యార్థుల ప్రోత్సహించుచున్నారు. ఇట్టివి చూచిన మనఆంధ్రరాష్ట్రమందలి ధనికులు, జమీందారులు కూడ నిట్టి రేవీరుల ప్రోత్సహించ పాటుబడుచున్నారు.

అందును విజయదశమిని విజయోత్సకులందరు మిక్కిలి పవిత్రమైన దివసముగా ఎంచుచున్నారు. ఇప్పటిరాజులు దర్బారులు చేయుటకు ముఖ్యమైన దినముగా ఎంచుటేగాక పూర్వపురాజులు విజయయాత్రకుగూడ సుముహూర్తము గానంగీకరించి పయనించిరి.

మహానవమినాడు సమస్తాయుధముల నొకచో జేర్చి పానలుదీర్చి 'ఆయుధపూజ' యనుపేరుతో నర్చించుచున్నారు.

దశమినాడు సాయంకాలము ఆంధ్రదేశమున దేవినారాధించుకొనుచు తీసుకవెళ్ళి పొలిమేరదాపున శమీవృక్షమునుపూజించి దాని ఆకులన్నియు రాల్చివేయుటేగాక ఒకమేకను గూడపడదెదరు. దీనికే 'పారువేట' యనెదరు.

మహారాష్ట్రాదిదేశముల తమఆయుధముల శుభ్రపరచుకొని గుఱ్ఱములపైనెక్కి గుంపుగా పొలిమేరల దాటివెళ్ళి శమీవృక్షమునుజేరి దానిఆకు రాలగొట్టెదరు. దీనికే 'బంగారుదోపిడి' యని పేరట.

ఇట్లుజరుగుట ఈకాలముననే క్రొత్తగాదు. పూర్వము శ్రీశివాజీమహారాజుకాలముననూ, అనంతరము పీష్వాలకాలమునునుగూడ యీవేడుకలు జరుగుచుండెను.(1)

ఇందుముఖ్యము:— i. అపరాజితా (దేవీ) పూజ ii. సీమోల్లంఘనం (పొలిమేరదాటుట) iii. శమీపూజ (జమ్మిపూజ) iv. దేశాంతర యాత్రా ప్రస్థానం (యుద్ధయాత్ర). అనగా ఇట్టిపూజాదులు చేసి యుద్ధమునకు బయలుదేరువారని యర్థము.

ఇట్టి అపరాజితా పూజాదికము భారతకాలము నుండియు ఉన్నటుల బోధపడుచున్నది. జయా విజయా (పార్శ్వదేవతలు) యుక్తఅపరాజితా పూజ యొనర్చి అజ్ఞాతవాసవ్రతంచెడకుండ పాండవులు పరములపొందిరి. ఇంతియగాక:— దశమినిగూర్చి:—

"శ్లో॥ ఆశ్వయుక్ శుక్లదశమీ విజయాఖ్యాఖిలేనుభా ప్రయాణేతు విశేషేణ కింపునశ్రవణాన్వితా॥"— అని కీర్తింపబడియున్నది.

## నామము

'దసరా' యని ప్రసిద్ధము. అనగా పదిరోజులని యర్థము. దీనికే 'దశరా' యనికూడ యుచ్చరించుట కలదు. ఎటులైనను యర్థమిదియే. కొందరు ఈపదము 'దహరా' యనుపదము నాధారముచేసుకొని కల్పిన నిరియు, 'దశపాపహరా' (పదిమహాపాతకముల హరిం

(1) గృహలక్ష్మి వాల్యూం 3. సంచిక 8. పేజీ 597.

చునది) కావున అపార్థమనియు చెప్పెదరు. ఇక శాక్తేయులన్ననో వారికి తొమ్మిదిరోజులే ప్రధానము. 9 సంఖ్యలన్నిటిలో గొప్పదిగాన, దీనికే 'నవరాత్రు'లందురు. రాత్రిపూజ ప్రధానముగావున, నవరాత్రులే సమాసవశమున నవరాత్రమైనది కాని వేరుకాదు. కావున 'దసరా' యనగా పదిరోజులని యన్వయించుటే సముచితము.

ఈకాలమున కింతటి ప్రాముఖ్యము కల్గుటకును, ఈకార్యములన్నియు ఈకాలముననే ఆచరింపబడుటకును, ఇంతప్రాచీనకాలమునుండియు అవిచ్ఛిన్నముగా నిట్లుజరుగుటకును దేవీభాగవత, వామన, బ్రహ్మాండ, మార్కండేయాదిపురాణములు, ఈకాలమునుగూర్చి, ఈదేవినిగూర్చి, ఈ యుద్ధమును గూర్చి నింతగా కీర్తించుటకును మరుగుపడిన ప్రధానకారణమేమైన యుండవలయునని తోచుట లేదా? అద్దానిగుర్తించుటే మనప్రస్తుతకర్తవ్యము.

దాని క్రిందికథ లోకమున ప్రచారముననున్నది. "పూర్వము మహిషాసురుడను రాక్షసుడు దేవతల పీడించెననియు, అప్పుడు జగన్మాత మహిషాసురునితో యుద్ధముజేసి పాడ్యమి మొదలు సప్తమివరకు వ్యర్థముకాగా అష్టమినాడు దుర్గావతారమెత్తి అతనిని సంహరించెనని నాలుకతో రక్తముపీల్చి అతని అనుచరుడగు రక్తబీజుని ఇతరసేనానాయకులను అందరినివధించి దశమినాడు విజయముజేకొని తిరిగి వచ్చెననియు అందువలనె విజయదశమియని ప్రసిద్ధము.'

కాని యీయుద్ధము ఈపదిరోజులలోనే జరిగెనని యీవిషయమును వివరించిన ఏపురాణమందును స్పష్టముగా వ్రాయబడియుండలేక పోయినను, శ్రీరామనవమి, కృష్ణాష్టములవలె నవరాత్రములను దేవికి లంకవేయబడి ఆంధ్ర, గౌడ, వంగాది దేశముల ప్రసిద్ధముగానున్నది.

పైప్రవాదమెటులున్నను వామన, మార్కండేయ, దేవీభాగవతములయందీరీతి కొంచెమెచ్చుతగ్గులతో నీకథ కన్పించుచున్నది. దానిసారాంశము.

## మహిషాసురజన్మ

"రంభుడు, కరంభులను కూరులగు నిద్దరసురులుండిరి. అపుత్రికులుగాన పంచనదజలముల బహువర్షములు తపమాచరించిరి. ఒకడు జలమధ్యమున, రెండవవాడు పంచాగ్నిమధ్యమున మాలవటాక్షుడను యక్షుని సమక్షమున తపస్సుచేసిరి. అందు జలమధ్యమందలి కరంభుని మొసలిరూపుతో నింద్రుడు సంహరించెను. భ్రాతమరణమున రంభుడు కోపించి ఘోర తపస్సునకై తలకోని యగ్నియందాహుతిజేయ కత్తినెత్తగా అగ్నిప్రత్యక్షమై వారించి 'ఆత్మహత్యపాపము, మృత్యువలగువారి వాంఛలుదీరవు, పేరులుప్తమగును; గాన వరము కోరు'మనెను. 'త్రైలోక్యవిజేతనై, దేవతలచే పరాజితుడుకాని వాయువు దేవునవలె కామరూపుడగు కొమరుని ప్రసాదింపుము' అనికోరెను. 'తథాస్తు' నీవు దేనియందు చిత్తసమర్పణముచేసి ప్రియపూర్వకముగా కలియుదువో దాని గర్భమున నీకట్టి కొమరుడుకల్గును. దానివలననే నీకు దేహత్యాగము ఘటిల్లును." అనిచెప్పెను. అనంతరము రంభుడు మాలవటాక్షుదర్శనమునకేగ అందున్న పద్మనిధియను యక్షునిదాపున ఏనుగులు, మహిషములు మొదలగునవి యుండెను. వీటిని చూచుటచే దానవరాజు చిత్తమున కామవికారముదయించెను. అందున్న మూడువత్సరముల ఈడుగల మహిషి దానవరాజునుచూచి కామాతురురాలయ్యెను. దైత్యుని సమీపమున కరుదెంచెను, మహిషుడుకూడెను. గర్భవతియాయెను. దాని వెంటబెట్టుకొని పాతాళమునకేగెను. బంధువులుత్యజించిరి. మరల యక్షభూమి కరుదెంచెను. మహిషియు వెంటనంటెను. కొలదిదినముల కాశ్యామాంగి పుత్రునికనెను. పుత్రుడు శుభ్రవర్ణుడు, కామరూపుడు. మహిషి మరల కొన్నిరోజులకు ఋతుమతియాయెను. అందుచే మహిషి తనచరిత్రను కాపాడుకొనుటకై దైత్యునిదగ్గరకు పరుగెత్తెను. మహిషము దైత్యునిసంహరించెను. మహిషి యక్షగణమును శరణముజేడెను. మహిషమునుండి వారు రక్షించిరి. ఆమహిషము సరోవరమున దుమికి



శ్రీమతి భమిటిపాటి సింహాచలముగారు

[శ్రీచినయజ్ఞ నారాయణశర్మగారి సతి. వీర వల్లితాలూకాబోర్డుసభ్యురాలుగా నెన్నుకోబడిరి. కవి వంశమున జన్మించిన ఈమె కవికరము సేగ్రహించినది.





శ్రీమతి యశోదాబాయిగారు

రాజమండ్రినివాసులు కళ్యాణసింగుగారి భార్య. విదుషి, వ్యాసకర్త్రి.



శ్రీ మతి రత్నమాల గారు



శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మ గారు



శ్రీ మతి సీరిపి సావిత్రమ్మ గారు

ప్రాణములవిడిచి 'సమరుడ'ను రాక్షసుడై జన్మించెను. మహిషి రంభునితో సహగమనమొనర్చెను. వెంటనే భీషణఖడ్గముతో, ప్రచండాకారముతో ఒకదున్నుద్భవించెను. యక్షులతోలెను. మహిషరుల చంపెను. మహిషాసురుడుమాత్రము చావకదప్పించుకొనెను. అతని పేరు రక్తబీజుడు. దేవతలనందరి నొక్కరొక్కని పరాజితులచేసెను. దానవులు మహిషాసురుని రాజుగా చేసిరి.

### దేవీజననము

దేవతలందరు మహిషాసురునిచే పరాజితులై బ్రహ్మయొద్దకును, వారందరునుకలిసి ఏకాసనులైన విష్ణుశంకరులకడ్డకును జని మొరపెట్టిరి. 'తాము స్వర్గమునుండి తరుమబడితిమనియు సకలదేవతల యధికారస్థానమును మహిషాసురుడాక్రమించెననియు. అందరును కుపితులైరి. అందరిముఖములనుండి గొప్ప తేజము నిర్గతమాయెను. అదియంతయు కాత్యాయనమునియాశ్రమమునమిళితమై గొప్పపర్వతశృంగమువలె ప్రజ్వలింపగా కాత్యాయనుడు తనతేజముచే దానికి పుష్టికలిగించ యందుండి కాత్యాయని యావిర్భవించెను. దేవతలందరి తేజముచే సర్వాంగములుకల్గె. అస్త్రశస్త్రములసమర్పించి స్తోత్రము చేసిరి. తదుపరి ఆమె సింహవాహనయై వింధ్యాచలమునకు పోయెను. ఇట్లుండ మహిషునిదూతలగు చండ, ముండులు, ఈమెనుచూచి మహిషునితో గొప్పసౌందర్యవతియని పొగడగా ససైన్యముగా వింధ్యాటవిని విడిసి దుందుభినిదూతగా చేసి యిట్లుసందేశమంపెను. "నేను అందరిని జయించితిని, నేనేవిభుడను, ప్రభుడను. నీవుపరమోత్తమస్త్రీరత్నమవుగాన నన్ను వరింపుము". ఆమె యిట్లుచెప్పెను: 'మాకులాచారమగుశుల్క మొకటికలదు. అదియుద్ధమునజయించుట. అట్టివారినె మేము చేపట్టెదము. సేనానాయకులతో మహామహిషుడు చంపబడెను. చివరకు మహిషాసురుని వీపునకూర్చుండి కాళ్ళతో మర్దించ చేయునదిలేక స్వరూపమునుగైకొనగానే పొడిచి చంపివేసెను. (మహిషస్వరూపముగానే వర్ణించిరి) (వామన) దితికొరికచేపుట్టి దేవతలజయించెను. (మార్కండేయ) కొన్నివేలదివ్యవర్షములు స్వర్గమునేలెను. (దేవీభాగవతం).

### జాతీయనవరాత్రములు

పైగాథనంతయు పరిశీలించిచూచిన దేవీనవరాత్రములాచరించుటలో కృతజ్ఞతాపూర్వకమగు భక్తియే యిమిడియున్నటుల స్పష్టముగ వెల్లడియగుచున్నది గదా! దావనే ఆర్యులజాతీయాభిమానము, దేశభక్తుల యందలి భక్తిగౌరవము, కృతజ్ఞత, జాతీయత, వీరప్రియత మొదలగు సుగుణములు పూర్తిగాస్పష్టపడును. కావున ఈకాలమును జాతీయనవరాత్రములని చెప్పుటలోకూడ అతిశయోక్తిలేక సముచితమేయగును.

### పురాణములు

ప్రాచీనచరిత్రాంశముల లోకమునవెదజల్లుటలో అమూల్యభండారములు. చారిత్రకదృష్టితో చూచిన అందుండి వలసినంత సత్యచరిత్రము తేలును. కాని మనదసరాకును అట్టిచారిత్రికసత్యమేమైనగలదేమో పరిశీలింతము. దానికిపూర్వము ప్రాచీనార్యులచరిత్రమును వారినాగరికత, వారిస్థితిగతులు, అప్పటిజాతులు, రాజ్యములు, మొదలగు వాటినిగూర్చి తెలుసుకొనుట ఆవశ్యకముగాన తద్విషయజ్ఞానంతరము ప్రకృతమునకు వత్తము.

### ఆర్యులు : వారిస్థితి

ఆర్యులు మొదట ఉత్తరధృవప్రాంతవాసులనియు, అప్పటికే పూర్తినాగరకతగలవారనియు జలప్రళయానంతరం దక్షిణమునకు వచ్చుటకుప్రక్రమించిరనియు కొంతకాలము మధ్యాసియానుండి అందొకశాఖ హిందూదేశము చేరిరనియు వారుప్రథమమున క్రీ. పూ. 6050 సం|| సుమారున ప్రథమమున అడుగిడిరనియు, అప్పటినుండి క్రమముగా అదివరకే దేశమందలి ఆదిమనివాసులను అనార్యజాతులతో యుద్ధములొనర్చుచు, పీడించుచు, అడవులనాశముచేయుచు, సేద్యముచేసుకొనుచు రాజ్యములస్థాపించిరని అనేకమంది ప్రసిద్ధహిందూచరిత్రకారుల సిద్ధాంతముగదా!

కావున తరువాతకూడ కొంతకాలమువరకట్లే అప్పుడప్పుడుభయంకరయుద్ధములకావశ్యకతకల్గుచుండెను. అందు:—ఈ దేవీ మహిషాసురయుద్ధ మొకటి.

### అనార్యజాతులు : భేదములు

అప్పుడీక్రింది అనార్యజాతులు ప్రధానములుగా నుండెను.

(1) మహిష, కపి, నాగ, మృగ, వృక్ష, రాక్షస, వ్రాత్యకీటక, ఆర్జిక, దైత్య, దానవ, మహోవృష, వాల్మీక, మూజవవాదులు.

### మహిషజాతి : మహిషాసురుడు

ఇందు మనమహిషాసురుడు, మహిషజాతిస్త్రీకిని అసురజాతివాడగు రంభునికి గల్గినవాడు. తల్లిని మహిషియనిమాత్రమే పేర్కొనిరి. తల్లి కొన్నిపురాణములలో వర్ణింపబడినటుల కొమ్ములు, తోక, నాల్గు కాళ్లుగల గేదజాతికాదు. అట్లనయిచో నుభయులు నొకరినొకరు ప్రేమించుకొనుట, భోగించుట, బంధువులచే త్యజింపబడుట (క్రొత్తజాతిగాన) శీలరక్షణకై యన్నిపాట్లుపడుట, పతితో సహగమనము. ఇవి యన్నియు సాధ్యమా? అసంభవములని వేరచెప్పవలెనా! నాగరికులగు మానవులసమాజమున జరుగవలసిన ఈకార్యములు చతుష్పాదులగు గేదజాతిలో జరుగుటసంభవముగాదా! సత్యదూరమను వ్రాతయనుటకేమైనసందేహమా! ఇట్టి అసందిగ్ధములగు వ్రాతలుండుటచేతనే పురాణముల మూల్యప్రయోజనమగు చారిత్రకవిశ్వాసమడుగంటిపోయినది. అది గేదజాతికూడ పాతివ్రత్యమునకు విడరానిపాట్లుపడు సత్యకాలమని తలచవలయునేమో! ఒకసామాన్యమైన గేద దూడకా 33 కోట్లదేవతలుఓడిపోయి స్వర్గరాజ్యాభిషేకమొనర్చి త్రాహిత్రాహియని బ్రహ్మాదుల పద్దకరిగి మొరలిడుట! ఇట్టులాలోచించియే కాబోలు కామరూపత్వమంటగట్టిరి.

### మహిషరాజ్యము

ప్రస్తుతమైసూరురాజ్యమునే పూర్వము మహిషమండలమని పేర్కొనిరి. (2) ఇప్పటికిని అక్కడ కొండరాజాతివారున్నారు. (3) మహిష + ఊరు అను రెండుపదములకూడికచే మైసూరుఅగుచున్నది. మహిషశబ్దము కన్నడమున 'మైస' అని మారుటచే కల్గును. ఆప్రదేశమున ఇప్పటికిని ఈక్రిందిగాథయు, తద్బోధకములగు విగ్రహములును కనుపడుచున్నవి. (4) మహిషుడను రక్కసుడొకడుండెను. వానిని చాముండియను యీశ్వరసతి ద్వంద్వయుద్ధమున బరిమార్చి మహిషాసురమర్దనియై పూజలొందుచున్నది.

విగ్రహములలో మహిషాసురుడు దున్నపోతు తలగలవాడుగా ప్రదర్శింపబడుటేగాక దేవికిప్రీతియని లోకజ్ఞానములేని ఛాందసులిప్పటికిని ఏపాపమెరుగని దున్నపోతులబలియిచ్చి పాపముగట్టుకొనుట గర్హ్యము.

### మహిషవిజయము

ఇట్టి మహిషాసురుడు తనపినతండ్రిని చంపుటచేతను, తండ్రికోరికచేతను, ఆర్యులు తనకు సహజశత్రులగుటచేతను, విజయకాంక్షచేతను, దేవతలందరినోడించి స్వర్గరాజ్యమును నిరంతరముగా ననుభవించెను. (5) యుద్ధము పాంచాలమునజరిగెను. దండెత్తివచ్చెను. అప్పటిస్వర్గమదియే.

### దేవీవిజయము

ఇంతలో దేవతలందరును గినిసి కాత్యాయనముని కొమరితయగు కాత్యాయని (దేవి) నాశ్రయించి ఆమె నాయకత్వమున కాయత్తులై వింధ్యాద్రివద్ద నుండగా మహిషుడు ఆమె రూపవతియని ఎరుగుట సంభవించెను. కాన కామాతురుడై వివాహార్థము సందేశమంపెను. కాని ఆమె కోరికప్రకారము యుద్ధము తప్పనిసరికాగా నొడంబడెను. కాని భార్యగా స్వీకరింపదలచిన కన్యనువధించుట కతని కిష్టములేదుగదా! ఐనను ఆమెమాత్రము అదేపరమావధిగాగలది. కాన మహిషునివధించెను. ఇతరసేనానాయకులను రక్తబీజాదులను సంహరించెను.

(1) భారతవర్షేతిహాసం 1st part.

(1) మహావంశమను బౌద్ధగ్రంథము.

(2) భారతవర్షేతిహాసం 1 st vol.

(3) భారతవర్షేతిహాసం 1st part p. 66.

(4) డిల్లీదర్బార్ p. 283. 84.

యుద్ధము వింధ్యాటవిలో జరిగెను. స్వర్గరాజ్యము దేవతలవశమాయెను. ఇట్టి యింకనొకటి రెండు యుద్ధములజేసి శుంభనిశుంభాదిరాక్షసుల గూడ సంహరించెను.

### యుద్ధకాలము

ఇట్టివిషయముల కాలనిర్ణయము కష్టసాధ్యమే. పౌరాణికమతానుసారము మన్వంతరముల నాధారము చేసుకొన్నచో కొంతవరకు కృతార్థులముకావచ్చును. మొత్తము మన్వంతరములు 14 గడచినవి. 6, ఏడవదగు వైవస్వతమన్వంతరముగడచుచున్నది. అందు మొదటిది స్వాయంభువమన్వంతరము. దానిభుక్తకాలము 700 సం॥ (అన్ని మన్వంతరముల భుక్తకాలము సమముగానుండనక్కరలేదు. అందలిరాజుల రాజ్యకాలమునననుసరించి మారుచుండును.) అనగా క్రీ.పూ. 6050-5350 వరకు. ఇప్పుడు గడచుచున్న వైవస్వతమన్వంతరారంభము క్రీ.పూ. 3850 అని నిర్ణయించిరి కావున ఈమధ్యకాలమున 5 మన్వంతరములు గడచినవి. అందు స్వారోచిషమన్వంతరము మొదటిది. దానిలోనే యీయుద్ధముజరిగినది గావున యిప్పటికి సుమారు. 7000 సం॥ పైగా జరిగియుండెనని నిర్ణయించవచ్చును.

---

భారతవర్షేతిహాసం 1 st vol.

### ఆర్యులజాతీయత

ఈకాలమున మనదేశభక్తులయందు గౌరవాతిశయములజూపి పూజించుచున్నటులే మనప్రాచీనార్యులును వారిని అనార్యులబారినుండి కాపాడి, రక్షించి, దాస్యముక్తులజేసిన కాత్యాయనీదేవిని అనేకరీతుల గౌరవించి, పూజించిరి. చరిత్రములలో (పురాణము) స్వర్ణాక్షరములతో రచించి, శిలలమీద శాశ్వతముగా చిత్రించి, వేనోళ్ళబొగడి తమదేశభక్తిని, దేశభక్తులయందలి గౌరవమును ప్రదర్శించి కృతార్థులగుటేగాక 7000 సం॥ నుండి యింతవరకు మరువక కృతజ్ఞతయు ఆదినమును, ఆవిజయమును, ఆదేశసేవనురాలిని అవిచ్ఛిన్నముగా స్మరించి పూజించి పులకితులగుచున్నారు. ఇంతియగాక జగన్మాతపర్యాయముల వారికి దుర్గగాను, పార్వతిగాను, మహాశక్తిగాను చిత్రించుటేగాక, అనేకమహిమలుకల్పించి, ఈశ్వరునిభార్యగాగూడనొనర్చి జగన్మాతృత్వమునుగూడ సమర్పించి ధన్యులైనారు. ఇంతటి భక్తిరసావేశమున తన్మయతజెందినవారు చరిత్రకాంశముల మరుగుపడునట్లొనర్చినందులకు గినియక వారిసంతతియగు మనము వారిదేశభక్తినే గ్రహించుట సముచితము.

## నా విషాదము

పెమ్మరాజు రాజగోపాలము గారు బి. ఏ.

ఈనిశాకాంత నిబిడతమోవిలీన
కృష్ణవసనాంగియగుచు నేడిదె వెలుంగు
నీలగళసీమ ముక్తామణీమనోజ్ఞ
మాలికావారములుదాల్చి; మందహాస
సుందరముకాని యామినీశోభలోన
ప్రళయహాసపుప్రోన్మత్తకలితనాట్య
భయదకళతోచు నేడెందువలనొ కాని?
ఇపుడు నిశ్శబ్ద మిట పక్షియేమిలేదు
అయిన నాయెదకంపిల్లి యతిరయమున
కొట్టుకొనసాగె గడియార మెట్టులటులె
జెప్పజాలనుఅదియేమొ చెప్పలేను.

కాని యీసమస్థానని కదలిపోయి
తారుమారుగకావించు ఘోరమైన
ప్రళయపరివర్తనమువచ్చు వచ్చితీరు
అంతులేనట్టి నావిషాదాంతగీతి
హృదయరక్తాన లిఖయించివినెడువారి
వేడికన్నీరుధారగా పాడుకొనెద,
అదియువిన్ననాడైన మీయెదలుకఱగి
అక్రమవిభాగమునజిక్కి; యఖలభారతీయులార! మీరొండొరు, లినకమనుదు
రేమొ? సకలసోదరరాజ్యధామములర.

# "విశ్వనాథ!"

శ్రీమతి డి. యస్. రాజేశ్వరమ్మ గారు

౧

కష్టనిష్ఠురనిబిడ
బ్రహ్మాండభాండమును
సృజియించినావేల?
విశ్వనాథ!

౨

"సృజియించితి"నని
భరియింపబూనితో
విశ్వరూపముదాల్చి
ఈవిశాలవనిని?

౩

భీతప్రకంపమున
ముకుచుకొనినది
మానసాంబురుహము
నిరాశచేత.

౪

అపహృతధృతినిడు
అభయఖడ్గపుతళుకు వెల్తురు
జ్ఞానభానుని వెలుగొన
వెలుగనీయవో!

౫

కులభేదములల్లిన
వలలో దగులొన్న
అవనికాంతకు బంధ
విమోచనమెపుడో!

౬

నీతిసాగరగర్భరత్నము
సత్యవాక్యస్ఫూర్తికోటకై
కలవుదీర్చెడు జ్ఞానతృష్ణను
తావులీనెడు త్యాగదీక్షను
నాకొసగుమో ప్రభువ!

౭

పూర్వసంప్రదాయ
పాశసంకుల విముక్తికి
సాక్కసాలెదు
పాక్కపాలలెదు
నామనోలత!

౮

ఎన్నడు నసల్పునో
స్వేచ్ఛావిహారము?
ఎన్నడు ప్రసవించునో
నూత్న ప్రసూనాళి?
క్రమసౌరభమొల్కెడు
సంస్కారశ్రేయమును

౯

దుఃఖక్లేశములను
అజ్ఞానతిమిరమును
ఎన్నినాళ్ళిట్లు సేవింతు
విశ్వనాథ!

౧౦

మానసిక స్వేచ్ఛకొఱకె
దోసిలొగ్గితి
జ్ఞానస్వతంత్రమునకె
ఘటించితంజలి
చేర్పుమా!
స్వతంత్రవాసిత
స్వర్గమునకుం

చేర్పుమా.—

## అగ్నిజ్వాలలు

శ్రీమతి హెచ్. కావేరీ బాయిగారు బి.ఏ; యల్.టి.

అమెరికాసంయుక్తరాష్ట్రములందు బానిసలను విడుదలచేయుటకుపూర్వము, ఉత్తరరాష్ట్రములకంటె దక్షిణరాష్ట్రములందు బానిసత్వ మెక్కువగానుండెను. ఎట్టి క్రూరహింసలు, నాగరకులైనతెల్లవారు అనాగరకులైన నీగ్రోలను పెట్టుచుండిరో ఈవిషయము వ్రాయబడిన చరిత్రలుగాని, పుస్తకములుగాని పఠించినయెడల తెలియును. ఈక్రిందికథ వాస్తవముగాజరిగినట్లు, సండేస్కూల్ (Sunday-school) ఒకఆంగ్లభాషా పత్రికయందు కొన్నియేండ్లక్రిందట ప్రచురింపబడియుండెను.

దక్షిణరాష్ట్రములం దొకానొకయజమానుని కొకవృద్ధబానిసవాడుండెను. ఇతర బానిసలవలెనే ఇతడుకూడ కొరడాదెబ్బలకు, నల్లనిదేహచ్ఛాయవలన తిరస్కారమునకును, అనేకవిధములైన హేళనలకును పాత్రుడై యుండెను. అతనికొక్కయాచరణయుండెను. అదే మనగా దైవభక్తి. అయితే దైవారాధన, ప్రార్థనయనునవి జరుగకూడదని యజమానునియాజ్ఞ.

ఒకనాడు పగలంతయు మిక్కిలిశ్రమతోపాటుపడి ప్రొద్దుగ్రుంకువేళకు బానిసవాడు కుటీరముజేరెను. పరిమళగంధముతో మందమారుతము వీచుచుండెను. నీగ్రో తన తలుపును మూసుకొని లోన మోకరించి జపముచేయుచుండెను. హస్తమందు కొరడానుధరించి దొంగవలె కుటీరమునుసమీపించి యజమానుడు మూయబడినద్వారము వెలుపల నిలిచియుండెను.

మిక్కిలిసంకటము తెలుపుధ్వనితో ప్రార్థనచేయుశబ్దము యజమానునికి వినవచ్చెను. హృదయమును నీరుచేయునట్టిరోదనతోను, కంపించుచున్నశరముతోను వృద్ధబానిసవాడిట్లు ప్రార్థించుచుండెను.

"ఓ క్రీస్తుప్రభువా! ఎందులకుదాగియున్నావు? నాకుప్రత్యక్షమై నీప్రభావమును చూపుము. నేను విడుదలకొరకు మొరపెట్టుటలేదు. నాకు విలువగలయుంగీలు అవసరములేదు. కాని యగ్నిజ్వాలలవంటి నీప్రభావము నామీదకురానిమ్ము. నాహృదయమును నీయాత్మతోనింపుము. నీవిచ్చుయీవులన్నిటిలోను మేలైన దిదియే."

బానిసవానియేడ్పు, యజమానునికోపమునురేపెను. అతడు తలుపునుత్రోసి లోనజొచ్చి:

"నీవుదైవమును రమ్మనిపిలిచితివికదా? ఇదిగో దేవుడుకాడుగాని నేనువచ్చియున్నాను. ఇప్పుడు నీదేవుడేమిచేయగలడో చూతము." ఇట్లనుచు ఆయజమాని వడిలి, శుష్కించియున్న ఆవృద్ధునిమోముమీద కొరడాదెబ్బలువేసెను.

"అయ్యా! మనఃపూర్వకముగా మిమ్ములను నేను క్షమించుటకు, దేవుడు నాకు శక్తి నిచ్చుచున్నా"డని నీగ్రోముదుసలి ప్రత్యుత్తర మిచ్చెను.

యజమానునిచేతినుండి కొరడా క్రిందపడెను. నీగ్రోబానిసవానిప్రక్కన తెల్లవాడైన యజమానుడు మోకరించెను. వర్ణములుభేదించినను నీగ్రోవానిని, తెల్లవానిని, బానిసను, అధికారిని కూడ సృజించినభగవంతుడు యతనిప్రభావమును వారిరువురిమీద నగ్నిజ్వాలల తీవ్రముతో పంపెను. నరు లందరిని ఒకకేరక్తముగా దేవుడుసృజించియుండుట వారు గ్రహించిరి.

* * * *

బానిసలకువిడుదలకలిగి దాదాపు డెబ్బదియయిదుసంవత్సరములైనవి. కాని, యునైటెడ్ స్టేట్సుదొరతనపువారు చేయుచట్టములలో నీగ్రోలను, తెల్లవారిని సమరీతిగా చూచుటలేదు. తెల్లవారికున్న హక్కులు నీగ్రోలకులేవు. తెల్లవారున్న స్థలములందుకూడ నీగ్రోలనుండనిచ్చుటలేదు. ఉద్యోగములు సరేసరి. హోటేలులయందుగాని, రైలుప్రయాణమందుగాని, తుదకు పాఠశాలలు, కళాశాలలు, దేవాలయములందుకూడ నీగ్రోలను కుక్కలకంటె అధమముగా ఈనాటికికూడ చూచుచున్నారు.

ఎవరేనేరముచేసినను నీగ్రోలమీదనే నిందమోపుచున్నారు. న్యాయపీఠమువద్ద విచారణజరుగుటకుముందే తెల్లసమూహములు నేరముమోపబడినవానిమీదపడి చావగొట్టుచున్నారు. కాక, న్యాయముతీర్చువరకు కొట్లలోనుంచినను, తలుపుబద్దలుచేసి నీగ్రోనుల వెలుపలికీడ్చి చంపుచున్నారు.

మరియు నీగ్రోలు కుట్రలుచేయునట్లు వదంతిపుట్టించి, వారునివసించుపేటలమీదకు వెళ్ళి, ఇండ్లను తగలబెట్టి, దోపిడిచేసి నానావిధములుగా హింసలుపెట్టుచున్నారు. ప్రాణరక్షణార్థము నీగ్రోలు ఏప్రయత్నములుచేసినను, తెల్లవారిమీద తిరుగుబాటుచేయుచున్నారని, వారిని యడవిజంతువులవలె వేటాడి హత్యచేయుచున్నారు. ప్రపంచమున ఇతరులవలన, స్వేచ్ఛయు, హక్కులను కోల్పోయినప్రజలకును, దేశములకును, సహాయకారియనిబయలుదేరి, యితరదొరతనములకు మధ్యవర్తియని కీర్తిబడసిన సంయుక్తరాష్ట్రములలోనే ఇట్టి అన్యాయముజరుగుచుండగా, వేరేప్రభుత్వములనుగూర్చి చెప్పవలసినదేమున్నది?

## ఏమో?

శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు

ముద్దుగారెడి పాలబుగ్గచిరునవ్వుల
నిగ్గులు లేతవెన్నెలలుగాచు
కళలీనుకాటుకకంటదొల్కెడి చూపు
లెల్లదిక్కులకాంతి వెల్లిగొలుప
చిన్నారిపొన్నారి చిరుపాదమ్ముల
గజ్జలందియలు ఘల్లుఘల్లురనగ
ఒడలెల్ల లావణ్యమొలకపోవగ పోత
వోసినబంగారుబొమ్మవోలె
దనరు చిట్టిచెల్లాయి నిన్ దలచియేము
ఎన్ని ఉపవాసముల నొనరించినామొ?
ఎంతమంది దేవుళ్ళ పూజించినామొ?
ఎన్ని తీర్థంబులేగి సేవించినామొ?
తొంటిపుట్టక.—ఇప్పుడుకంటిమమ్మ

# పెద్దయింటిపిల్ల

శ్రీమతి దేవులపల్లి జగదాంబగారు

౧

దేవీమాధవసింహు గౌరీపూర్ గ్రామములో ఒకయినాందారు. ఆయనకు శ్రీకంఠుడు, బిహారీలాల్ అను యిద్దరుకుమారులు. శ్రీకంఠుడు యేలాగో శ్రమపడి బి. ఏ. డిగ్రీసంపాదించెను. ఈ చదువుక్రింద భూములు చాలామట్టుకు ఋణములపాలాయెను. రెండవవాడు సామాన్యముగా చదువుకొని తండ్రికి సహాయముగా వుంటూవుండెను. పెద్దకుమారుడు ఇలహాబాదుకోర్టులో యేభైరూపాయిలజీతముపై గుమస్తాగా పనిచేయుచుండెను. ప్రతిఆదివారం శెలవులకు తమవూరువచ్చి పట్నములోనిభోగట్టాలు చెప్పుతూవుండేవాడు. అందువల్ల గ్రామములోని చిన్నపెద్దలందరూ వస్తూవుండేవారు. ఈయన "రామలీల" వగైరా వుత్సవములు చేస్తూవుండేవాడు. కుటుంబములలో కలహములుకూడదని, అందరూకలశివుండవలెనని యీయన వుపన్యాసములు యిస్తూవుండేవాడు. ఈతనిభార్యపేరు ఆనంది. ఆమెతల్లిదండ్రులు చాలభాగ్యవంతులు. ఆమెకు యేడుగురు అక్కచెల్లెండ్రు. ఆమెతండ్రి మొదటిముగ్గురకు ముప్పైవేలకుమీదుగా ఖర్చుచేసి కట్నములిచ్చి సంబంధములుచేసి చాలాఅప్పులపాలాయెను. ఆకారణమున ఆనందికి సామాన్యసంబంధము, శ్రీకంఠుని మర్యాద, సుశీలతకు సంతోషించి చేసివైచెను. క్రొత్తగాఅత్తవారింటికి వచ్చినప్పటికి ఆమె పుట్టినింటిగొప్పతనము మరిచిపోయి సామాన్యగృహస్థునిపిల్లవలె మసలుచుండెను. శ్రీకంఠుడు తాను ఇలహాబాదులో పనిచేస్తూ భార్యను స్వగృహమందు విడచిపెట్టెను.

౨

ఒకనాడు ఆమెమరది బిహారీలాల్ రెండుపక్షులనువేటాడితెచ్చి వాటినిబాగావండమనిచెప్పెను. ఆనంది యింట్లోచూడగా నేతిపాత్రలో రమారమిపావుకంటె తక్కువగా నేయియుండెను. ఆనెయ్యి యావత్తూపోశి ఆమె కూరవండివేసెను. బిహారీలాల్ మధ్యాహ్నము భోజనమునకువచ్చెను. ఆమె పప్పుకూర వడ్డించెను. ఆయన పప్పుకలుపుకొని నేతికొరకుఅడిగెను. ఆమె యింటిలో నేయిలేదనెను.

బి—మొన్ననే పావునెయ్యితెచ్చితినిగదా?

ఆ—ఈరోజు కూరతో సరిపోయినది.

బి—తమపుట్టింటివద్ద యీనేతి దర్జాచూపించండి.

స్త్రీకి—తనపుట్టినింటిసంగతి చెప్పగానే యెటువంటి శాంతాత్మురాలికైన కోపమువచ్చును. అంతటితో ఆనంది పెద్దపులివలె ఉగ్రముగా "యేనుగుచచ్చినానెయ్యి బ్రతికినానెయ్యి, మావాళ్లయింట్లో యీపాటినెయ్యి రోజూ నౌఖర్లు తినుకుపోతారు"అనెను.

పైజబాబు బిహారీలాల్ వళ్లుమండచేసినది. ఈయన తనభార్యపై యేమాత్రము కోపమువచ్చినా చెయ్యికలుగుజేసుకొంటాడు. ఆరీతిగా తనప్రక్కనువున్న పావుకోడు వదినగారిపై విసరెను. ఆమెచేతితో ఆపుకొనగా చిటికెనవ్రేలుకు గట్టిగా దెబ్బతగిలెను. అంతట యేడుస్తూ ఆమెతనగదిలోనికి వెళ్ళిపోయెను. తనభర్త వూళ్లోలేనందున తనపైయిట్టిదౌర్జన్యము జరిగినదికదా అనివలపోయుచుండెను.

౩

గురువారమునాడు పైసంగతిజరిగెను. శనివారముగదా భర్తవచ్చునని యెదురుచూచుచుండెను. రెండురోజులు ఆహారపానాదులు విడిచిపెట్టెను. మామూలుగా శ్రీకంఠుడు శనివారముసాయంకాలము యింటికి వచ్చెను. వీధిలో అరుగుపై ఆయనకూర్చుండేసరికి నలుగురు పోగై పట్నములోని ముచ్చటలు దేశములో రాజ

కీయ పరిస్థితులు మొదలగునవి ప్రశ్నించుచూ రాత్రి 8-ఘంటలు గడచిపోయెను. చివరకు వారినందరిని పంపి వేసి భోజనమునకులేచెను. భోజనములసమయములో అన్నదమ్ములు యీవిధముగా సంభాషించుకొనిరి.

బిహారీలాల్:—అన్నయ్యా! వదినగారితో కొంచము నోరుసవరించుకొని మాట్లాడమని తెలవియ్యండి. నోటికివచ్చినట్లుమాట్లాడవద్దనండి. లేనియడల ఒకరోజు చిక్కు సంభవిస్తుంది.

ఆమాటపై వేణీమాధవసింహు అందుకొని "ఆడవాళ్లుభయభక్తులులేకుండా మగవాడితో సమముగా నోరుకలుగచేసుకొనుట మర్యాదగా" దనెను. అంతట శ్రీకంఠుడు జరిగినసంగతి యేమిటో చెప్పమనెను.

బిహారీలాల్:—ఏమిలేదు. ఎందుకో తనంతట తానే పుట్టినింటి భాగ్యముచూచుకొని మమ్ములను గడ్డిగవ్వకంటె చులకనగా చూచుచున్నది.

భోజనములు అయినవెనుక శ్రీకంఠుడు తనగదిలోనికిపోయెను. ఆనంది కోపముతో మాటలాడక చూచుచుండెను. శ్రీకంఠుడుకూడ కోపముతోనుండెను.

ఆనంది:—మనస్సు సంతోషముగానున్నదా!

శ్రీకంఠుడు:—చాలా సంతోషముగానున్నదిగాని నీవేమిటి యీ యింట్లో వుపద్రవములుచేస్తూ యున్నావు?

అంతటితో ఆనంది మిక్కిలికోపముతో, "ఎవరైతే తమతో యీ అగ్గిముట్టించేరో, వారు నాముందరకువస్తే తగినబుద్ధి చెప్పుదును." అనెను.

శ్రీకంఠుడు:—ఎందుకు అంత గరమ్అయిపోతావు? సంగతేదో ముందుచెప్పు.

ఆనంది:—ఏమనిచెప్పను! యిదిఅంతా నాదురదృష్టము. లేనియడల మూర్ఖుడు, బట్రోతుపనికికూడా తగనిగుంటడు నన్ను పావుకోడుతో కొట్టుటా!

శ్రీకంఠుడు:—జరిగిన సంగతి పూర్తిగాచెప్పు. మధ్యమాటలుచేసితే నాకేమీ బోధపడలేదు.

ఆనంది:—మొన్నను తమముద్దుతమ్ముడు నన్ను మాంసము వండమనితెలవిచ్చెను. కుండలోపావుకంటె అధికముగా నెయ్యిలేదు. అదివేసి నేనుకూరవండితిని. పంతులుగారు భోజనమునకు దయచేసి పప్పులో నేయి అడిగెను. ఇంట్లోలేదని చెప్పితిని. దానితో నాపుట్టినింటి మంచిచెడ్డలుయెంచెను. నేను సహించలేకపోతిని. మావాళ్లయింటిలో నౌఖర్లు చాకర్లు యీపాటినెయ్యి రోజూపట్టుకుపోతారుఅంటిని. అంతటితో ఆయనకు దురాగ్రహమువచ్చి తనప్రక్కనవున్న పావుకోడు నాపై విసరెను. పుణ్యముబాగుండబట్టి చేతితో అడ్డుకుంటె వేలువిరగడముతో కుదిరినది. లేనియడల తలపగులవలసినదే."- అని పెనిమిటివడిలో తలపెట్టియేడ్వసాగెను.

శ్రీకంఠుడు:—వాడికి యింతసాహసమా?-ఆనంది దుఃఖముచూచి ఆయనమనస్సు కరిగిపోయెను. విచారముచే రాత్రిసరిగా నిద్రపట్టలేదు. ప్రాతఃకాలముననేలేచి తండ్రివద్దకువెళ్లి "నాన్నగారు! ఇకను యీయింట్లో కలసివుండడము కుదరదు" అనెను.

ఇట్టినిష్ఠురములుకూడదని శ్రీకంఠుడు అనేకసారులు తనస్నేహితులను మందలించేవాడు. కాని కాలవశమున తననోటితో పలుకవలసివచ్చినది. ఇతరులకు నీతులు తెలుపుట బహుసుళువు.

వేణీమాధవు:—ఎందుచేత?

శ్రీకంఠుడు:—నాకుకూడ ప్రతిష్టమర్యాదలు కావలెను. తమయింటిలో అన్యాయము ధూర్తతనము హెచ్చుగానున్నది. పెద్దవాడినగు నన్ను మర్యాదగాచూచుటకుబదులుగా నానెత్తిరెక్కుచున్నాడు. నేను పైవూరిలో నౌఖరీచేస్తూయున్నాను. నేను యింటలేనప్పుడు నాభార్యపై పావుకోళ్లుచెప్పులు యెగురుతాయి. ఒకవేళ ఆమెవల్ల తప్పున్నయడల నేవచ్చేవరకువోర్చి నాతో చెప్పవలెను. కాని యింట్లోధూర్తతనము ఆమెపైచేయుటకన్న నాకు అపకారము వేరులేదు. ఇదిమనస్ఫూర్తిగా సంహించలేను.

వేణీమాధవసింహు యేమియుమాటాడలేక వూరుకొనెను. శ్రీకంఠుడు తనతండ్రిగారిని చాలాగౌరవిస్తూయుండేవాడు. కుమారుని యీనిష్ఠురోక్తులుచూచి తండ్రి కొంతతడవువూరుకొని చివరకు "నాయనా!

# విశ్రాంతి

వేంకట కాళిదాసకవులు

౧

ఆ శిథిలాలయమ్మె యమృతాలయ మంచుఁదలంచి క్రొత్తలై
యాశలు తీవలల్లు మదినల్లఁగ ద్వారమునొద్దఁ బ్రేమభి
క్షాశరణార్థినై నిలువఁగల్గితి నొక్కదృఢానురాగరే
ఖాశుభమూర్తి వీక్షణవికాసములన్ ననునాదరింపఁగన్.

౨

ఆ సుమనోమనోహరవయస్విని నిల్చిన యాశుభోదయా
వాసము నాశ్రయించి యనివారితజీవితయాత్రయందు నా
యాసమువోవ విశ్రమము నందితి నొక్కముహూర్త మామె వీ
క్షాసుధలన్ మధువ్రతముచందమునన్ మనసారఁద్రావుచున్.

౩

ఆ యమృతాంశుబింబముఖి హాసకళారుచులందు లీనమై
పోయితి నాకృపాసరసి పుణ్యకటాక్షవిలంబివీక్షణ
చ్ఛాయల మెల్లగానొదిగి శాంతిజనింపఁగస్వప్న కేళికా
ప్రాయసుఖోదయంబునఁ గరంబువహించితిఁ బారవశ్యమున్.

౪

ఆ నవయౌవనాంగి కరుణైకమనస్వినిగాన జీవయా
త్రానుగతశ్రమాకులుఁడనై యరుదెంచిన నన్ను వీక్షణ
శ్రీనిచయంబులన్ బలుకరింపుచు హాససుధాతిథేయస
న్మానముఁగూర్పఁగా మరచినాఁడ క్షణమ్మునయందు సర్వమున్.

# పూర్వస్మృతి

కుర్రా వేంకటసుబ్బారావు చౌదరిగారు

౧

సిద్ధహస్తుండగు శిల్పినిర్మించిన గోపురంబులు నేల గూలిపోయె
బౌద్ధసన్న్యాసులు పరిపూర్ణభావంబు పాశ్చాత్యదేశంబు పాఱిపోయె
నింగిముట్టినకీర్తి నెలఁత ఫెల్లునవార్చి కాలగర్భంబునఁ గలసిపోయె
తెలుఁగువీరుల కత్తిఁ దెగినరక్తము కృష్ణవేణిగర్భంబులో విరిగిపోయె
వితరణాపరభోజుఁడై వినుతిగన్న
వేంకటాద్రిమహీనేత విభవమెల్ల
శిథిలమైయున్న కోటల జీర్ణమయ్యె
దీనమైపోయె నమరావతీపురంబు.

౨

వాణిజ్యమునకు నివాసమౌభూములఁ బల్లేరుకాయలు పండుచుండె
రాజాధిరాజుల రమ్యహర్మ్యంబులు మంటిదిబ్బలలోన మాయమయ్యె
ప్రమథనాథునిశోభరితమందిరకోటి గబ్బిలంబుల వెంట గ్రమ్మియుండె
శిల్పనైపుణ్యంబు చెన్నారు చిత్రంపుఁ బ్రతిమలన్నియు ఖండగతివహించె
అతులితంబగు సౌఖ్యంబు లందినట్టి
యాంధ్రరాజ్యేందిరారామయు స్తమించె
వేడికన్నీట నాంధ్రుఁడా! చూడవోయి
దీనమైయున్న యమరావతీపురంబు.

3

చేతు లల్లనసాచి పూతచరిత్రులౌ వీరయోధులనుదీవించునాఁడు
రమ్యమహాగ్రహారములనుప్పొంగుచుఁ బుడమివేలుపులకునిడెడునాఁడు
కవికోకిలంబుల గానామృతముఁ గ్రోలి హర్షాబ్ధిలోఁ దేలియాడునాఁడు
జీర్ణదేవాలయశిఖరంబుపై నూత్నకళలనాపాదింపఁ గడఁగునాఁడు
అసదృశాంబరచుంబిసౌధాంతరముల
హాయిగా సౌఖ్యవార్ధి నుయ్యాలలూఁగు
కాలముగతించె దౌర్భాగ్యకళవహించె
తేజము నశించె నమరావతీపురంబు.

నీవు చాలాబుద్ధిమంతుడవు. అయి యిట్టిపలుకులు పలుకకూడదు. ఆడవాళ్ళు యీలాగే కుటుంబములు విడదీస్తారు. వాళ్ళను తలయెక్కించుకోనగూడదు" అనెను.

శ్రీకంఠుడు:—ఈపాటు నాకూ తెలుసును. మూర్ఖుడను గాను. తమకు స్వయముగా తెలుసును నేనెన్ని కుటుంబముల కలహములువిడదీసి రాజీచర్చేవాడనో! గాని యేస్త్రీమానమర్యాదలకు, సర్వసాక్షియగు ఈశ్వరునియెదుట జవాబుదారునైయున్నానో ఆట్టి స్త్రీయెడ యీ అన్యాయము సహించలేను. నామట్టుకు యీపరాధవము తక్కువగాదు. తమ్ముడును తమరు యేమీదండించలేదు.

మరి యేజవాబు యివ్వలేదు బేనీమాధవసింహు. "లాల్ బిహారీ నీ తమ్ముడుకాడా! వాడివల్లతప్పువున్న వాడిని రెండుకూకలువెయ్యి"అనెను. అంతేగాని—

శ్రీకంఠుడు:—లాల్ బిహారిని యికను నాతమ్ముడు గాతలచను.

బేనీమాధవ:—భార్యను వెనుక వేసుకోనా!

శ్రీకంఠుడు:—చిత్తం! అదికాదండి. వాడిక్రూరత మూర్ఖత కారణం. తండ్రికొడుకులు కొంతసేపు పూరుకొనిరి. తండ్రిగారు యేలాగునైనా కుమారుని శాంతిపర్చవలెనని చూచుచుండిరి గాని చిన్నకొడుకువలన తప్పనిమాత్రము అనరు. చివరకు ఆలోచించి "నాయనా! నీకు యేలాగుయిష్టమో ఆలాగు చేయుము"అనెను. అనుభవములేనికారణమున గ్రాడ్యుయేట్ అయిననూ శ్రీకంఠుడు యీసంగతిలో తనుయెట్లువర్తించవలెనో తెలుసుకొనుట కష్టముగాయుండెను. తండ్రియేవుద్దేశముతో యిట్లుపలికెనో తెలుసుకొనలేకపోయెను. "లాల్ బిహారీతో కలసి యీయింట్లో నేను వుండలేను"అనెను.

బేనీమాధవుడు:—అబ్బాయీ! బుద్ధిమంతులు మూర్ఖులచర్యలపై పట్టుదలచూపరు.

శ్రీకంఠుడు:—అయివుండవచ్చును. ప్రస్తుతహంశములో నామనస్సు యేమియుసహించలేకయున్నది. ఈ యింట్లో వాడైనాయుండవలెను లేదా నేనైనావుండవలెను. మీకు వానియందు అధికానురాగమువున్న యెడల నాకు శలవుదయచేయుడు. నా సంసారముపట్టుకొని యెచ్చటికో లేచిపోతాను. నాసంసారము నేను జరుపుకోగలను. నాయందు ప్రేమవున్నదా వాడినివెంటనే వేరొకచోటికి పంపివేయుడు. రెండింటిలో యేదో వకటి జరిగితీరవలెను.

తండ్రిగారికి అన్నగారికి జరుగుచున్న సంభాషణ బిహారీలాల్ తలుపుచాటునుండివినుచుండెను. ఈయనకుకూడా అన్నగారంటే చాలాగౌరవముగావుండేది. ఆయనయెదురుగా మంచముపై కూర్చొనుట గాని, హుక్కాత్రాగుటగాని, తాంబూలమువేసుకొనుటగాని జరిగించేవాడు కాడు. తమ్మునియందు అన్నగారికికూడా అధికానురాగమువుండేది. తాను ఇలహాబాదునుండి వచ్చేటప్పుడల్లా మంచిబట్టలు, బనియన్లు, ఆటవస్తువులు తెచ్చేవాడు. నాగపంచమినాడు జరిగినకుస్తీలలో తమ్ముడుగెలిచెనని సంతోషించి మెడలో "మహాబీర్"పతకము వేయించి అయిదురూపాయిలు డబ్బులు బీదలకుపంచిపెట్టించెను. అట్టిఅన్నగారినోట పైపలుకులువిని యీతనిహృదయమున క్షోభ మొదలుపెట్టెను. గాని అన్నగారు పూరునుండివచ్చినతర్వాత కథయింతముదురుతుందనితలంచలేదు. అన్నగారు తనపట్ల అన్యాయము చేయుచున్నారని అనుకొనెను. తనను ఏకాంతమునపిలచి చీవాట్లుపెట్టినను ఇంత విచారమువుండదు. కాని అన్నగారు తనువున్నచోట వుండనని చెప్పుట ఘోరపరాధవముగా తలంచెను. అచ్చటనుండి వదినగారిగదివద్దకువెళ్లి 'వదినా! మాఅన్నగారు యీయింట్లో నేనుండిన తనుయిచ్చటనుండనని ఖచితముగా మాతండ్రిగారితో చెప్పిరి. ఇకను నాపాడుమొఖము చూడనని ఒట్టుపెట్టుకొన్నారు. నేనుకూడా ఈ పాపపుముఖము చూపుటకు యిష్టపడను. నేను వెళ్లిపోవుచున్నాను. నా అపరాధములు క్షమించి నన్ను మన్నింపుడు' అని వెక్కివెక్కియేడువసాగెను.

౪

ఆనందిని లాల్ బిహారీ పై ప్రకారం వేడుచుండగా శ్రీకంఠుడు వీథిలోనుండి యింటిలోనికిపోవుచూ తమ్ముని వైపు చూడకుండా ముఖము త్రిప్పుకొనెను. ఆనంది మొదట లాలావిషయమై పెనిమిటితో చెప్పినప్పటికీ వానిపశ్చాత్తాపము చూచి జాలినొందెను. ఆమెయు చాలాపశ్చాత్తాపపడెను. ఇంతవరకూ కథమించునని తలంచలేదు. ఒకవేళ పెనిమిటి యాకోపముపై తన్ను ఇలహాబాదు తీసుకొని పోవునేమో, అత్తవారియిల్లువిడచి పైస్థలములో యేలాగువుండుటయని భయపడెను. వీరిద్దరి కన్నీళ్లతో వారిహృదయములు కడిగివేయబడెను. మనస్సును శుభ్రపరచుటకు కన్నీటికంటె మందు లేదు.

ఆనంది:—లాల్ బిహారీ పైననిల్చుని యేడ్చుచున్నాడండీ!

శ్రీకంఠుడు:—నేనేమి చేసేది?

ఆనంది:—లోపలికి పిలవండి, చాలాసిగ్గుపడుచున్నాడు.

శ్రీకంఠుడు:—నేపిలువను.

ఆనంది:—తరువాత చాలావిచారిస్తారు సుమండీ. మనస్సున చాలాకలతనొందుచున్నాడు. ఈపాటుగా ఎటుపోయినా మరిదొరకడు.

శ్రీకంఠుడు లేవలేదు. చూస్తూవూరకొనెను. లాల్ బిహారీ తిరిగి వదినగారితో "వదినా! అన్నగారికి నానమస్కారములు చెప్పుడు. వారు నా పాపపుముఖము చూచుటకుయిష్టపడరు. నాముఖముచూపుటకు నాకు సాహసముచాలకున్నది. నేవెళ్లిపోవుచున్నాను." అని శీఘ్రముగా వీథిలోనికి అడుగులువేయ మొదలిడెను. అంతట సమయముమించినదని, ఆనంది తనగదిలోనుండి వడిగాబయటికివచ్చి లాలా చేయిపట్టుకొనెను. కన్నీళ్లతో లాలా "నన్ను పోనిమ్మ"ని వేడుకొనెను.

ఆనంది:—ఎక్కడికి పోతావు?

లాలా:—నాముఖము యెవరికీకనపడనిస్థలమునకు.

ఆనంది:—నిన్ను విడచిపెట్టను.

లాలా:—నేను మీతో కలసియుండుటకు యోగ్యుడను కాను.

ఆనంది:—నీవు నా బిడ్డవంటివాడవు. మరిముందు అడుగుపెట్టవద్దు.

లాలా:—మాఅన్నగారిమనస్సు నాయందు దయతలచేవరకూ యీయింట్లో నేనువుండను.

ఆనంది:—ఈశ్వరసాక్షిగా చెప్పుచున్నాను. నీయందు నాకు అణువంతయు కోపము లేదు.

ఈసంగతి అంతయు చూచి శ్రీకంఠుని హృదయము కరగెను. వెంటనే గదిలోనుండి పైకివచ్చి లాలాను కౌగలించుకొనెను. ఇద్దరు సోదరులు వెక్కి వెక్కి యేడ్చిరి. లాలా "అన్నయ్యా! మీరు నాముఖముచూడనన్నారు. ఇంతకంటె నాకు చావుమేలు. అట్టిచావునుండి రక్షించినది శ్రీమావదినగారు. ఆమెరుణము యీజన్మతో తీర్చలేను. నాకు మళ్లీ మీసోదరప్రేమకు దారిచూపినది. బుద్ధివచ్చినది. ఇట్టిపని యెప్పుడూ చేయను. నాకు ఇట్టిశిక్ష యెప్పుడూ చేయకండి" అనెను.

శ్రీకంఠుడు:—లాలా! గతించినది మరిచిపొమ్మ. దైవానుగ్రహమువల్ల అట్టిఅవసరము రాకుండ ముందు జాగ్రతగనుందుము.

బేనీమాధవసింహు వీథిలోనుండి యింట్లోకివచ్చేసరికి అన్నదమ్ములిద్దరు ప్రేమాలింగనములుచూచి, పరమానంద భరితుడై "పెద్దయింటిపిల్ల అంటే యిదీ. చెడిపోయినకార్యము తిరిగి సమకూర్చినది" అనెను. ఊరంతా ఈసంగతి తెలిసి ఆనందిని బహువిధముల పొగడిరి. "పెద్దింటిపిల్ల" యిలాగువుండాలి అని అనుకొనిరి.

(అనువాదము.)

# స్నేహలతాదేవి

"బొందివశియించియును వహ్నిభూతమైన
బూదియందును ఛాయాప్రపూర్ణ రాగ
రసవికాసములో స్వప్న ప్రణయవిధుల
పరమబోధలనెంతు భావమ్మునందు."

— స్నేహలత.

తలిరుప్రాయమ్ముననే తనువుదొరగిన తరుణీయయ్యు స్నేహలతాదేవి, మానవహృదయసీమల శాశ్వతమైనస్థానము సంపాదించ కలిగినది. ఆమె 'యాత్మోపహారమునకు ప్రేరణాధర్మము లత్యుదాత్తములగుట' స్నేహలత చరిత్రయందే స్పష్టమగుచున్నది.–సమస్తవేదాంగవేత్తయయిన హరేంద్రశర్మ వంగడమున 'విచ్చినపుష్పము' వలె పుట్టినది. ఆ 'నయగారికుమారిత' నెంతోగారాబముతో పెంచిరి. 'రాజరాజకుమారికారత్నములును' పొందలేనట్టిభోగము లనుభవించినది. విలక్షణమైన యా కుమారీమణికి యౌవనోదయంబయ్యె. ఈసమయంబుననే స్నేహలత జీవితప్రవాహము కలతనెందినది. వివాహప్రయత్నములతో, వరాన్వేషణములతో విస్తరించిన ఒకవిషమసమస్యయే ఈకన్యజీవితము బలిగొన్నది.—యౌవనముద్దీపించి ప్రేమ పెంపొందుచుండు వయస్సు!–పదియునైదేండ్లు నిండనిబాల!–మనదేశమందీవయస్సే మనోవికాసము కలుగుతరుణము. అస్ఖలితమై నిష్కల్మషమైన కన్యాత్వ మీతరుణమందే ఆదర్శమైనపద్ధతుల ననుసరించ యుత్సాహించును.

వరునికట్నముకొరకై, యిల్లు వాకిలి అమ్మవలసి యిడుమలంబడుచున్న తండ్రి బందా కనకలింగేశ్వరరావుగారి యావస్థ ఈమె అద్దమంటిమనస్సున చిఱుకుమనినాటినది. అప్పుడుకలిగినవిషాదమే వితర్కణాలోనికి మారినది. 'ఆదర్శబద్ధకౌతుకమై' 'విశుద్ధరాగలీనమైన' ఈమె హృదయము ఎట్టికష్టములైననోర్చసాహసించినది. తండ్రిపవిత్రగృహము తనవివాహముకొరకు వెచ్చించుటయే ప్రపంచమున ఆమెకు నీచతమముగతోచినది.

"సుంకవీయక మంగళసూత్రమునకు,
యోగ్యురాలకాదేని నిర్భాగ్యయైన
కన్య యాజీవితము నేల కాల్చరాదు?"

అని ఒకవిధమైన విరక్తిపుట్టి మనస్సువిరిగిపోయినది. మనస్సు విరిగిపోయిన చేయరాని సాహసకృత్యములుండవుగదా!

మఱియు, నీమె మనోభావమును నైతికశంకలను, గట్టి తలంపులను తెలియజేయు లేఖయొకటున్నది. ఈ లేఖయందామె 'కవితాహృదయము' ప్రజ్వరిల్లుచున్నది.—స్థూలదృష్టితో తిలకించిన స్నేహలతాదేవి 'రూపముగైకొన్న కవితాహృదయము.' ఆమె మాట, మనస్సు కవితాలోకమునకు తగినవియే. ఆస్నేహలతాదేవిప్రతిమనే, ఆమె కవితాహృదయమునే ఈ వ్యాసమును విస్తరించెడి ప్రధానాంశము.

స్నేహలతామతల్లినిగూర్చి పాడు 'అవిపాదమృదులగీతిక' పదపదంబునను, ఆకన్నియ విశుద్ధ భావమునే వెల్లివిరియజేయును ఆమె మాటాడిన మాటయందు "మోహనకవితాప్రసాదము" మిక్కుటముగ నుం

షును. ఆమె కవితాస్వరూపిణి. సౌందర్యము కొఱ కామెకు సంస్కారమవసరము లేదు.

"శిశిలకుంతలయైయుండె స్నేహలతయు
మనుపుకాటుక కనుపట్టలెనయ జెరగి,
ఒకయవాదరణంపుపొందిక దెలార్చ"

అని చూడగల్గిన ధన్యాత్ముఁడను చున్నాఁడు. ఆమె నొకసారి గాంచిన మఱల మరువఁజాలరు. హృదయమునఁ దాకుమారీ ముఖబింబమప్పుడే హత్తికొనిపోవును.

"నడలయొప్పుల వినయబంధములుగలవొ,
చూపులవి ముగ్ధమైన నాజూకుగలదొ.
నగుమొగమ్మున నందచందములుగలవొ"

ఎవరు పరీక్షించగలరు? ఎవరికి భేదించ శక్యమగును ఆముఖంబుననున్న నిండుతనము, గంభీరత! ఆకుమారీమణిని గాంచిన వారు ఒకదివ్యజ్యోతినిగాంచినవారివలె మంత్రితులగుదురు.

"పరిచయరహస్యమాధుర్య మెఱిగినట్టి
ప్రణయులకు స్నేహలతవోలె ప్రాప్తవశత
కలసిమాటాడినట్టి ధన్యులకు నెల్ల
తలపునెడలదు స్నేహలతామతల్లి"—

గంగాతీరమందలి, భావతరంగిత హృదయై చెలి ప్రియుంవదతో విహరించుచున్న స్నేహలత పలుకులు మగవారి మేన ములుకులే! కొంతసేపు

"ప్రకృతిమార్గపపూర్ణశోభలను జల్చి
పురుషనై జఘాతిక భరంబును నెలార్చి
పరమసుచిరమైన ప్రేమప్రపంచమునకు,
నడుచుమార్గము మరలనేర్పడును సఖియ!"

అని నిరాశతో విలపించుచు గన్పట్టును. స్థిరయగుటచే అంతలోనే.

"శకుసహజమైన పురుషస్వభావమిటుల
పావనస్త్రీకళాభాగపదవినింత
నిరసనొవ్వాఁ దదృష్టిగణింపకున్నె?"

అని రోషారుణితనేత్రయై గర్జించుచున్నది.— తానవివాహితగా నుండుటంజేసి, తండ్రింజెండెడి యపవాదు తనమూలమునసే యని యవమానముంబొందు ఆకన్యాలలామ, గంగాప్రవాహమే తనకు శరణని దలపోయసాగును.

".........సుఖదుఃఖలోలగతుల
సంకరముగాని యానందజగతియేదొ?"

అని వెదుకకొన నారంభించెను. అంతకంతకు జేలమైపోవుచున్న యాయబల వికలహృదయయగునేమోయని సందేహమొదవుచుండెను. గంగానది పవిత్రమైనదా? మంగళస్నానము లీయేటియందుననే జరుగును. నివాపోదకములుగూడనిందే!

"నిత్యకల్యాణతోరణని బిడయగునొ,
శాశ్వతశ్మశానజ్ఞానశాల యగునొ"

ఆమె కింకను దృఢపడలేదు. ఇంత భావవ్యాకులమై అల్లకల్లోలితంబైన ఆమె హృదయ మెంతభయానకము! ఎంత ఆవేశాపూరితము! ఆమనోపరివర్తనలెట్లు భ్రమించుచున్నవి?—

ఆమె జీవితసందేశమందు, 'కన్యకా'ధర్మమంత విస్పష్టముగాకున్నను, పితృగృహపరిరక్షణ మగ్రస్థానమాక్రమించినది...ఆమెకు కనకదుర్గాంబప్రసన్నమయినది. తుదకామె ప్రశాంతభావముదాల్చినది. ఇప్పుడామె దయారసమొలుకుచున్నది. ఆమె మాటలిప్పుడు జాలిగొలుపుచు కన్నీరొలికించుచున్నవి. ఆమెచరిత్రచే ఆర్యావర్తము ప్రతిధ్వనించుచున్నది. "పంకుపగడాల రాసిలో పడి భ్రమించు నింగుజాబలిరేక"వలె కన్ను

లుమిలుమిట్లుగొల్ప అగ్నిప్రవేశ మొనరించిన ఆపదియేనేమలపిల్ల నెవ్వరుమఱువగలరు? ఆమె కవితాహృదయు మెవ్వరుస్మరింపకుందురు? ఆర్యావర్త బాలామణులనందఱిని 'ఓ హో' యనిపించిన ఆయవతారమూర్తి నెట్లుప్రశంసించుట?

'భరతజనయిత్రి సుకృతతపఃఫలమ్మున, జననమందిన యువజనులే' తెలివితెచ్చుకొని నీచమైన శుల్కగ్రహణమును నిషేధించవలెగాని, పాపము కన్నెలేమిసేయగలరు? స్నేహలతామతల్లివంటి కన్యారత్నము లిట్లునశియింప దేశమోర్వగలదా? ఇందు కన్యకాధర్మమేమున్నది?

"అధమపౌరుషమనక కన్యలనరింప
శుల్కములకాసకేసిడి శూరులయిరె"

అని విచారింపవలసియున్నది, ఈయువజనులనుగూర్చి. స్నేహలతాదేవి జీవితమొకస్వప్నమువలెతోచును. పాపము! పదునేను సంవత్సరములు! కవితాప్రపంచమును హృదయమునందిమిడించుకొన్న, యిమిడించుకొనగలిగిన ఒకదివ్యవ్యక్తిఆమె.

"సుభగతాంబులకీర్తిమూలోభమధ్య
ఒత్తుతెలినవ్వు రేకులగుత్తిమాద్రి."

ఆపండునిప్పులలో నవ్వుచుప్రవేశించినది!

ఆగ్యకన్యాకులీనత కర్తవ్యముగ
తనువుదొరగిన స్నేహలతామతల్లి
రగులజేసిపోయిన పవిత్రంపువహ్ని
బుషులఈభూమి పునరుద్ధరించుగాత!

('స్నేహలత' గ్రంథకర్తనుగూర్చి)

ఉ. జొన్నెలనిగ్గునోలె వికసించుపికుద్ధపదాలగూర్చి దా
జెన్నలరారప్రాసె కవిశేఖరుడొక్కరు డట్ల "మిన్నలన్
మన్నలు మీరుచేయును సమస్తచరాచరభూతసృష్టియున్
కన్నియలోనలీనమయి గానముజేయగ నామె నామమున్."

# సతీహితము

శ్రీమతి అంబటి లక్ష్మీనాంచారమ్మగారు

చం. పురుషుఁడెదేనిగ్రామమునుబోయి గృహంబునుజేర మాతస
త్వరముసఁబట్టి పొట్టగను భార్యయె పీపునుజూచునంచు నీ
వరకె సతీజనంబు కొకభారపునింద శిరంబునుండె నే
తెఱగునసంచరింప సదిలీరునొ యొర్గి చరింపు మానినీ!

# బ్రతుకు బరువు

గుంటూరి వేంకటశాస్త్రిగారు

ఈనిదాఘమువేళ, నాయీవిషాద
గాధలోనద్రవించిన కఠినశిలలె
నాకుమృదుశయ్యలయ్యె నెన్నాళ్లనుండి?
ఈనదీజలమెల్ల నాయీయెడంద
నిండుచల్లనినీట ఘనీభవించి

మానెప్రవహింప నెన్నడోకానిమొదట?
తీయనిస్వరంబు దిశలప్రతిధ్వనింప
స్వేచ్ఛగా గానమొనరించు పికకుమారు
లలసి విసుగంది యెచటకో వెడలినారు?
వారిగానమువింటె నబ్ధాలక్రితము.

# ఆంధ్రపితామహుఁడు

కేతుమల్ల రాజగోపాలరావుగారు బి.ఏ. యల్.టి.

ఏకాంక నాటకము.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర.—ఉ. శ్రీలకుఁబుట్టినిల్లగుల
కేముషికెన్నిలయంబు విద్యలం
ద్రాలు నఖండ తేజము జ
గన్నుతరమ్యగుణస్ఫురణ్మణీ
జాలవిభావిభాకరము
శాంతిగభీరమునా జగత్త్రియీ
పాలనదక్షు మాంధ్రుల
శుభంకరశీలము మిమ్ము నోముతన్.

తే.గీ. జ్ఞానవృద్ధి నెసంగి బ్రహ్మత్వమంది
భద్ర శివకరమై శివత్వము వహించి
యంతటను మించి విష్ణువై నట్టి ప్రాక్త
నాంధ్రశీలంబు మిమ్మోము నహరహంబు.

ఇట్లార్యమిత్రులతో విన్నవింతును గాక! ఏమి యీకలకలము? (ఆకర్ణించి) ఇదిగో తెలిసినది. ఎద్దియో మహత్తరమైన యర్థము నుపస్కరించికొని పూజ్యుఁడైన విశ్వామిత్రుఁ డయోధ్యాపురరాజవీధి నరుగుచున్నాఁడు. ఇఁక నేనిట నిలుచుట పాడిగాదు.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

రంగము:—అయోధ్యానగరములోని యొక రాజవీధి.

(అప్పుడు విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విశ్వా.—(స్వగతముగ) జగములకుఁ గల్యాణమగుఁ గాత! ముల్లోకములును అకంటకములగుఁగాత! స్వకార్యధురంధరులై వంచకులై దయాశూన్యులై యీ మానవులెంత నికృష్టులై యున్నారు! ఈ యాసురమును వారించి జగముల నుద్ధరించుటకై నేనెంత కష్టపడవలసి వచ్చుచున్నది.! స్థైర్యముతోడి మనోబలముగదా దీనికి సాధనము. ఆంధ్రులు నిష్కాకులే యిందు జగత్ప్రసిద్ధులు. అట్టి యమోఘమైన యాంధ్రుల మనోబలమును, అప్రమేయమైన యైక్ష్వాకుల స్థైర్యముతోఁ గూర్చినప్పుడే మాయావిశారదులగు నిశాచరానుచరులను జయింపనగును. అందులకే గదా నేను

ఉ. పట్టితి దీక్ష నాంధ్రనుత
ధానుకులోత్తము జెట్టఁబట్టఁగాఁ
గట్టి తరుంధతీధవునిఁ
గార్యకలాపము సంఘటింప, నే
మెట్టితిఁ గోసలద్వయము
మేకొని లక్షలఁ గోటిసారు ల
ట్టిట్టు పొసంగ నే త్రిజగ
దీడ్యము రాముని జన్మమిద్ధరన్

ఆతారకాంతకుఁడగు కుమారుని జన్మకై దేవతలు హిమవంతుని స్థైర్యమును శంకరుని రౌద్రమును నొక్కచోటఁ గూర్చినట్లు రాక్షసాంతకుఁడు కాఁదగు రాముని జన్మకై నేనింత కష్టపడవలసివచ్చినదా? అప్రమేయమైన భానువంశ్యుల ప్రతాపమును అమోఘమైన యాంధ్రుల మనోబలముతో జతగూర్పవలసివచ్చినదా? ఇట్టి మాటమి యాజగద్రక్షకుఁడును నవతారమెత్తుటకుఁ యోగ్యమైనది. అయిన నేమి? నారాయుఁ డవతారపురుషుఁడే కానిమ్ము. శాసనబద్ధమైన యీ సృష్టియందు కాలోచితమైన సాధన సంపత్తిలేక కార్యములు సంఘటిల్లునా? ఏదీ నారాముని యఖండసత్వమునకుఁ దగిన విద్యాశక్తి యేదీ? ఎట్టిజాతిరత్నమయ్యును సానఁబెట్టక ప్రకాశించునా? సద్విద్యలేనిచో నారాముడు నట్లేయగును.

(భుజంగప్రయాతము.)

అరణ్యాళిఁ బుష్పించి యందే యడంగున్
స్ఫురత్సౌరభోపేత పుష్పవ్రజంబుల్
పరార్థోపయోగప్రథల్ లేని శక్తుల్
ధరన్ నిష్ఫలంబుల్ గదా యెంచిచూడన్.

ఇన్ని కష్టములుపడి నను కూర్చిన యీతని జన్మము పరార్థప్రాపకము కాదేని లోభివానిధన

మువలెఁ దనకును లోకమునకును గూడ వ్యర్థమగును. ఇప్పుడీ బాలుని లోకకల్యాణమున కనువగు వృత్తమునఁ బ్రవేశపెట్టి వలసిన సాధన సంపదల సమకూర్పవలెను. అడవినిఁ గాచిన వెన్నెలలవలె, భూగర్భమునందుఁ బాతుకొనిపోయిన ఖనులవలె, సముద్రపుటడుగున వణఁగియున్న దివ్యరత్నములవలె నైజములైన యీతని యపారశక్తులు లోకసౌభాగ్యదములు కానిచో నేమిలాభము? ఇంతకును వాఁడు తల్లిదండ్రుల చాటునఁ బెరుగు గారాబంపు శిశువు. ముందు వానిని గృహమునుండి వెలువరింపక కార్యములు పొసఁగవు. తల్లుల గారాబములే శిశువుల కనర్థదాయకములు. ఇప్పుడు ముందుగా కౌసల్యాదేవి మందిరమునకే నేనేగి తగిన మంత్రమును బ్రయోగింపవలెను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రంగము. కౌసల్యాదేవి మందిరము.

(కౌసల్యయుఁ జెలికత్తెయుఁ బ్రవేశించుచున్నారు.)

కౌసల్య.—రామునకు శుభమగుఁగాక! చెలీ! రాత్రి కడజామున శయనించియుండ నా కెట్టికల వచ్చినది! ఇప్పటికిని నాయొడలు గడగడ వణకుచున్నది. ఇది శుభమో అశుభమో! ఈ దడ ఈ భయము అణఁగు టెట్లు? నా రాముని నెడబాసి నేనుండఁగలనా?

చెలి.—దేవీ! ఏమని కలగంటిరి?

కౌస.—చెలీ! అదియొక యద్భుతమైనకల. ఆకలయందొక దివ్యగజము. ఎంతపెద్ద దేనుఁగుగదా అది. సర్వాలంకార భూషితమై నా కన్నులు మిఱుమిట్లు గొలుపు తేజముతో నది మందయానమున నాకడకువచ్చినది.

చెలి.—ఇఁక నేమి? దేవిగా రధిష్ఠించుటకే. అది దివ్యమైనకల.

కౌస.—కాదు. ఈమాటవినుము. ఆదివ్యగజముపై జటాలంకారశోభితుఁడై కమండలధారియై అద్వితీయమైన బ్రహ్మతేజముతో విరాజిల్లుచు కౌశిక మునీంద్రుఁడు అధిష్ఠితుఁడై యున్నాఁడు.

చెలి.—ఓహో! అట్లయిన నీకల చింతితము. రాత్రియే కదా కౌశికమునీంద్రుఁ డయోధ్యకు వచ్చుచున్నాఁడని చారులు చెప్పినట్లు మహారాజుగారు మీతో సెలవిచ్చిరి. అమ్మా! ఆపూజ్యపాదులు మీ జనకుని యాంధ్రవంశమునకు మూలపురుషులగుటచే మీలోని యాంధ్రాభిమానము కౌశిక మునీంద్రుని నట్లు స్వప్నగతునిఁ జేసినది. తరువాత నేమి జరిగినది?

కౌస.—నేను భక్తితో నాపరమమునీంద్రునివంకఁ జూచుచుండఁగా ఆగజము నన్ను సమీపించి తుండమును సాచి నాయొడియందున్న రామలక్ష్మణులను బట్టుకొన్నది.

చెలి.—ఓరా! ఎంత దుష్టగజము! అది యాబాలు రిరువురకు నేమియు హాని చేయలేదు కదా?

కౌస:—ఏమో? ఏమి చేసియుండునో? కాని నేను నాబిడ్డలను విడిపించుకొనుటకై యాతోండముతో ఘోరయుద్ధము సలిపితిని.

చెలి.—ఆంధ్రాంగన వనిపించుకొంటివి. రామలక్ష్మణులను విడిపింపఁ గలిగితివా? ఏ ప్రమాదమును జరుగలేదు గదా? ఇంతకును నిది చింతితమైనకల. దీనికెట్టిఫలమును లేదు. తరువాత నేమి జరిగినది?

కౌస.—నేనట్లు యుద్ధమొనర్చుటచూచి, యాగజము మర్యాదగా నన్నావలకునెట్టి నాపుత్రులను అతిభద్రముగా మునీంద్రుల కందిచ్చినది.

చెలి.—ఇఁక నేమి? నీతనయులు భద్రగజారూఢులైరి. మేలైన స్వప్నము. తరువాత?

కౌస.—అద్భుతము! చూతుముగదా! ఇంతలో నాజనకుఁడు దక్షిణకోసలేంద్రుఁడు ఆయేనుఁగుపైనుండి గంభీరస్వరముతో "కుమారీ! నీవు ధన్యవతివి. నీ రామలక్ష్మణులిఁక లోకోద్ధారకులు కాఁగలరు" అని నుడివెను. గజమును నాతనయులతో నెక్కడకో పలాయనమగుచుండెను.

చెలి:—అయ్యో! ఏమి విచిత్రము! తరువాత నేమి జరిగినది?

కౌస:—నే నాయేనుగును విడువక వెన్నంటియే యేగితిని. అది తమసానదీతీరము. బల అతిబల యను రెండువిద్యలను నేర్చి నాపుత్రులు మునీంద్రుని వెనుకనే నడచి యేగుచుండిరి.

చెలి:—ఏనుఁగు ఏమియయినది?

కౌస:—ఏమో. నడచియే మువ్వురును నరుగుచుండిరి. కొంతసేఁపటికి వారందు కృతావగాహులైరి. ఇంతలో నెదుట నొకభయంకరాకారముగల రక్కసి! కౌసిక మునీంద్రుఁడు నవ్వుచు రాముని చూచి "పుత్రా! నేనున్నాను. నాయస్త్రబల మున్నది. నాతపోబలమును న్నది. నేనండగా నుండ నీకేమియు భయములేదు. ఈరక్కసిని సంహరింపుము." అనెను. ఒక్కటే వ్రేఁటు. రామునిచే నారక్కసి హతమైనది.

చెలి:—ఔరా! బాలకా! దేవీ! నీరామునకు శత్రు సంహారము! దివ్యమైన కల. తరువాత.

కౌస:—అంతట పూజ్యపాదులు రామునితో "పుత్రా! వీరుఁడవైతివి. మంత్రోపదేశమునకు అర్హత గలిగినది" అని చెప్పుచు వాని చెవిలో నెవ్వియో రహస్యములు చెప్పెను.

చెలి:—(ఆశ్చర్యములో) ఎంతపెద్ద కలగంటివమ్మా! తరువాత.

కౌస:—చూతునుగదా! యచ్చటి నేల యంతయు రతనంపుటినుకలతో నిండియుండెను. ఒక్కొక్క రత్నమే చంద్రునివలె కాంతమై, సూర్యునివలె తీక్ష్ణమై, వజ్రాయుధముపోల్కి నునిశితమై, ద్వాదశాదిత్యులు నొక్కపెట్ట నుదయించిరో యన తీవ్రప్రభాభాసమానమై ఫాలాక్షుని యగ్నినేత్ర ముభంగి త్రిలోకములను దహించివైచునంతటి యుష్ణముతో ధగధగలనీనుచు స్త్రీలకు సమీపింప నలవిగాక యుండెను.

చెలి:—ఎంతచిత్రము! తరువాత.

కౌస:—ఒక్కొక్కరత్నము నే లక్ష్మణునకు జూఁపుచు నాతనయుఁడు వానితో నెవ్వియో రహస్యములాడెను. పిమ్మట వింటిని చేతధరించి నానందను లొక్కొక్క రత్నమునే ముట్టఁగా యది యప్రతిమానప్రభావంతమగు నొక్కొక్క దివ్యాస్త్రమయ్యెను. మంత్రశక్తిచే నా రత్నము లన్నింటిని దమయందు-లీనము చేసికొని నా పుత్రులు కోటిసూర్యప్రభాభాసమానులై యలరారి కౌశికమునీంద్రునకు నమస్కరించిరి. అంతట పూజ్యపాదులు "నందనులారా! పదునాల్గు లోకములను గల సమస్తదివ్యాస్త్రములను నేను మీవశము జేసితిని. జగములకు గల్యాణమగుఁగాక" అని దీవించెను.

చెలి:—ఓహో! ఎంతటి భాగ్యము. తల్లీ! నీవు ధన్యురాలవయితివి. ఎవ్వరు నెఱుఁగని యస్త్రములను గూడ కౌసికుఁడు బ్రహ్మవలన సంపాదించెను. అవి నీతనయుల వశమయినవి. నీకోరిక ఫలించినది. తరువాత—

కౌస:—చూతునుగదా ఇంతలో నయోధ్యాపురము. మఱల నామత్తగజము, దానిపై కౌశికమునీంద్రులు ఆకరీంద్రమునుండి దిగివచ్చి అనంత శోభావిరాజితులగు నారామలక్ష్మణులు నన్నాలింగనము చేసికొనిరి. నాకు మెలఁకువ వచ్చినది. ఏమి యీకల? ఏమి మూఁడునో కదా? ఆంధ్రీ! నాకు భయమగుచున్నది. నా రామలక్ష్మణులకు శుభమగుఁగాక!

ఆంధ్రి:—అమ్మా! ఇది దివ్యమైన కల. కౌశికమునీంద్రులు వత్తురని యెఱిఁగి రాజేంద్రులు వసిష్ఠులవారికి నీనందనులను గొనిరమ్మని యాహ్వానమంపిరిగదా? వారు రాఁగానే మనరాజుగారిచే కౌశికమునీంద్రులను ప్రార్థింపించి నీనందనులను వారికి శుశ్రూష నొనర్పఁజేయుము.

కౌస:—నీ మాటలు నాకర్థముగాకున్నవి. నాకు భయమువేయుచున్నది. ఎవరు నాకు దిక్కు? నాబిడ్డ లేమగుదురో?

(అప్పుడు విశ్వామిత్రమునీంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు. భయముతో దిగ్గున లేచి కౌసల్య యాతని పాదములకుఁ బ్రణమిల్లి)



కమలా మూవీటోనునందలి 'రాధ' పాత్ర
'రాధాశ్యామ' అనుఫిలుమునందలి ఒకానొక విన్యాసంపుదృశ్యము



"తాత!"



"కెమేరావంకచూస్తే ఎట్లామరి"

—ఛాయాచిత్రగ్రాహకులు: కొడవటిగంటి కృష్ణమూర్తిగారు.



ప్రసవవైద్యశాల: విశాఖపట్టణము.

—పి. వి. శర్మగారు.

కౌస:— మునీంద్రా! మీరే నాకుదిక్కు. నాకుమారులను రక్షింపుఁడు.

విశ్వా:— కుమారీ! నీకు శుభమగుఁగాక. ఆయుష్మంతుఁడగు నీకుమారుని మూలమున వీరమాతవుకమ్ము.

కౌస:— (భయముతో) ఇదియేనా నాకలకర్థము?

విశ్వా:— ఏమి కల? తల్లీ! యేమని కలఁగంటివి?

కౌస:— (ఆలోచించి గద్గదికతో) నా రామలక్ష్మణులను గాపాడుఁడు. తమ దివ్యప్రభావము చే నాదుస్స్వప్నదోషము పరిహారమగుఁ గాక!

విశ్వా:— తల్లీ! ఇదే అభయప్రదానము. ఏమనికలఁగంటివి.

కౌస:— (వణఁకుచు) ఆంధ్రీ! ప్రియంవదా! నీవు చెప్పుము.

ప్రియం:— వేఁగుజామున దేవి యీ కలఁ గన్నది. మాయాంధ్రవంశమునకు మూలపురుషులు పూజ్యపాదులు నగు మీరు రామలక్ష్మణులను మదగజేంద్రముపై నెక్కించికొనిపోయి తమసానదీ తీరమున పదునాల్గుభువనములందలియు సమస్త దివ్యాస్త్రములను నొసఁగితిరని.

విశ్వా:— (స్వగతముగ) శుభము. నేను యాచింపఁబోవు వర్థమునకిది దివ్యమైన యుపశ్రుతిఁ బలుకుచున్నది. (ప్రకాశముగా) కుమారీ! నీకల నిక్కల. రామలక్ష్మణులవలన త్రిజగములకు నభ్యుదయమగును.

కౌస:— దీనివలన నాముద్దుకుఱ్ఱల కేయాపదయు ఘటిల్లదుగదా?

విశ్వా:— ఆపదలా? ఎంతమాటాడితివి? ఇం దేయాపదకును జోటులేదు. ప్రబలములైన భవిష్యదర్థము లెప్పుడును స్వప్నరూపముగనే మొదటఁ బొడసూపును. నీకల పరమశుభదాయకములగు సద్యః ఫలముల నిచ్చు దివ్యమైనకల.

కౌస:— ఈ కలయొక్క ఫలమేమి?

విశ్వా:— ఈరీతి స్వప్నములను నేను వివరించి చెప్పరాదు. కాని యిది యుత్తమోత్తమమైన సుస్వప్నమని నమ్ముము. హృదయమునం దారటము నొందకుము.

కౌస:— పూజ్యపాదుల యమోఘాశీస్సులే నాకు శరణ్యము. మీరాకచే నేను ధన్యనయితిని. నాభయము తీఱినది.

విశ్వా:— కుమారీ! ఎఁడీ? నీరాముఁడేడీ! వానివిద్యలు చక్కఁగా సాఁగుచున్నవి గదా?

కౌస:— బ్రహ్మణ్యులైన వసిష్ఠులు పూజ్యులుగదా! వారికిఁ దెలియరాని యర్థము లెయ్యవి?

విశ్వా:— (తనలో) బ్రహ్మణ్యులా? వేదములను ధర్మశాస్త్రములను వల్లెవేయింపఁగలరు, వారికిఁ దెలియరాని యర్థములా? పూజ్యుఁడైన వసిష్ఠుఁడెన్నఁడైన విల్లునమ్ములుపట్టు నేర్చెఁగదా? ఈ కౌసల్య యెంత సాభిప్రాయముగా వచించుచున్నది. (ప్రకాశముగా) అమ్మా! నీతనయులు కుశాగ్రబుద్ధులు. ఏకసంతగ్రాహులు. ద్వాదశవర్షవయస్కులగుటచే వేదశాస్త్రములన్నియు వారిపాటికి కభ్యసించియే యుందురు.

కౌస:— అమోఘసంకల్పులగు తమ యాశీస్సుల ఫలముగా నాతనయులు తప్పక ధర్మకుశలురు కాఁగలరు.

విశ్వా:— (తనలో) ఇదియేకదా యాంధ్రుల బుద్ధిబలము. ధర్మశబ్దముచే నీకల్యాణి రాముని శిష్టదస్త్రశిక్షకు ఈడువచ్చినదని పలుకుచున్నది. (ప్రకాశముగా) కుమారీ! మిమ్ము విడిచి వసిష్ఠాశ్రమమందేకదా నీతనయులిప్పుడు విద్యాశిక్షనందుచున్నారు?

కౌస:— ధర్మయుక్తమైన మాతృప్రేమ యెంత పవిత్రమైనదో తమోనిబద్ధమైన మాతృప్రేమ యంతటి మహాపాతకమైనదని తమబోటి పెద్దలే కదా వచింతురు. పుత్త్రులు గుణాధికులు గావలసినప్పుడు తల్లుల కీవియోగము తప్పఁగలదా?

విశ్వా:— (తనలో) గుణాధికులా? గుణ మనఁగా వింటివారి. (ప్రకాశముగా) తల్లీ! ఆంధ్రాంగన వనిపించుకొంటివి. నీశుభవాక్కులు నీతనయులకు సమస్తకల్యాణసంధాయకములు.

(చేటిక ప్రవేశించుచున్నది.)

చేటిక:—మహారాణికి శుభము లొదవుఁగాత! అమ్మా! మహారాజు కుమారుల వివాహప్రయత్నములకై మంత్రి పురోహితాదులతోఁ జేరోలగముండి తమరాక నభిలషించుచున్నారు. (నిష్క్ర.)

విశ్వా:—కుమారీ! నేనును రాజేంద్రుని దర్శింపవలసి యున్నది. ఈశుభసమయమున నే యచ్చటి కరుగుదునుగాక!

కౌస:—అదియే మహారాజుగారి యాప్సితమును. పూజ్యపాదులయిన తమ శుభాగమనమును చారచక్షువులగు రాజేంద్రు లెఱుఁగుటచేత నే యీ పుత్త్రికల్యాణేచ్ఛ తమయాశిస్సులకొఱకు నేఁడిట్టి సభారూపము వహించినది.

విశ్వా:—కుమారీ! రాజదర్శనేచ్ఛ నన్ను త్వరపెట్టుచున్నది. నాకింక తడయరాదు. నీ పుత్త్రులకు సకలశుభములు నొదవుఁగాత.

(కౌసల్య మునీంద్రునకు నమస్కరించుచున్నది. ఇరువురును నిష్క్రమించుచున్నారు).

రంగము: దశరథుని సభాభవనము.

(సింహాసనస్థుఁడై దశరథుఁడును, ఉచితాసనములపై మంత్రులును రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులును, వసిష్ఠ విశ్వామిత్ర వామదేవాదిమునులును కౌసల్యాదులితర పరివారమును ప్రవేశించుచున్నారు.)

విశ్వా:—రాజేంద్రా! మంచిమాటాడితివి. కాని కన్యాదాతలు నీతనయుల యోగ్యతలను జూచి తమ పుత్త్రికల నొసఁగవలె నందువా; లేక నీభాగ్యమునకు ముగ్ధులై బాలికలను సమర్పింపవలె నందువా?

దశర:—పూజ్యులైన తమ శాసనముల నర్థించియేగదా నే నీసమావేశమును గూర్చినది!

వసి:—(రహస్యముగ విశ్వామిత్రునితో) ఆకోసలాత్మజను మహారాజునకుఁ గూర్చిన శుభమును దలంచి నేఁడిట్టి సమావేశము కూర్పఁబడినది.

విశ్వా:—రాజేంద్రా! దశరథునిఁ జూచి యాతని పుత్త్రులకుఁ గూఁతుండ్ర నొసఁగువారిని నేను గౌరవింపను సుమా.

దశ:—తమ యాజ్ఞకు నేను బద్ధుఁడను.

విశ్వా:—విద్యలయినను బూర్తిగాని పండ్రెండేండ్ల నీనందనులకు చిత్తాకర్షములగు నట్టి గుణాతిశయములవలన కన్యావరణమునకు అర్హత వచ్చినదని నీవు తలంచితివి?

దశ:—(ఊరక చూచుచున్నాఁడు)

విశ్వా:—ఉత్తమక్షత్రియోచితమైన ధనుర్విద్య వారి కలవడినదా?

దశ:—(తనలో) ఈపండ్రెండవయేటనే దానికి శుభసమయముకదా!

విశ్వా:—మహామంత్రసిద్ధిచే లభ్యములగు బ్రహ్మాస్త్రాదులు వారి కింకను స్వాధీనము కావలసియున్నవి గదా?

కౌసల్య:—పూజ్యపాదుల వచనములు అమోఘాశీస్సులై ఫలించునుగాక!

విశ్వా:—రాజేంద్రా! నీబాలుర కింకను కన్యలచే వరింపఁబడవలసిన కాలము రాలేదు.

దశ:—తనయుల కల్యాణమునకు తల్లిదండ్రు లెప్పుడును నాతురులుఁగదా!

విశ్వా:—రాజేంద్రా? నీతనయుల కల్యాణముమాత్రమే కాదు, దానివలన జగములకును గల్యాణము కావలెను. లోకసంరక్షణకొదవిన పుత్త్రుఁడే సత్పుత్త్రుఁడు. అట్టి ధర్మమును నిర్వర్తించు జననీజనకులే నిజమైన పుత్త్రవంతులు. లోకకల్యాణసంధాయకుల కాత్మకల్యాణము కాకుండ తప్పునా?

దశ:—బ్రహ్మణ్యసత్తమా! తమ వాక్యము లమోఘములు. అద్వితీయప్రతిభావంతులైన మీయెదుట నేను ముగ్ధుఁడను. మీ దివ్యప్రభావమును నే నెఱుఁగనా?

సీ. అఖిలాండకర్త బ్రహ్మయు మోక్షగతికై జ
పించు గాయత్త్రి సృష్టించినావు
చటులహుంకారభీషణనాదమున బ్రహ్మ
సృష్టికిఁ బ్రతిసృష్టి జేసినావు

మర్త్యమేధమఖంబు మంత్రద్వయమునొడ్డి
కరుణ శునశ్శేఫు గాచినావు
కులుకుపిఱ్ఱులచేత వలపించి తపముల
వంచించు రంభ భంగించినావు
పట్టుదలచేత నుత్సాహపటిమచేతఁ,
దపముచే నీతిచేత మంత్రంబుచేత
సాహసముచేత నెనలేనిశాంతిచేత,
మించి యాంధ్రుల జగతి సృజించినావు
సాటి నీకేరి యీరేడుజగములందు,
భువనకల్యాణగుణగణ్య! మునివరేణ్య.

విశ్వా:— రాజేంద్రా! ఒక్కవిషయమును జెప్పెద వినుము. శిష్టాగ్రగణ్యులగు వశిష్ఠుల కరుణవలన నీ యగ్రనందనుఁడు అఖండధర్మనిష్ఠాపటిష్ఠుఁడయ్యెనని యెఱుంగుము. కాని రాముఁడు క్షత్రియవంశపావనుఁడును గావలెనుసుమా! అప్పుడేకదా కల్యాణకాలము.

వసి:— రాజేంద్రా! నీనందనుల కిప్పుడు ధనుర్విద్యాభ్యాస మొనరించు నీడువచ్చినది. తగిన గురువును వరించుట కిదియే యదను.

దశ:— ధనుర్విద్యాపారంగతులగు నుత్తమ గురువుల నభ్యర్థింప తామేకర్తలు.

వసి:— రాజేంద్రా! సప్రయోగసంహారముగా చతుర్దశభువనము లందలియు క్షాత్రధర్మోచితములగు నెల్ల శస్త్రాస్త్రములను నెఱిఁగిన బ్రహ్మణమూర్తి యీకౌశికమునీంద్రుఁడు గాక వేఱెవ్వరున్నారు? ఎఱుఁగుదువుగదా ఈతని క్షాత్రమహిమ!

ఉ. నేరరు దేవతల్ ఋషులు
నేరరు రాక్షసకిన్నరోరగుల్
నేరరు సిద్ధసాధ్యులు గ
ణింపఁ జరాచరభూతకోటిలో
చేరితఁడొండుదక్క సభ
లీకృతపుణ్యులు సప్రయోగసం
హారముగా నుతాఖిలమ
హాస్త్రవితానవిధానపారగుల్.

ఈకౌశికుఁడే యట్టి జగదేకపూజ్యుఁడు. ఎఱుగుదువుగదా సమస్త శస్త్రాస్త్రములును దక్షుని కూఁతులగు సుప్రభయు, జయయునను కాంతామతల్లులకుఁ బుత్రరూపమున నుదయించెనని! ఈపుత్త్రులనెల్లరను గాధిశాసువుడు కుశికనందనుని యాధీనమొనర్చి తరించిన వృత్తాంతము నీకుఁ దెలియదా?

మహాస్రగ్ధర. పరమ ప్రజ్ఞాన్వితల్ సుప్రభయు జయయు సాధస్య లాదక్షకన్యల్। పరిణీతంబై కృశాశ్వం బడసి రమల విశ్వంభరారక్షణేచ్ఛన్। పర శస్త్రాస్త్రాభిధానోజ్జ్వలులఁ దనయులన్ వారు వీరావతారున్! గరమర్థిన్ జెంది రావిక్రమభుజా ధరణీకాంతు నీగాధిపుత్త్రున్.

కావున రాజేంద్రా! నీతనయులకు ధనుర్వేదాధ్యాపకుఁడైన యుత్తమగురువెవ్వరో తద్విద్యామర్మ మెఱిఁగిన యీకౌశికుఁడే నిర్ణయించుఁగాత.

విశ్వా:— రాజేంద్రా! అభిలాషకలచోట యోగ్యత లేదు. యోగ్యత కలచోట విద్యాభిలాష లేదు. రెండును గలచోట శిక్షణొసంగఁ జాలు గురువు లేఁడు. అందువలననేగదా జగత్పూజ్యుల సంఖ్య యత్యల్పమై యున్నది?

కౌస:—(రహస్యముగా) రాజేంద్రా! మీరుకదా ఈకౌశికమునీంద్రుని వర్థింపఁగర్తలు.

దశ:— మునీంద్రా! మీగాయత్రినే జపించు కారణమున నాబ్రహ్మకుఁగూడ మీరధిదైవతములు. ఈయిక్ష్వాకువంశము నుద్ధరింప మీరేకర్తలు.

విశ్వా:— అరణ్యములలోఁ గాయగసరుల భక్షించుచు సంతతతపోనిరతులై యుండు మునులకు తీఱిక యెక్కడిది? నీ రామలక్ష్మణులు పాత్రత నెఱుఁగు నవకాశము పొడముదాఁక వారికుచిత గురువు లెవ్వరో యెవ్వరు నిర్ణయింపఁగలరు?

దశ:— జ్ఞానచక్షువులైన మహర్షిసత్తముల కవగతము గాని విషయములు కలవా?

విశ్వా:— నేనర్థించిన యొక్క పదినాళ్లపనికై నా రాము నెడఁబాసి యుండలేనని పలికిన నీయట్టి వాని తనయులకు గురుకులవాసముచేసి విద్యల నభ్యసించు యోగ్యతెట్లు పట్టఁగలవు?

రాజేంద్రా! ఇది కులవర్ధనుఁడవగు నిన్నుఁ దండ్రి నీగాఁ బడసిన నీనందనుల భాగ్యము సుమా! (అని రామునిఁ జూపుచున్నాఁడు.)

దశ:—మునీంద్రా! విషయబద్ధులగు మావంటివారికిఁ బుత్రమోహము గాఢముగదా.

కౌస:—(తనలో) 'నేను రాకముందే పూజ్యపాదుల కోరికను పుత్రులవివాహవిషయమునకు మఱలించినారా? కానిమ్ము. (ప్రకాశముగా) రాజేంద్రా! రాముని హస్తమునందలి యూర్ధ్వరేఖ లెంత దీప్యమానముగా నున్నది! ఆయుష్మంతుఁడగు వీఁడు జగదేకవీరుఁడగు కీర్తనీయుఁడు సుండీ. (అని తనకలను రహస్యముగా జెప్పుచున్నది.)

వసిష్ఠుఁడు:—(స్వగతము) ఈమునీంద్రుని ముఖలక్షణములు చూడఁగా నెద్దియో మాడునట్లు తోఁచుచున్నది.

విశ్వా:—(స్వగతము.) నన్ను నిరాకరించిన యీ రాజన్యుఁ డెందు పోఁగలఁడు? అకటా! వైరాగ్యవృత్తినున్న నన్నుఁబోంట్లకుఁగూడ రామునియెడల నింతమోహ మెందులకో?

సుమంత్రుఁడు:—(స్వగతము) తనవలనఁ బొడమిన యాంధ్రవంశపు దౌహిత్రులయందే యింత ప్రేమముగలవాఁడు ఆంధ్రకుమారులయెడల నెట్టిమోహ వివశుఁడో?

విశ్వా:—తడవైనది. ఇఁక నాకు సెలవిమ్ము. పోయివచ్చెదను. నీవును నీనందనులును సుఖులై యుందురు గాక! నాతపఃఫలమునంతను ధారపోసియైన చేయిక్కట్టును లేకుండ నీ రాముని కాపాడి మఱల నీకర్పింతునన్నను వినవైతివి. ఈవిశ్వామిత్రుఁడే రాజును నర్థించి యెఱుఁగఁడు సుమా. కానిమ్ము (అని వెడలఁబోవుచున్నాఁడు.)

(కౌసల్యా దశరథులు అతని పాదములపైఁబడి) మునీంద్రా! క్షమింపుఁడు. రేఁపటి యరుణోదయమున రామలక్ష్మణులతో మీరు పయనము సేయుదురు గాక.

విశ్వా:—(సవ్యము) ఆహా! ఎంతటి స్థిరచిత్తుఁడవు. రాజేంద్రా! ఏపుత్రమోహము నీతనయులను నాతో సంపుటకు మొదటనొక యాటంకమై నిలిచినదో ఆపుత్రమోహమే ఆశాబద్ధమై యిప్పుడు వారిని నాతో సంపుటకుఁ బ్రబల కారణమైనదా? లోకవృత్తమెట్టివిపరీతమైనది? రాజేంద్రా! నీతనయులకు శుభములొదవుఁ గాక!

వసిష్ఠాదులు:—తథాస్తు.

కౌస:—మునీంద్రా! ఎండకన్ను వానకన్ను నెఱుఁగని నిసువులు. అతిసుకుమారులు. పెద్దలను గౌరవింప నెఱిఁగిన యీడు రాలేదు. అన్నింటికిని తమదే భారము.

విశ్వా:—తల్లీ! ఈబిడ్డలు నామనుమలుగారా! తాతలకు పుత్రికాపుత్రికులకంటె పౌత్రులేరొక్కఁడు చుట్టములని నీకు తెలియదా? అయినను ఒక్కమాటను తెలుపనిమ్ము.

ఆ—వె. అణఁగి జీవరాసు లందు లోకోత్తర
మొక్కదివ్య తేజ మొప్పుచుండు
దాని వెలువరింపఁ దగు కీలెఱింగిన
వాఁడె సకలభువనభరణచణుఁడు.

కారణజన్ముఁడగుటచే నట్టిజీవరాసులందు నీరాముఁడు ప్రకృతిచేతనే యసాధారణమైన తేజమును ధరించి యున్నవాఁడు. తల్లీ! ఆతేజమును నేను వెలువరింపఁగలను.

(తెఱపడును.)

# దసరా ముసురు

## శ్రీమతి కొమ్మూరి సత్యవతిగారు

అటగారు నిటగారు ననుచు నందందు
ముసుగుతో సరిదెను ముసలితాత
క్రొత్తదుస్తులతోఁడ క్రొత్తయౌనిల్లంబొ
గోని వానలోఁబోవు కొంటెపిల్ల
తడికాగితముతోఁడ పడవసేయుమటంచు
పడియేడ్చుచుండు దుందుడుకుకొడుకు
పంతులుకట్నంబు పప్పుబెల్లాలకై
పడివచ్చుపంతులు బాలికలును
అత్తవారింటివంటల నారగించి
యోరజూపుల బరపుచు నొకరినొకరు
తమిగనుంగొనియెడి నూత్నదంపతులును
వరలుచుందురు దసరాముసురులయందు.

# శాంతమతి

కీ. శే. ఆలూరు వాసుదేవయ్యగారు

మఱియు

శ్లో. శుశ్రూషతే ముదాయాకాంతం| దీనంప్రదూమపిమవనీ
గడులంబధిరంకుబ్జం| భర్తారంసాపతివ్రతాఖ్యాతా.

అను నార్యోక్తిపలె భర్త గ్రుడ్డివాఁడైనను, దారిద్రుఁడైనను, చింతాక్రాంతచిత్తుఁడైనను, రోగపీడితుఁడైనను, బధిరుండైనను, కుంటివాఁడైనను, దుశ్చరిత్రుండైనను, సంతోషంబున నాతనికి నేయింతి శుశ్రూషాదులొనర్చుచుండునో యయ్యింతిమిన్నకుఁ బతివ్రతారత్నంబను నామంబు సార్థకంబగుచున్నది. కాఁబట్టి యట్టి మహాపతివ్రతయగుటంజేసి యాపత్సమయంబున "ఆత్మవత్సర్వభూతానా"మను నీతింబాటించి నన్నుఁగాపాడె. మఱియు నావిప్రోత్తముఁడా పెకు బదులాడనివాఁడు, నిష్కపటాత్ముండు; సదాచారుండు, కారుణ్యసాగరుండు. అవిప్రదంపతు లీపురంబున నెన్నాళ్ళుగ నాప్రాఁతసత్రములో బిచ్చంబెత్తుకొని జీవించుచు దారిద్రపీడననుభవించువారో తెలియకుండె. అట్టివారింబోషించుటయగదా జన్మపావనము? అట్టివారిం బ్రతిదినంబును దర్శనంబుచేసుకొనుటవలన బార్వతీపరమేశ్వరులను గనులారంజూచునట్లు, వారిపాదధూళి దేహంబునంబడిన గంగాస్నానంబుచేసినట్ల గాదె? ఇదియునుంగాక భూలోకంబున జనులకుఁ బలుతెఱంగులగు వెఱ్ఱిత్రోవలుగలవు. వినుము. ధనంబుండినను, లేకుండినను మనంబున నిది యుత్తమకార్యంబనితలంచి దయార్ద్రహృదయులై యిచ్చుటలేదు. ప్రతిష్టకు ధనంబొసగుచున్నారుగాని తమ జన్మపావనంబునకుఁ జేయువారు లేరు.

సీ. ధనవంతులుగఁజూచి దగుగౌరవముచేసి దానమిచ్చెద రది దానమగునె?
చోరులుకొట్టెడుచోట సత్రంబులు గట్టింతు రది ధర్మకార్యమగునె?
పదిగురు మెచ్చఁ దాఁ బదివేలు తమవారి కిచ్చెద రదియు దాతృత్వమగునె?
పేదవాండ్రనుబాధపెట్టి విత్తముగూర్చి యొలమిగుళ్ళకొసంగ నీవియగునె?
గనుక యోకాంత! యితరులుగాంచి మెచ్చు
కొఱకుఁజేసెడునీవుల గుణముగలదె?
పెక్కుచిక్కులలోనుండు పేదవాండ్ర
కిచ్చిరక్షింపఁ గడుపుణ్య మెసఁగుజగతి.

ఇదియునుంగాక యెవరు తమయాపత్కాలమునందుఁదోడ్పడి తమప్రాణంబులుగాని యొసంగెదరో, యెవరు పరులకు నుపయోగమగు కార్యములుచేసి తమపేరుల వెల్లడిసేయింపకయుందురో, యెవరు పేదవాండ్రనుజూచి తిరస్కరించి మాటాడక యసూయపడక మేలయినయోర్పుతో రక్షింపఁజూతురో, అట్టివారు దేవునిదయాపాత్రులై శాశ్వతసౌఖ్యం బనుభవింపకమానరు. మఱియుఁ గొందఱు ధన మూరకవ్యయమొనర్చి "మేము నాల్గుదినములు సత్రములో నన్నదానముచేసితిమనియు, నెలదినములప్పుడు మాయూరిదేవాలయగోపురము గట్టించినామనియు, మావారియిండ్లలో నెవరుగాని మాతాతతద్దినంబునకు బ్రాహ్మణులకు

మేమిచ్చినట్లు శ్రద్ధగనిచ్చినవారులేరనియు, మఱియేదియో యొక ప్రతిష్టవచనంబులు డంబంబుగఁజెప్పుచుండెదరుగాని యోచింప నిజముగ డంబముమాని యుపకారముచేయువారరుదు. వేయిమందికి నఱకడుపునకుఁ గాలుకడుపునకు నన్నంబుపెట్టి, "మేముగూడ నన్నదానంబు చేసితిమనుటకంటెను, సత్రములుకట్టించి మేముగూడ సత్రములుకట్టించితిమనుచు నాసత్రములకువచ్చి దిగువారిచేత బాడిగలుతీసుకొనుటకంటెను, యోచించి యొకపేదకుటుంబమునకిల్లిచ్చి యెప్పటి కాకుటుంబజీవనంబునకుఁదగిన యేర్పాటుసేయుట, యెంతగొప్ప కార్యము? కాఁబట్టి

శ్లో. గణ్యన్తే పాంసవోభూమౌ గణ్యన్తే వృష్టిబిందవః
నగణ్యతే విధాత్రాపి బ్రహ్మసంస్థాపనాత్ఫలమ్.

అనునట్లు భూమియందలి దుమ్మునైన లెక్కపెట్టనగును. వర్షబిందువులనైన లెక్కింపవచ్చును, గాని యొకపేదవిప్రునకు జీవనాధారముగలుగఁజేసినఫలము బ్రహ్మదేవునికైనను లెక్కింపనలవిగాదు. బ్రాహ్మణుఁడనియుగాదు. మఱియేకులమువారైనను పాత్రమెఱింగి రక్షింపవలయు. నేనింతవఱకు నొకరుచెప్పినట్లువిని నిష్ప్రయోజనకార్యంబులుచేసి యర్థము వ్యర్థమొనర్చితిని. ప్రతిష్ఠకుఁజేసిన యీపనులనియిపుడు బాగుగనెఱింగితిని. ఇఁకఁబరోపకారము చేయువారికి శక్తికొలఁదియుపకారము చేయఁదగినది. అని చెప్పి యాపదలోఁదన్నుఁ గాపాడిన సత్రములోనుండు పేదవిప్రదంపతులనురావించి వారికి రమ్యగృహంబొకండిచ్చి జీవనంబునకు మించునట్లుగ సంపూర్ణజలాధారమగు చెఱువుక్రింద భూమిని శాశ్వతంబుగ ననుభవించునట్లు దానశాసనంబు వ్రాసియిచ్చి పిదపఁదానాహారంబు పుచ్చుకొనెను. కావున నాపేదవిప్రదంపతులకు నెట్లు దేవుఁడుసాయముచేసెనో యట్లు మనమొక్కరి మేలుగోరుచుంటిమేని యట్టిమేలు మనముపొందకమానము. ఇంతకు దైవసహాయ్యసమయమురానిది మనప్రయత్నము లొక్కటియేని యగుటలేదు. మీరెట్టికొఱమాలినశంకలు పెట్టుకొని చింతింపవలదని చెప్పుచుండుసమయంబున నాపట్టణముననుండు నొకధనికుండు దుర్దశవలన ధనము పోఁగొట్టుకొన్న వాఁడగుటంజేసి "తలదగిలితేగదా తడవిచూచుకొనుఁ" నన్నట్లు కష్టమువచ్చినందున నితరుల కష్టపాట్లనెఱింగి దయార్ద్రహృదయుండగుటవలన నాతఁడా సత్రమునకువచ్చి, మాటాడుచున్న శాంతమతిభానుగుప్తులంజూచి వారిమాటలుకొంతవిని శాంతమతితోనిట్లనియె:

దామోదరగుప్తుఁడు శాంతమతిపలుకుల కానందించి ప్రోఁతగుడిసెనిచ్చుట.

అమ్మా! నీవింతవఱకుఁ జెప్పుచుండిన మాటలవలన నెంతయుసంతసంబుగల్గె. [illegible]విన నెంతవారికిఁగాని భగవంతుఁడొకకొఱంతనిడియున్నాఁడు. "హంస బ్రహ్మకు వాహనంబయ్యును దామరతూండ్లఁదినక యున్నదే? యట్ల వారువారనుభవించవలసిన విధిప్రకారము ఆయాకాలమువచ్చినపు డనుభవించితీరవలెను. కాలమురానిది మనప్రయత్నములు కానేరవు. "బండిచక్రముదిరుగునట్లు" ఈజగంబునఁ గాలవశమువలనఁగొన్నాళ్లు ధనికులు

గను, గొన్నాళ్లుదరిద్రులుగను, జనులుసుఖదుఃఖంబు లనుభవించుచున్నారు. అంతయేల? మేముండిన ధనసౌఖ్యముకంటె లేదు. అట్టిధనసౌఖ్య మెందుఁబోయినదో తెలియులేదు. దారిద్ర్యకాలమునగదా ధనగర్వసౌఖ్యాదులు తలంచుదురు! అట్లు మేము ధనముండు కాలంబున నెంతగర్వమునొందియుంటిమో యఁతయు మఱపురాకుండునట్లు కష్టమనుభవించుచున్నాము. ధనముండుకాలంబున నొకరికి నుపకారము సేయుటకుమనస్సొడఁబడకుండె. ఇపుడట్లుసేయుటకుఁ జాటవములేదు. అయిన నీశ్వరసంకల్పంబునకు నెవరేమిసేయునదిలేదు. అతనిదయ నెంచవలయునుగాని యూరకచింతించినచో నేమియగును? అనిచెప్ప శాంతమతి యిట్లనియె:

అన్నా! నీవెవరు? నీపేరేమి? యనియడుగ నతండు శాంతమతితో "అమ్మా! నేను వైశ్యకులసంజాతుఁడను. నాపేరు దామోదరగుప్తయని యందురు. నేనీపట్టణముననుండువాఁడ. నీసత్రము నాతండ్రికట్టించినవాఁడు. నేనపుడైన నొకదినమిటకు వచ్చిపోవుచుండుటఁ గలదు." అనఁగవిని శాంతమతి యిట్లనియె:

అన్నా! నినొక్కటివేఁడుదాన. ఎన్నికార్యంబులున్ననుమాని వెన్నడి నాయెన్నిక నిండారఁజేయుము. మేము కడుపేదవారము, పత్నులకైన నొకవృత్తమునివాసంబుగ నుండునుగాని, మాకు నొకయావాసంబులేదు. అన్నపానంబులకు లేకపోయినను, చిన్నగుడిసెయొండు నుండవలయునుగదా! యనఁగ నాదామోదరగుప్తుండువిని "అమ్మా నీవిపుడుచెప్పిన సంగతి నామనమ్మునకునచ్చినది. కానిమ్మ నీయిష్టమ్మునకుఁ గొఱంతరాకుండ నిప్పుడచేసెద. అనికొండొకతడవాలోచించి మీరు జీవనముచేయుటకు నొకవ్యాపారము పెట్టుకొని యుండుటకుఁదగుచోటుగలదు. అందొకగుడిసెయుఁ గ్రొత్తగఁ గట్టఁబడియున్నది. మీరాయింట బాడిగలేకుండ నెన్నాళ్లయిననుండుఁడు. నాకుమంచికాలంబుగ నుండినచో నాగుడిసెనింకను బాగుగఁగట్టించియిత్తును. కానిమ్మిపుడేమి? అనిశాంతమతీ భానుగుప్తుల నాగుడిసెకడకుఁగొంపోయి యందుండనియమించి యాసమయమునఁ దనచేనుండిన పదివరాలనిచ్చి యేదైన నొకవ్యాపారముచేసికొనుఁడనిచెప్పి తనగృహంబునకేగె.

అంత శాంతమతి భర్తంజూచి "నాథా! చూచితే భగవంతునియేర్పాటు? మనమూరక యూరెల్లఁదిరిగివచ్చినను దలంచినకార్యంబయినదే? దేవు డెప్పుడు సజ్జనహృదయనివాసుఁడై యట్టిమహాత్ములమూలంబుగ మనబోటిదీనులను గాపాడఁజేయుచున్నాఁడు. కాఁబట్టి మనమిపు డాదేవునిధ్యానించి యీగుడిసెంజేరి కాఁపురంబుసేయుదము."అనిచెప్పి యిద్దఱు దేవునిధ్యానించియయ్యింటంజేరి యేదియొాతగిన యుప్పు బప్పు వ్యాపారము చేసికొనుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు శాంతిమతి భర్తతో "ఆత్మేశ్వరా! నేనింటనుండి పక్కలాకులమ్ముచుండెదను. తాముప్పొత్తుకుని యందందుఁగల పల్లియలకుంజని ధాన్యమునకమ్మి

యెత్తుకొనిరమ్ము. వచ్చునపుడు చేతియందేదేని యొకరాయిగాని, కసువుగాని, కట్టెపుల్లగాని, కాయలుగాని, యాకులుగాని, కట్టకడ నొకచచ్చినచిన్నజంతువుంగాని యెత్తుకొనిరావల యును. మనకులమువారిలోఁ గొందఱుపెద్ద లీప్రకారము జరుపుచుండిరని వినియుండుట చేతఁ జెప్పితిని" అనిచెప్పుటంజేసి యాతండట్లుసేయుచుండె. శాంతమతి వక్కాడు లింటి పట్టుననుండి యమ్ముచు నప్పులేకుండ దొరికినలాభమున జీవనంబుగడపుచునుండె.—కొదువ.

# పలనాడు

ఏటుకూరి వేంకటనరసయ్యగారు

సింగినాద మొక్క జీలగసన్నాయి
గుబులుగొల్పుజమిలిగొప్పదుంజ
ఉల్లభంబుక్రిందఁబిల్లలసందడే
పెళ్లి నాఁటిజోరు పల్లెనాట.
కారుపోతుబలులు కాట్రేనిపంపులు
వాడలమ్మ సేవ కోడిపోరు
వీరపూజ రోజు వీథిభాగవతాలు
త్రాగిరచ్చపట్లఁ దండనాలు.
ఏడుముళ్లకంప ఎబ్రాసిజడికంపు
కోనలందు నాపచేనులందు
ఇంటిముందుచోళ్లు ఎంగిలికంబళ్లు
రాళ్లమీఁద కండబళ్లమీఁద.
పరమభాగవతులు బైనీడిమొనగాండ్రు
గొల్లబాబులెల్ల గోత్రపతులు
సాలె చాకి సాకి సర్వస్వతంత్రులు
బిచ్చగొంటులెల్ల పెద్దప్రభులు.
గుంటికానుపైన గూబగూర్చున్నచోఁ
బాలుపోసి గడ్డ పారఁజొడిచి
బందుగట్టి వతఁడె బైరాగిచిటికెలో
అందువేసినట్టి మందుచేయు.
కాలికంచమీఁదఁ గండువాచొల్లెంబు
కాసికట్టు చేరఁదీసిబొట్టు
కట్లకఱ్ఱచేత గంటలుయుంకేలఁ
గలుగునతఁడె మంత్రగాఁడునుండి.
పింజకట్టుతోడి పిఱిముట్ట మెలచుట్టు
చుట్టముక్కసాటు చొంగనోట
పిల్లపోరిచంటఁ బిల్లుబెనువెంటఁ
గన్నుబున్నుమనుచుఁ గదలునింట.
పాలపూసపేరుపైఁ గొల్క మైజారు
అడ్డిగలకు గుబిలితెడ్డుప్రక్క
బొందుకట్టుమీఁద సందడుతలకట్టు
గుంటిపడఁగనడిచె గొల్లపడుచు.
వాటుకరుపుదండి వడ్డాణపుందీగె
పేటులేనికమ్మ వాటుకోక
కన్నుమూసినట్టి గాజంగరంబులు
కాలికుఱికిఁ జెప్పు గలదెధన్య?
తిక్కపీడె "మార్టి" ధీయంచు మెలిపెట్టు
బూరెవోలెబుగ్గ పొంగిపోయెఁ
జంటివానిరెండు ఝాడించి పట్టింటఁ
కునిసికునిసి యూమిసెఁగుమ్మరక్క
చికిలికన్నులందుఁ జెందుకాటుకతోడ
బారదేసి కురులభరముతోడ
గాడిబావిమీఁద గల్లనగం తెరా!
వాసిగలద రెడ్డివారిబిడ్డ.
నీరుకావికోక గోరంచుదిగలు
సాగనుగుల్కు చిన్నిముక్కుబొట్టు
పసిమిదేరుచున్న బంగారుగాజుల
కమ్మపిల్ల గాదు కనకవల్లి.
"తిగదుగి త్రిపంచ దిద్దుచుండుమగని
పొగరునడల" నెడ్డె సగలుసడల
కొసరికొసరిపల్కు కోమటిమాచక్క
సేర్పుసంధిలంగఁ గూర్పునెదర.
చికిలిచేసిన తామ్రంపు జెఱఁగుమాసె
కండువారినదే పోముచందమామ
ఊరకేచూడనేల బాజారునైపు
కేవుజారినదోయి? భూదేవపుత్రి!
ఘల్లుఘల్లుమనెడి కంకణహస్తాల
రంయ్యిరుంయ్యిమనెడి రాట్నములను
బారఁదీయుచున్న పైదలికంఠానఁ
బరుగులెత్తుచుండెఁ బల్లెపదము.



ఆంధ్రస్త్రీల ఆయురారోగ్యసౌభాగ్యములను పెంపొందించుటకై ప్రచురింపబడుచున్న ఏకైకసచిత్రమాసపత్రికయగు 'గృహలక్ష్మి' కార్యాలయము.



గృహలక్ష్మి సుందరముగ ముద్రింపబడు లోధ్రాపవరు ప్రెస్సు కార్యాలయము. 33, పోలీసుకమీషనర్సు ఆఫీసురోడ్డు, ఎగ్మూరు, మదరాసు.





కేసరిగారి లోధ్ర, అమృత, అర్క అను ఔషధరత్నత్రయమును, ఇతరసుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధములను తయారుచేయు శాలదృశ్యములు.

123, పూనమల్లి హైరోడ్డు, ఎగ్మూరు, మదరాసు.



'రివోల్టు ఆఫ్ యూత్' నందు
నిర్మలా కన్య పాత్ర

 **స్త్రీలు : గృహపరిశ్రమలు** 

# కర్పూరపుదండలు చేయువిధము

శ్రీమతి సూరత్తు నాగమణిగారు

మనకు కావలసినంత హారతికర్పూరము తెచ్చి ఇత్తడిచట్టిలోవేసి పళ్ళెములోనీళ్ళుపోసి చట్టిమీదపెట్టి ఆచట్టిని మండుచున్న పొయ్యిమీదనుంచవలెను. గాలిపోకుండునట్లుపళ్ళెములో నొకబరువునుంచవలెను. కొన్ని నిమిషములకు ఆచట్టిలోనికర్పూరముకరిగి నీరై ఒకవిధమైనశబ్దముపుట్టును. అది అంతయు ఆవిరిరూపముగాపైకిలేచి పళ్ళెమునకంటుకొనును. అట్లుఅంటుకొనినవెంటనే శబ్దముఆగిపోవును. వెంటనే పొయ్యిమీదచట్టిని పళ్ళెములోకూడా జాగ్రత్తగాదింపి గుడ్డతో పళ్ళెములోనున్ననీరును క్రిందికిపిండివేయవలెను. జాగ్రత్తగా పళ్ళెముఎత్తినయెడల స్వచ్ఛమైనకర్పూరము పళ్ళెముఅడుగుకట్టునకంటుకొనియుండును. దానిని శుభ్రమైనతెల్లగుడ్డలోనికి చాకుతోతీసికొనివుంచవలెను. ఇట్లుతయారుకాబడినకర్పూరము మైనమువలె కొంచముమెత్తగాఉండును. ఉండలుచేయుటకు అచ్చులుబజారులోఅమ్మెదరు. వాటిని ఇత్తడితోగాని కొయ్యతోగాని కొమ్ముతోగాని చేయుదురు. బజారులోదొరకనియెడల మనము చెప్పిచేయించుకొనవచ్చును. వామనగుంటలు ఆడుకొనుటకుతయారుచేసిన అచ్చువంటిఅచ్చుమోస్తరు రెండుముక్కలుతయారుచేయుదురు. చిన్నగుంటలుగా తయారుచేసెదరు. ఉసిరికాయలవలె పలకలుగాతయారుచేయుదురు. కర్పూరము అచ్చుకు సరిపడేటంతవుండగా చేసి కొత్తగుడ్డలోచుట్టి అచ్చులోపెట్టి పైనసగముఅచ్చుమూతపెట్టి సుత్తితో పైనకొట్టి మూతతీసినయెడల నదిగోళీవలె గుండ్రముగానగును. అగోళీని పైనిచెప్పినరీతిగా వుసిరికకాయఅచ్చులోవేసి కొట్టినయెడల నది రాచవుసిరికాయవలె గుండ్రముగాను పలకలుగాను తయారవును. అట్టిఅచ్చులలోమనకు దండకుకావలసినవన్ని గుండ్లుచేసుకొని ఎర్రగాకాలిన సన్ననిఇనుపకడ్డితో వాటికిరంధ్రములుపొడువవలెను. తరువాత వాటినన్నిటిని ఒకపేనినతెల్లదారమునకెక్కించి తెల్లనిగుడ్డమీద నెమ్మదిగాత్రాయగా నవన్నియు నునుపుగాను కాంతిగాను రంధ్రములుచేయునపుడు పడినబొడిపెలువగైరాలుపోయి సాపుగానువుండును. దారమునకెక్కించివుండలు ఒక్కొక్కవుండజరిపి, ఒక్కొక్కదానిమధ్య పకసారి గులాబిపూలుతో కుచ్చువలె కట్టి ఇంకొకవుండజరిపి ఆకుపచ్చపూలుతోను కుచ్చువలెకట్టవలెను. ఒకవుండతరువాత గులాబికుచ్చు. తిరిగి వుండ ఆకుపచ్చకుచ్చు. ఇదేమోస్తరుగా కట్టినయెడల దండతయారగును. చివరను రెండుదారములుకలిపి ముడివేసి గులాబిపూలు కొంచముపొడుగుగాను లావుగాను కట్టి కుచ్చువలెకత్తిరించవలెను. కుచ్చులవలెకట్టిన పూలువుండలన్నీ సమముగాకత్తిరించుకోవలెను. అప్పుడు అందమైనకర్పూరమాల తయారవును. ఇట్లు మనకు కావలసినట్టు పెద్దవిగా చిన్నవిగా వుండలుతయారుచేసుకొని జరీపోగులతోను పక్కీలతోను గాజుపన్నెల పూసలతోను రకరకములమాలలు తయారుచేసుకొనవచ్చును. శుభకార్యములయందు మనము సొంతముగా తయారుచేసుకొనవచ్చును. కర్పూరము వుండలుచేయునపుడు మురికి అంటకుండా చేతులు పరిశుభ్రముగా చేసుకొనవలెను.

# ఆమె పాదార్చనమే దివ్యామృతము!

బులుసు వేంకటేశ్వర్లుగారు బి. ఏ.

ఆమె సత్కులప్రసూత. గృహస్థధర్మమర్మజ్ఞ. సంతానవతి. వేదార్థచోదితకర్మాచరణపరాయణు నిల్లాలు. లావణ్యరాశి.

ఆమె అరుణోదయసమయమునకు స్వహస్తములతో వాకిలినూడ్చి, ముగ్గుదిద్ది, గోదావరీతీరమున, నదీమాతను, తన ప్రార్థనానినాదముచే నిద్రనుండి లేపును. స్నానమాడి, అరుణభానుకిరణపుంజములచిందువందఁజేయు కుంకుమతిలకమునుధరించి గృహముజేరి యాగృహము లక్ష్మీనివాసమాయనిపించును.

నాథుఁడు నదిలో సూర్యతర్పణమొనర్చి నట్టింటి కరుదెంచునప్పటి కామె తనమృదుమృణాళపాణిపల్లవములతో నీరువోసి, తనబాలురకు స్తన్యమిచ్చి పెంచినట్లు పెంపఁ బుష్పించిన దొడ్డిలోని కుసుమములనుఁగోసి దేవతార్చనకు సిద్ధముచేయును.

పతి "ధర్మపత్నీసమేతస్య, మమఉపాత్తదురితక్షయద్వారా, శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం" అని యర్చించిన దేవపాదోదకముతో నాథార్చితలోకనాథపాదకుసుమావళిని భక్తిభరితహృత్కుసుమసౌరభముచే జోడించి శిరంబునఁదాల్చును.

అతిథి, అభ్యాగతులకై రెట్టింపువంటలో నిమగ్నయయ్యు, నొకవంక నంగలార్చు పసికూనలకు స్తన్యమొసగుచు, భిక్షార్థులై వచ్చిన దరిద్రనారాయణుల ఆర్తనాదములు విన్నంతనే వారినొకవంక తృప్తిచేయుచు, శిష్యకోటికి గృహ్యసూత్రములలోని యంతరార్థము బోధించు నాథునివాక్యము లొకవంక కేంద్రీకృతదృష్టితో వినుచు, మధ్యదొడ్డిలోని కరిగి, జగత్సాక్షికి చేతులుజోడించి, తులసికన్నియకు బొట్టుపెట్టి, ప్రదక్షిణమొనర్చుచు, మధ్యందినముదాటకమున్నే వంటయయినదని తలుపోరగానిలచి నాథునాహ్వానించు నామె.

ఆమె అతిథిదేవులకర్పించి, పరమేశ్వరునకు నైవేద్యమిడి, భర్త తాను తృప్తితీర భుజింప, పిల్లలకువడ్డించి, యిట్లు, అతిథిదేవ, పతిదేవ, లోకదేవతృప్తికాఁగా మిగిలిన యుచ్ఛిష్టమును భుజించును.

భోజనానంతర మొకింతవిశ్రమించి, యూరిలోని సోదరసతీమణులఁబిలచి, శ్రీమద్రామాయణ, భారతభాగవతములలో నొక్కొక్క కథచదివి, విశేషార్థములతో వానినిఁజర్చించి, సీతామహాసాధ్వి చూపిన దుస్సహరాక్షసక్రౌర్యమును నిర్వీర్యమొనర్చు సాటిలేనిశాంతమును వర్ణించుపట్టున, దుష్టదుశ్శాసనక్రూరకరకీలితవస్త్రయై సనాథయయ్యునాథపోలె, శ్రీకృష్ణపరమాత్మలో లీనమొనర్చిన యాద్రుపదపుత్రీతీవ్రమనోద్రఢిమ అక్షయవస్త్రవిజయము కొనిత్రియామా ధునత్తజే, తుచ్ఛసోదరనిశ్చితవివాహనామకవిషముహూర్తమాసన్నమౌతటి గోపాలునిరాక యేమగునోయని సాగరము ఘూర్ణిల్లునట్లు పరితపించు రుక్మిణీరమణి

హృదయావేగము ప్రదర్శించునవ్వేళ, ఒడలు చెమటలుగ్రక్క ఊహావిమానయాత్రచేఁ దన్మయత్వమందుచుండు నామె.

ఆవెనుక నూరిలో నేకులమందైన, నేగృహమందైన, నేతల్లియైన, నేకారణముచేనైన, నేదుఃఖమునన్నున్న వెంటనే సోదరీమణులఁ దోడ్కొనిపోయి, అమృతముచిందు, నామయము చెదరు ఉపశమనవాక్యముల నూరడించి, ఆమెయింటికేతెంచు.

ఏతెంచి మఱలవంటచేసి, అనుకొనివచ్చు పిల్లలముద్దిడి, లాలించి, అన్నముపెట్టి లోకవ్యవహారములఁజిక్కి, ఖేదమనస్కుఁడై వచ్చిన భర్తను దరహాసచంద్రికలలో స్నానమాడించి, ప్రేమపూరితవిలాసవాక్యములు పల్కుచు, ఆమేదనాపనోదనవిషయముల ముచ్చటించుచు, మృష్టాన్నమిడి, తాను నిత్యము నిష్టదేవతామందిరమలంకరించునట్లు, శయ్యాగృహ మలంకరించి, నిముసములో భుజించి, వంటయిల్లుబిగించి, యింకను నిద్దురచెందక విలపించు పిల్లలనొకసారి స్తన్యమిచ్చి ప్రక్కనొరిగి, నిద్రంగొట్టి, తనరాకకై వేచియున్న భర్తశయ్యామందిరముచేరి, ప్రేమామృతముచింది, పెరటియావునేతితో సల్పిన క్లుప్తాహారముల పళ్లెరమందుంచి, యొకవంక నాథు నోటికందిచ్చుచు నింకొకవంక పాదము లొత్తుచు, నొకగేలవిసరుచు, మధ్యనొకసారి పతికొటికియిచ్చిన పదార్థముల ననిష్టప్రదర్శన లాలిత్యమునఁతప్పక రుచిచూచి, మఱలనాథునకందిచ్చుచు, లోకవ్యవహారమునకై, పతివేఱు, సతివేఱు ననుద్వైతమును పగలెల్ల లీలంజూపుచు, ప్రకృతియు నడిరేయి జాగ్రత్స్వప్నావస్థలదాటి సుషుప్తిలోఁబడుతఱి, తురీయావస్థననుసరించి, అద్వైతసిద్ధినిస్థాపించి, క్షేత్ర క్షేత్రజ్ఞ జీవేశ్వరసంయోగనిర్వికల్పాద్వితీయావస్థలో ననిర్వాచ్యానందసచ్చిదానందసాగరమున, "ఆనందో బ్రహ్మేతివ్యజానాత్" అను సూత్రానుగుణముగా పరమహంసవలె నీదులాడు నామె.

గీ. ఆమెపదమిదు గృహమే యా నమరసీమ,
ఆమెగవఁజాలు జాతియా నమరజాతి,
ఆమెకేల్పట్టుపతియె సురాతిపతియు,
నామెపాదార్చనమ్మె దివ్యామృతమ్ము.

## రమణమ్మ

సామవేదం జానకిరామశర్మగారు

[రమణమ్మ బొబ్బిలిరాణియైన మల్లమదేవికిచెలికె. దామెర్ల ధర్మరాయనిపత్ని. బొబ్బిలికోటలో నాఁడుజరిగిన సంఘమరణసమయమున ఈమెనిండుచూలాలు. నాటికథ ఇది]

బొబ్బిలికోట చేవదలిపోయెనుకాలమురాఁగ వైరి పె
ల్లుబ్బుచు నాజిలో వెలమయోధులఁజంపఁగ, రంగరావు తా
నిబ్బరముంద్యజించి "రమణీమణులెల్లర నూచముట్టుగా
బొబ్బిలికోటనే నలుకఁబొమ్మ"న మానధనై కరక్షకై.

కలుకుఖడ్గమ్ముఁబోలె నిక్కరుణుఁడై స
రసరాయఁడు తద్వాక్యసరణిఁగొనుట
సాహసమర్థమైన తద్బాహుశౌర్య
మంగనాజనసంహార మధ్యసిఁ జె
ఆకరవాలమెంతపదునై నదో! వెల్మసతీసమూహము
న్నాకమునందు నందనవనమ్మున నాథులకౌఁగిలింతలో
నేకమొనర్చె నొక్కత్రుటి నెట్టినిరక్తపుటేటనీదుచున్
భీకరుఁడయ్యె. చిత్తమతి భీష్మతనొందగసర్వరాయఁడున్.
అతనిప్రమోల ఖడ్గమున కాహుతికాఁగ శిరమ్మువంచి, వి
ఖ్యాతసతీలలామ, రమణాంబ పతిందలపోయుచుండి, గ
ర్భాతిభరమ్ముచే నిలువనయ్యెడనోపక "వీరపుంగవా!
చూలము నీకటారిపస చూపుము శీఘ్రము"యంచుబల్కనన్.
ఒక్కకోననుండి ప్రాణాలనుక్కడంచి
సత్వరమువచ్చుచున్న నృశంసుహస్త
మెత్తినదియెత్తినటు లహీనమంత్ర
ముగ్ధమగు నొక్క విషధరమూర్తిఁదాల్చె.
"నెలలునిండీనచూలాలు నిలువనోప
దకట!" యనుజాలియొకఁడొచ్చి యతనిజాతి
గుండెకరిగింపఁజేసిన ఘోరపాత
కమ్ముఁదలపోసి నిలువెల్లఁగంపమొందె.
అతఁడెలుఁగింపు ఖంగుమని హస్తమునుండి కృపాణమెట్లుగా
క్షితిపయిఁబడ్డదో అతనిఖిన్నతగాంచినయామె "శూరుఁడా!
మతిఁదలపోయుమా వెలమమానిని మానధనమ్ముపొంటె జీ
వితమునులెక్కచేయదను విస్తృతవాక్యము"టంచుఁబల్కనన్.
ఆపలుకాలకించి యతఁడట్టులె చేష్టలుదక్కియుండఁ దా
నే పడియున్నకత్తిఁగొని నేరుపుతో గళసీమఁగ్రుచ్చి సం
తాపము రూపుమాపుకొనెఁ దా రమణమ్మ దివౌకసాళి "ఆ
హా! పరమాద్భుతంబ"నుచు నభ్రమునుండివచింప నొక్కటన్.
కత్తిధరింపలే దరినికాయమునాశమొనర్చి వారిసం
పత్తిఁగొనంగ కేవలముపట్టిన దాత్మకులాభిజాత్యసం
పత్తికిరక్షవెట్టఁగ కృపాణము తుచ్ఛపుజీవితమ్ముపై
హత్తక చిత్తమట్టి రమణమ్మచరిత్రకు నంజలించెదన్.

# పండుగ ముచ్చటలు

కందుకూరి రామభద్రరావు గారు

౧

"మొన్న మానాన్నవస్తే మనంకలిసివస్తామని సాగనంపేరు. మనంపండగకువెళ్ళడంమాటయేమిటి?" అని రమణ కాటుకకన్నులతో చులుకుచూపులుచూచి, తాంబూలారుణరాగముతో వియ్యమందిన మధురాధరమున రుచిరహాసములదొడగినది. పందిరిమంచము మీఁద నొయ్యారముగాఁ బండుకొని వార్తాపత్రికఁ జదువుచున్న నారాయణరావు విననటులనటించి కిమ్మనలేదు. బారెడుదూరమున టేబిలుమీఁద పింగాణి "వేస్"లో నగరువత్తులనంటించి, పేముకుర్చీలోఁగూర్చుండి యెదుట నిలువుటద్దములోఁ జూచి సవరించుకొనుచు "మాటాడరేఁ" అన్నది రమణ మెల్లగా.

"ఆఁ ఏమిటీ?" అన్నాఁడు నారాయణరావొక పత్రముఁ దిరుగవైచుచు.

"ఇలాంటిమాట లసలువినఁబడవు మీకు పాపం"

పత్రికమడచి టేబిలు మీఁద పడవైచి, లేచి కూర్చుండి నారాయణరావు "నువ్వొళ్ళంగారించుకొని ఆకుర్చీలోకూర్చుంటే రతీదేవిలాగున్నావు. ఆలేఁతగులాబీరంగుచీర, అద్దకపుంచు పొట్టిచేతుల రవిక, పలకసరములు, ఆ వదులువాలుజడతో ఆసలే చక్కనిచుక్కవైన నిన్ను చూస్తే-" అన్నాడు.

"మీరుమాత్రము లేకేమిటి మన్మథమూర్తిలాగ. ఆప్రక్కపాపిడి ఉంగరాల క్రాపింగుతో, స్పోర్టింగుషర్టుతొడుగుకొని, పేటంచు తెల్లపంచకట్టుకుని, గుండ్రని ముఖాన్ని నిలువుబొట్టుపెట్టుకొని, మంచంపడు మెక్కి ఆవిశాలనేత్రాలతో నావైపుచూస్తోంటే. ఈగొడవంతాయెందుకు? నా మాటకు సమాధానం చెప్పక?"

"ఏమిటినీమాట?"

"మనం దసరాపండుగకు వెళ్ళడం మాట."

"మనకిక్కడమాత్రం పండగ కాదూ? వెళ్ళేదేమిటి?"

"ఇంటిదగ్గిరపండుగలు లేకేనేమిటి ఆల్లుళ్లు అత్తారిళ్ళకెళ్ళడం!"

"మనకిక్కడుంటే సంతోషంగాఉండేటప్పుడెందుకనివెళ్ళడం?"

"సంతోషంలేకనా? మావాళ్ళనోమాటుచూడాలనుందినాకు." "మొగుడెంత ప్రేమగాచూచుకుంటున్నా ఆడదానికి పుట్టింటిమీదనే ఉంటుంది ధ్యానం. స్త్రీబుద్ధి కుక్కబుద్ధి."

"మరే. అది ఆడదానికేఉండదండి. మీరు బి.యె. చదువుతుంటే మనమిద్దరము రాజమండ్రిలో ఉండేటప్పుడు శనివారాదివారాలొస్తే మావాళ్ళని చూసొస్తానని తుఱ్ఱుమనేవారెందుకు? నేనంటే యిష్టంలేకనా?"

"అంతే. యెడ్డెమంటే తెడ్డెమనడ మొకటి నేర్చావు"

"నేనేమన్నాను? భార్యాభర్తలకి ప్రేమున్నా కన్నవాళ్ళమీదప్రేమవుంటుంది. ఆ ప్రేమ వేఱు, ఈప్రేమవేఱు అన్నామకాని."

"నా కీశ్రీరంగనీతులు చెప్పనక్కఱలేదు. ఈసారి వెళ్ళడంలేదు."

"ఊరికేఅంటారు" అని రమణ మందహాసముతో నోరచూపులుచూచినది.

"ఊరికేయేమిటినీమోహం? నిజమంటూంటే."

"ఈఒక్కమాటు నామాటవినండి" అన్నది రమణ దగ్గరకువెళ్ళి చుబుకము పుణుకుచు.

నారాయణరావు మొగమటుత్రిప్పినాఁడు.

రమణ ఆతని వదనసరోజము తనవైపుత్రిప్పుకొనుచు "నాకేసి యిల్లా చూడండి — సరిగ్గా — నవ్వకుండా" అన్నది.

నారాయణరావు కన్నుమన్నాఁడు.

రమణ తిరిగి కుర్చీలోకూలఁబడి "ఎప్పుడూ ఇదే సరసం" అని రోసరోసలాడినది. కనుకొలకలనుండి యశ్రుకణములు బొటబొట కారఁజొచ్చినవి. నారా

యణరావునకు రమణ కంటతడిఁబెట్టుట మనస్సు చివుక్కుమన్నది.

"ఎందుకాబుడబుడదీర్ఘం. అల్లాగే వెళ్ళవచ్చులే" అన్నాఁడు.

"మీయిష్టం. వెడితేవెళ్ళండి, మానితేమానండి".

"నేనూరికే యెందుకన్నానుకాని, నీకంతవెళ్ళాల నుంటే తప్పకుండావెడదాము" అన్నాఁడు మంచము దిగివచ్చి నారాయణరావు రమణకన్నులుతుడుచుచు.

"మరేఁ యీకాసేపు అలాగేఅంటారు. మళ్ళీ యెప్పటాటే" అన్నది రమణ.

"ఒట్టు. నీతోడు. సప్తమినాఁడు బయలుదేఱి వెడదాం" అన్నాఁడు నారాయణరావు.

గవాక్షమునుండి వారిసరసముచూచి నెలబాలుఁడు మందహాసమొనరించినాఁడు.

౨

వీథియరుగుమీఁద తుంగచాపలుజంటగావేయించి పేకాడుచున్నారు నారాయణరావు, మామగారు కుటుంబరావు, మఱిముగ్గురును. బడిపంతులు వచ్చి రెండవయరుగుమీఁద కూర్చున్నాఁడు. పిల్లలందఱు పంక్తులుతీరినిలబడి 'రాజాధిరాజ! రాజమార్తాండ!' అనుపద్యము రామం చెప్పగా వారందుకొని ఒకరికంటెఒకరు బిగ్గరగాఁజదువనారంభించిరి.

"మేష్టారూ! ఒక్కమాటాపుచేయండి. క్రింద రెండుచేస్తులున్నాయి" అన్నారు పంచముఖపురాణ పాఠకులలోనొకరు.

పంతులుచెప్పగాఁ బిల్లలందఱూరకొనిరి. ఆట పంపకమైనది.

"మజాగాఉందండి. పండుగ బేరం" అన్నారొకరు.

"ఏమండి మేష్టారు! మీరు గిలకలుపట్టించవచ్చా? అధికారులుచూస్తేతంటారాదూ? దశమినాడుకూడా విడిచిపెట్టకుండా తోముతున్నారు వాళ్ళని" అని ప్రశ్నించినాఁడు నారాయణరావు.

"రూలుప్రకారం పట్టించకూడదు. ఎదోప్రాచీనాచారం. మాకు పండుగకు మూడురోజులేనండి సెలవు. అందుచేత ఏదో యీమూడురోజులు తిరగాలి. మఱిమమ్మల్నివాళ్ళు వాళ్ళనిమేము నమ్ముకున్నప్పుడు."

"అయ్యా! ఈరోజులక్షన్లువచ్చాక బోర్డులు భండారాలమైపోయాయి. చివరకు కాంగ్రెస్‌పార్టీకేనా సిగ్గులేదు. పట్టణంలోకివస్తే రంగుబట్టచూచిన సంత పసువులలాగ బెదరి, పొట్టచింపినా అక్షరంముక్క లేని జేవయ్యలనందఱిని మెంబర్లుగా ఎన్నుకొని, అందులో యేఓబయ్యనో ప్రెసిడెంటుగా పెడతారు. వాడి యరకతరకలకు లెక్కలేదు. చూడండి స్కూళ్ళసెలవులికియెన్ని అవకతవకపుమార్పులవచ్చేయో యీమధ్య. వాళ్ళవాడు ఏకస్సెన్నో చెప్పేడని మేష్టర్లని యిక్కడనుంచిఅక్కడకు అక్కడనుంచి యిక్కడికి వడిసెలతో రెడ్డలువిసరినట్లు విసరడం."

"ఆడదామా? తీసేద్దామా? కుటుంబరావుగారూ! ఆమేష్టార్ని పంపించేయండి" అన్నారొకరు.

"కోపపడకండి. ఈయనికి పేకాటంటే సరి. తిండేనాఅక్కరలేదు."

పిల్లలుపద్యముమఱల నారంభించిముగించిరి. వెండి పళ్ళెరములోఁ గొబ్బరిబొండము తాంబూలము రెండు రూపాయలు పెట్టి శాంతమ్మ లోనుండి రామానికి సంజ్ఞ చేయగా రామంపుచ్చుకుని పంతులకందించెను.

పంతులుపుచ్చుకొని "కుటుంబరావుగారూ! మీపద్దువరహావేసుకున్నాం." అన్నాఁడు.

"ఈయేటికి అల్లాపోనీయండి. రిట్రెంచిమెంటు"

"మీకేఅల్లాగంటే యెల్లాగు?"

"తరవాతచూద్దాంలెండి."

పంతులులేచి వెళ్ళుటకు నిలఁబడినాఁడోలేదో రామంగిలకలబద్దసాచి, గురిచూచికొట్టినాడు బావ చెక్కిళ్ళమీఁద బుక్కా. రామందారితీసిన ముహూర్తమాత్రములో ముప్పదిగిలకలబుక్కా నారాయణరావును ముంచెత్తివేసినది. "ఆగండి, ఆగండి" అని నవ్వుచు వారినాపఁజూచిరి కాని ఆబాలానందము నాసమయమున బ్రహ్మఆపగలఁడా?

నారాయణరావు అత్తవారిచ్చిన క్రొత్తజామారు దులుపుకొనుచు, కళ్ళునలుపుకొనుచు, నోటపడినదాని నుమియుచు లేచి లోనికివెళ్ళినాఁడు.

"వసంతమూర్తిలాగున్నారే" అనినవ్వినది రమణ. అక్కడ చేరిఉన్న ఆడువారందఱు పకపక మన్నారు.

3

నారాయణరావుగదిలో టేబిలువద్దకూర్చొని వ్రాసి కొనుచుండగా రమణ వెనుకనుండి పిల్లియడుగులతో వచ్చి కన్నులుమూసినది. కలముబల్లమీఁద పెట్టి, కర కంకణములనుబట్టి రమణిని గ్రహించి రెండుచేతులలో శిరముపంచి చెక్కిలిముద్దుగొన్నాడు నారాయణరావు. రమణ చేతులువదలి "మంచి సమాధానమే. నేనెవరో చెపుతారను కున్నాను. నోటితో చెప్పక చమత్కారంగా చెప్పేరే." అన్నది నవ్వుచురమణ.

"చదువుకొని ఉద్యోగంలేకపోయినా యీమాత్రం చమత్కారం చేతకాదనుకున్నావా?"

"చదువుకుంటే చేతకాదు ఇల్లాంటిది. చదువుకున్న సన్యాసులు చాలామంది ఉంటారు. దానికేంగాని యేమిటిరాస్తున్నారు ఇందాకటినుంచి?"

"'గృహలక్ష్మి'కి వ్యాసంవ్రాస్తున్నాను."

"ఓహో! మీకవిత్వం! గృహలక్ష్మికివ్యాసం!"

"ఏం, అల్లాగంటావు. నీకేం తెలుసు నాసంగతి? కడసంతగుమ్మడికాయ కత్తిపీటకులోకువట. మగవాడెంతటివాడైనా ఆడదానికళ్ళకి దఫేదారులాగ కనబడతాడు."

"ఊరికేవేళాకోళానికన్నాను. దానికంతఉలుకెందుకు? ఆడదెంతటిదైనా మగవాడికిమాత్రం దాసీలాగ కనబడదు? పోనీలెండి-మీకుకోపమొస్తుంది. ఏమిటావ్యాసం?"

"'జమ్మిసవారీ' అనిదాని శీర్షిక"

"జమ్మిసవారా!" అని విరగబడినవ్వి "మీకు తగ్గట్టేఉంది. ఇదామీకు దొరికినవిషయం? ఏదేనా మంచికథవ్రాయాలి. అంతేకాని జమ్మిసవారేమిటి నా మొహం?"

"ఎద్దుకేం తెలుసు అటుకులరుచి? నేనెందుకువ్రాస్తున్నానో తెలుసా?"

"ఏదీకొంచెంచెప్పండి"

"మనదేశంలో గ్రామాలలో-అనేక సాంప్రదాయాలున్నాయి. అవి క్రమంగా నశిస్తున్నాయి. అవి మతసాంఘిక పౌరాణిక ఆదర్శాలతో పుట్టాయి. అవి యిప్పటికవులువర్ణిస్తే నవీనులకు వాటి యందభిమానం పుట్టి ఉత్సాహంకలుగవచ్చు. అదిగాకయీనాడు యిల్లాంటి ఆచారాలుండేవని, యీనాటిసాంఘిక జీవితంయిల్లాఉండేదని ముందుకొన్నితరాలుపోయిన తరవాత వాళ్ళకితెలుస్తుంది."

"ఔను. మీవ్యాసాలు అసలుఎవరేనాచదివితే, అమూల్యధనమని ఆచదివినవాళ్లు ముందువాళ్ళకో సందాచిపెడితే, మీరుచెప్పింది బాగానేఉంది."

"వ్రాసినవాళ్ళంతా మనవి శాశ్వతంగా ఉంటాయనే వ్రాస్తున్నారేమిటి? నాఉద్దేశమే నాకు ప్రాధానము కాని ఉంటుందా, ఊడుతుందా అని నాకెందుకు?"

"సరేకాని, దీన్నిగురించి వ్రాయాలనితోచినందుకు చెప్పాలి."

"మొన్న మీఊరెళ్ళినప్పుడు నేనూ చెప్పేను గా దానికి. గోపాలస్వామిఆలయంలోకి రైతులంతా రావడం. భజంత్రీలతోటి, కేఘంటానినాదంతోటి, 'గోవిందా' అనే పౌరధ్వనితోటి దేవుణ్ణిపల్లకీలో బయలుదేరదీయడం, అప్పుడే ఆరి అడుగులుపడిన దారిలో వరుసగానడుస్తూ గోదావరిఒడ్డున లంకలో జమ్మిచెట్టుదగ్గరకుచేరడం, దానికిపూజ చేయడం, ఆపూజానంతరం "శమీశమైతేపాపం,..." అనివ్రాసినతాటాకుముక్కలుకరణంగారుపంచిపెట్టడం, ముట్టదేమోనని రైతులు పోట్లాడిపుచ్చుకొని జమ్మికొమ్మలకు గ్రుచ్చడం, ఎన్నిగ్రుచ్చితే అన్నిరెట్లు పుణ్యం వస్తుందనుకోవడం, ప్రసాదంపంచిపెట్టడం, ఆసుషుప్త గౌతమి యీధ్వనివిని నిద్రలోకలవరించడం, ఆశరత్కాలదశమీచంద్రుడు రైతులతోపాటు నవ్వుతూ ఆనందించడం, ఆపచ్చనిపైరుల రంగవల్లులు చూచేటప్పటికి నావళ్ళుపులకించి యిది వ్యాసంవ్రాయాలనుకున్నాను."

"మీమాటలువింటే నాకుపులకిస్తోంది. ఏదిచదవండి?"

"ఇంకాకొంచెముంది. పూర్తికాగానే నీకు చదివి వినిపిస్తాగా."

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## జోలపాట

శ్రీమతి: పా క. ల. చంద్రకాంతామణి గారు

జోలలకు జొన్నబువ్వ, నాకు వరిబువ్వ
ఏడ్చేటి అబ్బాయికి తెల్లావుపాలు
హాయివారమ్మాయి నీళ్ళ కెళ్ళింది
పాలైన ఇవ్వవే ఓకుక్కపిల్లా
పిల్లమ్మవెళ్ళింది పల్లెల్లుదాటి
అబ్బాయి వెళ్లేను రచ్చల్లుదాటి
దొంతిమామిడిపండ్లు దూరానగలవు
దానిగట్టికోసిరే అబ్బిమామల్లు
అబ్బాయిమామలు ఎటువంటివారు
చెవిచెవినిచారడేసి పోగులవారు
అబ్బాయి అత్తలు ఎటువంటివారు
నోటినిండా పెద్దమాటల్లవారు
అమ్మాయిమామల్లు ఎటువంటివారు
మెడలనిండా రత్నహారాలవారు
అడ్డపాగాలవారంగీలవారు
వేడ్కగుఱ్ఱాలెక్కి వేటాడువారు
అమ్మాయి అత్తలూ ఎటువంటివారు
చేతితో ఒకపనీచేయనీవారు
ఆటమాణిక్యమే పాటమాణిక్యం
నట్టింటఅమ్మాయి రత్నమాణిక్యం
ఆడంగముద్దమ్మ పాడంగముద్దు
నట్టింటఅమ్మాయి నవ్వంగముద్దు.
చిన్ననాఅమ్మాయి చీరకేడిస్తే
నెయ్యిరాసాలీడ నేత్రానపట్టు
మురుస్తుసాలీడుమాణ్ణెల్లునేసు
అరుస్తుచాకలి ఆర్నెల్లువుతుకు
వేడుకతో అమ్మాయి వెయ్యేళ్లుకట్టు
ఆచీరకట్టంగ అందరికిముద్దు.
చదువుకొని అబ్బాయివచ్చెగాబోలు
సరస్వతీచప్పుళ్లు చావిళ్లలోన
ఆడుకొనిఅబ్బాయివచ్చె గాబోలు
అందెళ్ళచప్పుళ్ళు పందెళ్ళలోన
సానివీధులవెంట అబ్బాయివస్తే
సానులడ్డుకొనిరి చందమామంచు
అబ్బాయి నీచేను ఏమిపండిది
రాజసంపండింది లక్ష్మికోరింది
అమ్మాయి నీచేను ఏమిపండింది
సౌభాగ్యంపండింది సరసమాడింది
పాపకర్మలచేను ఏమిపండింది
పల్లేరుపండింది పడటగలిసింది.

## చీర పాట

చిట్టినాఅమ్మాయి చీరకేడ్చింది
నేయరాసాలీ నెల్లూరిపట్టు
మురుస్తుసాలీ మాణ్ణెల్లునేస్తే
అరుస్తుచాకలి ఆర్నెల్లుఉతుకు
వేడుకతో అమ్మాయి వెయ్యేళ్లుకట్టు
ఆచీరకట్టంగ అందరికీముద్దు.



శ్రీరంగపట్టణము 'దేరియాదౌలత్': టిప్పుసుల్తాను వేసవిమందిరము



మైసూరు: నిషత్ బాగ్ ఉద్యానవనము.

—ఛాయాచిత్రగ్రాహకులు డి. అన్నజీరావు.



మైసూరు రాజగృహ దుర్గపు సింహద్వారములు.



దివంగతులైన మైసూరు మహారాజా
శ్రీచామరాజఒడయరు శిలాప్రతిమ.
—ఛాయాచిత్రగ్రాహకులు: డి. అన్నాజీరావుగారు.

## వేడుక పాట

సంపాదకుడు శెట్టిపల్లి వెంకటరత్నం చౌదరిగారు

౧

పాటలొస్తే పాడుకో
పరమేశ్వరుని వేడుకో
కొడుకుబుట్టితే ఎత్తుకో
కోడలొస్తే కూచుకో
మొగుడుకొట్టితే మొత్తుకో.

౨

పాటలైతే వచ్చుగానీ
పాడనైతే నేర్తుగాని
పాపిష్టిసిగ్గు నన్ను పాడనివ్వదో.

## ఏవిళ్ల పాట

శ్రీమతి జి. కృష్ణకుమారిగారు

తమానుసుకిటీలు వదినెకు
తమానులేకపోయెన్
ఒకటేసినెలలాయెనే
వదినెకు వక్కలు మనసాయెనే
రెండేసినెలలాయెనే
వదినెకు రొట్టెలుమనసాయెనే
మూడేసినెలలాయెనే
వదినెకు ముంజెలుమనసాయెనే
నాలుగేసినెలలాయెనే
వదినెకు నల్లచీరె మనసాయెనే
ఐదేసినెలలాయెనే
వదినెకు అట్టులు మనసాయెనే
ఆరేసినెలలాయెనే
వదినెకు అరిసెలు మనసాయెనే
ఏడేసినెలలాయెనే
వదినెకు ఎర్రచీరమనసాయెనే
ఎనిమిదేసినెలలాయెనే
వదినెకు ఎన్నముద్దలుమనసాయెనే
తొమ్మిదేసినెలలాయెనే
వదినెకు నొప్పులు మనసాయెనే
పదేసినెలలాయెనే
వదినెకు బాలుడు మనసాయెనే.

## పిల్లల పాటలు

శ్రీమతి చదలవాడ రాఘవమ్మగారు

౧

చందమామ చందమామ ఓచందమామ
చందమామకూతురు నీలగిరికన్య
నీలగిరికన్యకు నిత్యమల్లెతోట
నిత్యమల్లెతోటకు మంచినీళ్ల బావి
మంచినీళ్లబావికి మేలైనగిలక
మేలైనగిలకకు బారైనచేద
బారైనచేదకు బరువైనచెంబు
బరువైనచెంబుకు బారైనఉచ్చు
బారైనఉచ్చుతో నేతోడలేను
నాచిన్నిచెల్లెలు నాటిముద్దరాలు.

౨

కొండమీద వెండిగిన్నె
కొక్కిరాజు కాలువిరిగె
విరిగివిరిగి రెండాయె:
పీతుల్లు మూడాయె
పడమాట చుక్కాయె
కస్తూరి పిల్లనిస్తే
బ్రాహ్మణి తలచుకుంటె
పరుచూరారింట్లో బల్లున తెల్లారె.

3

గుడుగుడు లింగం
గుల్లో రాగం
పాముల పట్టం
పడిగే రాగం
చిన్నన్న గుఱ్ఱం
చిందులకు పోతే
పెద్దన్న గుఱ్ఱం
పెళ్లికి పోతే
తాతా గుఱ్ఱం
తన్నుకు చచ్చింది.

౨. కథలు

## అది ఉత్తిత్తి అయితే ఇది ఉత్తిత్తే

శ్రీమతి యడవిల్లి ఇందిరా దేవిగారు

అనగా అనగా ఓఊళ్లో ఇద్దరు అన్నతమ్ములుండేవారు. ఇద్దరూ చక్కగా వ్యవసాయంచేసుకుంటూండేవారు. సంక్రాంతిముందర కుప్పనూర్పులువచ్చాయి. ఆరోజున ఇద్దరూ తెల్లవారుజామునే పొలంవొచ్చి నూర్పుప్రారంభించారు. జాముర్రాత్రిదాకా తెమిలింది కాదు. కూలీలువెళ్లిపోయారు. అన్న తమ్ముణ్ణివెళ్లి ముంతపట్టుకురమ్మన్నాడు. ఇరవైపుట్ల ధాన్యం. రాత్రి ఇంటికిచేరలేవు. రాత్రికి అక్కడేపండుకోనేందుకు నిశ్చయించుకున్నారు. దొంగలభయం ఎక్కువ ఆవూళ్లో. తమ్ముడు వెళుతున్నాడు ముంతతేవడానికి. అన్నకి భయంవేసింది. ఏవడేనాకొట్టి ధాన్యంలాక్కుపోతాడని. దేవినితలచుకొని తల్లీ! ధాన్యంవప్రమాదంలేకుండా ఇంటికిచేరితే నీకు పుట్టెడొడ్లు ప్రసాదంచేయిస్తానని మొక్కేడు. ఈమాట వెడుతోన్నతమ్ముడువిన్నాడు. వెనక్కివచ్చి పుట్టెడొడ్లు మొక్కుతావురా? దొంగలొస్తే దేవిమాత్రం ఏంచేస్తుందిరా? ఛీ! అని కేకలువేశాడు. అన్న తమ్ముడువైపుతిరిగి చెయ్యి అడ్డుపెట్టి ఉత్తిత్తివట్టురా. నిజమనుకొన్నావురా? అన్నాడు. తమ్ముడు సంతోషించాడు. తక్షణం దేవి ప్రత్యక్షమై అది ఉత్తిత్తిఅయితే ఇదే ఉత్తిత్తీరా! అని ధాన్యంకేసి చూపించింది. ఇద్దరూ హడిలిపోయి దేవికాళ్లమీదపడి తల్లీ! రక్షించు. తప్పుచేశాము. రేపుతప్పకుండా మొక్కుచెల్లిస్తాముఅన్నారు. దేవి అల్లాగేఅని వెళ్లిపోయింది. మర్నాడు దేవికి ప్రసాదంచేయించి ఇద్దరూ దేవికి దండాలుపెట్టారు. కథకంచికి, మనమింటికి.

## తేరేజబాన్: తేరేముబారల్

శ్రీమతి బసవరాజు వేంకటరాజ్యలక్ష్మమ్మగారు

పరిష్యాదేశములో ఒకఅరణ్యమార్గాన రత్నాలవర్తకులు ముత్యాలవర్తకులు పగడాలూ గోమేధికాలూ పెందలైనవి సంచులనిండా వేసుకొని జలసా చేసుకుంటూ (అనగా, ఉత్సాహంగా కథలుకబుర్లుచెప్పుకుంటూ) నడుస్తూన్నారు. దోవలో చెట్టుక్రింద ఒక పైగంబర్ (అనగా ఫకీర్) తపస్సుచేసుకుంటూవున్నాడు. మృగాలన్నీ ఆయనచుట్టూ చనువుగాకూర్చున్నాయి. పిచ్చికలు ఆయనతలగుబురులో గూళ్ళుకట్టుకొన్నాయి. ఇల్లావున్నప్పటికీఫకీర్ యేమీచలనములేకుండా తపస్సు చేస్తూవుండేవాడు. ఒకొక్కప్పుడు తనసారంగీవాయించి

పక్షులకీ మృగాలకీ వినిపించేవాడు. అవికూడా రొంతో ఆనందంతో వినేవి. అందుకనే ఆయనకు యేహానీ చెయ్యకుండా దగ్గరకూర్చుండేవి. ఈయన యెప్పుడుకళ్ళువిప్పి యెప్పుడుపారంగీవాయిస్తాడాఅని నోరు తెరుచుకుకూర్చునేవి. ఈవర్తకులు ఆకోవ జేసెవుతున్నారు. అప్పుడు ఫకీరువర్తకులతో ఆసంచుల్లో ఏమిటిఅనిఅడిగాడు. ఫకీర్ తో వర్తకులు వేళాకోళంగా నేలదుమ్ము అని జవాబుచెప్పారు. అప్పుడుఫకీర్ "తేరేజబాన్ తేరేముబారక్" అని జవాబుచెప్పాడు. (అనగా నీమాటె నీకౌనుగాకఅని). వర్తకులు యీఫకీర్ తో మనకేమిటి పట్టిపిచ్చివాడని వెళ్ళిపోయారు. కొంతదూరంవెళ్ళేటప్పటికి ఒకయేరుదాటాలిసివచ్చింది. ఆయేరుదాటి ఆవలిఒడ్డుకువెళ్ళి చూసుకునేటప్పటికి రత్నాలూముత్యాలూ అన్నీపోయి బస్తాలనిండామట్టి వున్నది. అప్పుడువర్తకులు "ఆరే యీపైగంబర్ సామాన్యుడుకాడే" అనుకునిమళ్ళీ ఆకోవ జేవచ్చారు. మళ్ళీ ఫకీర్ "ఆబస్తాలేమిటి" అన్నాడు. "రత్నాలూ ముత్యాలూ గోమేధికాలూ పగడాలూ" అని జవాబు చెప్పారు వర్తకులు. అప్పుడు మళ్ళీఫకీర్ "తేరేజబాన్ తేరేముబారక్" అనిఅన్నాడు. అప్పుడు యథాప్రకారముగా రత్నాలూ ముత్యాలూ గోమేధికాలూ పగడాలూఅయినవి బస్తాల్లోమన్నంతా. వర్తకులు సంతోషించి సలాంచేసి పారితోషకం యివ్వబోయినారు. ఫకీర్ "సర్వసంగపరిత్యాగిని నాకెందుకు"అని వాళ్ళ నాశీర్వదించి పంపాడు.

## చదువుకున్న భార్య

శ్రీమతి తులసి సూర్యప్రకాశమ్మగారు

అనగాఅనగా ఓవూళ్ళోఒకబ్రాహ్మణుడుండేవాడు. ఆయనచాలాపండితుడు. ఆయనకి ముగ్గురు కొడుకులూ ఒకకూతురూఉన్నారు. వాళ్ళకూడా సంస్కృతంబాగావచ్చును. ఆబ్రాహ్మణునిభార్య చదువుకుంది సంస్కృతం. కొన్నాళ్ళకి కూతురికి పెళ్ళిచేశాడు బ్రాహ్మణుడు. అల్లుడికిమాత్రం సంస్కృతం రాదు. సంస్కృతమేకాదు ఏభాషాకూడా రాదు. పెళ్ళానికిచదువురావడమే తనకురాకపోవడమేమని అతనికి కోపంగాఉండేది. కొన్నాళ్లకు బ్రాహ్మణునికూతురు కాపరానికెళ్ళింది. అదిమొదలా మెభర్తకు సంస్కృతం పేరు వినపడేలా చేస్తూ నేర్పుతూఉండేది. పెళ్ళాందగ్గరచదువుకుంటున్నాడని అందరూ ఎగతాళిచేస్తూండేవారాతన్ని. ఒకమారు భార్యా తనూ పండుక్కి అత్తవారింటికివెళ్ళేరు. భావమరుదులంతా చదువురాని బావగారని వేళాకోళాంచేస్తూండేవారు. అతనికేమీ అభిమానంలేకపోయినా పెళ్ళానికిమాత్రం చాలాఅభిమానంగాఉండేది. ఒకనాడు అందరూ భోజనంచేస్తున్నారు. ఆబ్రాహ్మణుడు కొడుకులు సంస్కృతంతోటే ఏమికావలసినాఅడిగి వేయించుకొంటున్నారు. "ఉదకమానయ" "శాకమానయ" "అన్నమానయ" అని సంస్కృతంతోటే మాట్లాడుతున్నారు. అప్పుడు అల్లుడుకూడ సంస్కృతం మాట్లాడాలనుకొన్నాడు. పెళ్ళాం చెప్పిన సంస్కృతంలో 'దధి' కూడావుంది. దధిఅంటే పెరుగుకదా అనుకొన్నాడు. బావమరుదులుకొసని "మానయ" అన్నారుకదా అని తానుకూడా "దధిమానయ" అన్నాడు సంస్కృతంమాట్లాడుతున్నానని బావమరుదులనుకోడంకోసం. కాని ఆప్రయోగం తప్పని తెలియదుపాపం. అంతట్లోకి బావమరుదులు ఆఅపప్రయోగం విని నవ్వుతూ ఏమండోయిబావగారూ అల్లాతప్పులుతోటి సంస్కృతంమాట్లాడకపోతేఏమండీ, అని వేళాకోళంచెయ్యసాగేరు. ఇదంతాచూచి ఆతనిభార్యకు ఉడుకుమోతుతనం ఎక్కువైపోయింది. నలుగురిలోనూ భర్తనువేళాకోళంచేస్తుంటే ఆమెకెంతోకష్టంతోచింది. వెంటనే భర్త అవమానంతప్పిద్దామని అన్నలతో ఇల్లాగందిఆమె. "ఏమి మీకేకాని ఎవరికీచదువురాదనుకొంటున్నారేమిటి. ఎందుకానవ్వు. ఆయనకి పెరుగు ఇష్టంలేక "దధిమానయ" అన్నారు. అంతేకాని పెరుగుకావాలనిఉద్దేశంతో అల్లామాట్లాడలేదు. అంత తెలియదనుకున్నారా" అంది భర్తగుట్టుబయలుపడకుండా. అప్పుడువాళ్ళు మీఉద్దేశ్యంఏమిటండీ బావగారూ

అని అడిగారు. లోపల పెరుగుపోతోందని మూలుక్కుంటూ గుట్టుబయల్పడకుండా ఉండడంకోసం పెళ్ళాం చెప్పిందే తనకు శ్రేష్ఠంఅన్నాడు. పెళ్ళాంచదువుకున్నదవడంవల్ల గౌరవంరక్షించబడిందని సంతోషించాడులోపల. కథకంచికీ, మనంఇంటికీ.

## పిట్టకథ

శ్రీమతి సామినేని హనుమాయమ్మగారు

అనగా అనగా ఒకవూళ్లో ఒకముసలిదియున్నది. దానికొడుకు అవూరురాజుగారి యేనుగులకాపరి. ఒకరోజున ఆముసల్ది చల్దిఅన్నం మూటకట్టుకొని నెత్తిపై నపెట్టుకొని వెళ్లుచుండెను. ఇలావస్తుండగా దారిలో ఇద్దఱువస్తాదులు కుస్తీపట్లుపట్టుచుండిరి. ఈ ముసలి దాన్నిజూచి అవ్వా! అవ్వా! కాస్సేపునిల్చి మాలో యెవరు గెల్చెదరో చూచువుగాని ఉండు అనిరి వస్తాదులు. నాయనలారా? నాకొడుక్కి అన్నంతీసికెళ్తున్నాను. ఆలస్య మయితే కోప్పడుతాడు, పోనీలెండి, మీరాయిద్దఱు నాచేతులమీదనిలువబడి కుస్తీపట్టుతూడండి, నేనునడుస్తూ చూస్తుంటాను అని అవ్వఅనింది. సరేనని దానిచేతులమీదనిల్చి కుస్తీపట్లు పట్టాయున్నారు వస్తాదులు. ఈముసల్దిరావటం అవ్వకొడుకుచూచి మాఅమ్మవస్తుందికదా అని యేనుగులన్నిటిని తనపైనున్న గుడ్డవలచి మూటగట్టి ఒకచెట్టుయొద్దనుంచి తాను కూర్చుండెను. ఇంతలో గద్దఒకటివచ్చి ఆమూటతన్నుకొని కాళ్లతోపట్టుకొని యెగిరి పోయెను. అది ఆకాశముపైని వస్తుండగా అవూరురాజకూతురు డాబాపైని తలారవేసు కుంటూ పైకిచూచి గద్దఏమిటోతన్నుకొని వెళ్తున్నదని వ్రేలితోచూపుచుండెను ప్రక్క నున్నదాసీదానికి. ఇంతట్లోకే ఆగద్దకాళ్లలోతప్పి యేనుగులమూటపడిపోయి రాజకూతురి కంట్లో వచ్చిపడ్డది. నాకంట్లో యేదోనలుసుపడ్డది చూడమని దాసీదానికి ఆపెచూపగా ఆదాసి హు అని వూదివేసినది. వూదగానే వూరంతా యేనుగులయిపోయినవి. ఈపైనివచ్చిన బలవంతులలో వరుసగా వస్తాదులు, అవ్వ, అవ్వకొడుకు, గద్ద, రాజకూతురు, దాసి వీరిలో ఎందుచేత ఎవరుబలవంతులో పాఠకులు గృహలక్ష్మిపత్రికాముఖమున దెలుపప్రార్థన.

## తన ఆలిదగ్గర అయితే నగరం పాడు

శ్రీమతి కల్యాల పార్వతీదేవిగారు

వెనకటికాలంలో ఓరాజున్నాడు. ఆయనకిద్దఱుభార్య లున్నారు. చిన్నభార్యఅంటే రాజుగారికి అమితానురాగం. ఆమెనుచూడకుండా ఒకక్షణమన్నా ఉండేవాడుకాడు. ఉండ జాలనివాడయిపోయాడు. ఆమెఎక్కడుంటే అక్కడేఉండడంగామారిపోయింది రాజుగారిపని. నగరంలోఉంటుండేది చిన్నరాణిగారు. రాజుగారుకూడా అక్కడ బిఛాణావేశేవారే. ఇలా గడుస్తోందికొంతకాలం. నైజంగా వర్షకాలంఅయినా ఆయేడు ఎండలు మెండుగా కాయ డంవుందిగాని ఓచినుకైనాలేదు. పైరులన్నీ మాడిపోయినవి. తింటానికితిండిలేదు. ప్రజలకు పైగా పన్నుచెల్లించాలి. తమబాధనుచెప్దామని రాజుగారిదగ్గరకి వెళ్ళిపోయివద్దాంరా అను

కున్నారు జనులు. నగరంలో ఉండడం మామూలుకనుక బయల్దేరారు. ఆపళంగా రాజుగారేరి అన్నారు. రాజుగారికిచెప్పించి ఎలాగన్నా వరుణజపాలుచేయించో, శివలింగమునకు సహస్రఘటాభిషేకముల చేయింపమని ప్రార్థించాలని వారొస్తే నగరంలోలేడు. తన ఆలి దగ్గరఉన్నాడు అనిచెప్పారు. ఈకభురువిన్నారు పాపం. ఏంచేస్తారు? అయితేనగరంపాడే అన్నారు అప్పుడు వారు. అందుకే ఇప్పుడుకూడా "అయితే నగరంపాడు" అని గ్రామం వుంది. దానికి దగ్గర్లోనే తెనాలికూడవుంది. తనఆలి తెనాలయిందివ్యవహారంలో. ఈభోగట్టా తెల్సుకోవాలంటే నింపాదిగా చూడండి. గుంటూరుజిల్లాలో తెనాలితాలూక, అని దాన్ని అనుకొని అయితేనగరంపాడు అనివుంది చూడండి మరింకా.

## చోరుని బూచి

జక్కి శేషగిరిరావుగారు బి. ఏ, యల్. టి.

"ఒకానొక పేడరొదుట కూర్చుండి లోనికేగుటకు సమయముకొరకు కాచుకొనియుండి వినుగత్తి చివరకు తనపని నెరవేర్చుటకదను దొరకినదిగదాయని చోరుడు సంతసించుచుండెను. అది నిశీధసమయము. అప్పుడేగృహయజమానియగు జమీందారుడుగృహమును వీడియుండెను. అతడు లోనినుండి బయటకుపోవుటయు, నింటినవుకరుగృహకవాటమును మూయుటయు నొక్కత్రుటిలోజరిగెను. చోరుడు తనపని ప్రారంభించుట కాయత్తపడెను. దొడ్డిద్వారమునుండి గృహావరణమునందు ప్రవేశించి, తిన్నగారమ్యహర్మ్యపుటార్థ్వభాగమునుజేరెను. ఇంటిలో తన్నడ్డగించువారును లేరని చోరునికిదివరకే తెలియును. యజమానియువప్పుడే బయటకుబోయియుండెనుగదా. ఇంటినవుఖరు చెవిటివాడు. ఇకగావలసినదేమి? చోరుడు గృహాంతర్భాగమునుజేరెను. నలుగడలగలయజూచి తనవిద్యుచ్ఛక్తిదీపికను వెలిగించిచూచెను. ఆవెలుగునందు మధ్యగదిలోని ధనపేటిక ప్రకాశించెను. ఇనుపపెట్టెలను తయారుచేయుకంపెనీయందు దానివరలో కొంతకాలము పని చేసియుండుటచే చోరుడు ధనపేటికనుజూచిన యుత్తరక్షణమందె దానినితెఱచుమార్గము నవలీలగ గ్రహించెను. తాళములగుత్తిని మొలనుండితీసి నేలపైబడవైచి యినుపపెట్టెవద్దకుచేరెను. ఇంతలో నొకశబ్దమువినబడెను. ఈశబ్దమెయ్యెడనుండివెలువడెనో చూతమని చోరుడు చెవులురిక్కించివినదొడగెను. దాపుననుండియే. తానున్నగదినుండియేనా? తత్క్షణమ చోరుడు వెలుపలికిచూచెను. ఆకసమం దుడుగణంబులుదక్క మరేమియుగన్పడలేదు. అంతయునిశ్శబ్దము. ఆహా! తానువిన్నశబ్దము తానున్నగదియందలిదే! గదినంతయు దిరిగి కలయజూచెను. అంతయునిశ్శబ్దము! చోరునికి భయమా? ఎంతమాత్రమునులేదు. చోరుడు ప్రాణము పోయినను మనుష్యమాత్రునిజూచి జంకువాడుకాడు కాని యీశబ్దమేమి? ఎట్లెట్లోధైర్యము దెచ్చుకొని చోరుడు తనపనిని తిరిగిప్రారంభించెను. విద్యుచ్ఛక్తిదీప మతనిచేలతో కదిలివట్లాయెను. అదృశ్యహస్తమేదయిన దీపమును సంగ్రహించెనేమో? చోర డాలోచనానిమగ్నుడయ్యెను. ముసలి చెవిటినవుకరుగాని యీపనిచేసియుండునా? కాదు. వానికి చోరునియలికిడి వినబడనేవినబడదు. దీపముబల్లపైనుండి జారిపడినదిగదా అందుచేత మీటకదలి దీపమారెనేమో? నిజమే! చోరుడు గదినంతటను తిరిగి పరీక్షించిచూచెను. ఎవ్వరునులేరు. తిరిగి ధనపేటికయెదుటగూర్చుండెను. దానిని తీయుట మొదలిడగానే తిరిగి అదేచప్పుడు! ఈమారుసరిగావినబడెను. తాళము చెవులకదిలించినధ్వని. తాను నేలపైబడవేసిన తాళముచెవులగుత్తినంట దానుకదలెనా లేక యెవరయినను తీసియుందురా? చోరుడు తన చెవులురిక్కించివినెను. ధ్వని వినబడుచునేయుండెను. వాని కీమారు గొప్పభయముకలిగెను. అది దయ్యములకొంపయేమో! కానియెడల నాకటికచీకటిలో నాతాళములచప్పుడేమి? ఏదేనొకయదృశ్యహస్తము వానినితీసికదిలించియుండును. చోరుడు పూర్తిగాభయపడెను. మరలమరలనదేధ్వని! అధ్వనినిజముగా వానిప్రాణములదీయజాలియుండెను. చేత విద్యుచ్ఛక్తిదీపమునిరికించుకొని యెట్లోధైర్యముచిక్కబట్టుకొని చోరుడు దాపుననున్న గదికిటికీలోనుండియీవలకుదాటెను! కాని తాళ

ములగుత్తిమాటయేమి? తన్ను పట్టియిచ్చుటకా గుత్తిచాలదు. కొన్నినిమిషములకు చోరుడు తిరిగిగదివద్దకు వచ్చెను. విద్యుచ్ఛక్తిదీపకాంతిలో గదిసంతటను బయటనుండియే కలయజూచెను. ఏమిఆశ్చర్యము! ఒక ఎలుకపిల్ల తాళములగుత్తిపై పాటలాడుచుండెను!! ఆహా! అదిగదా చోరునిబూచి!!! కాని తనభయకారణ మిప్పటికైనను తెలిసికొనినందున చోరునికి లాభములేకపోయెను. మరుక్షణమున గృహయజమాని తన స్నేహితులతో నింటికితిరిగివచ్చెను. వారు గృహోపకరణమును చేరకముందే చోరుడు తనతాళములగుత్తితో నుడాయించెను! పాపము చోరునిశ్రమ వ్యర్థము. ఆహా! ఈశ్వరసంకల్పమిట్టిది! అప్రయత్నముగ జమీందారునిసంపదను గాపాడిన దీచోరునిబూచి!"

(అనువాదము)

# మంచితంత్రము

ఆరవిల్లి నరసింహాచార్యులుగారు బి.ఏ.

పూర్వమొకగ్రామమున మిగులలోభియొకడుండెను. అతడు మిగులధనికుడు. అతని కొకపెద్దతోట యుండెను. మిగులవంగిన లేతకొమ్మలను ద్రుంగదీసి వేలవంటించుపండ్లు లెక్కకుమిక్కిలిగా నక్కలపాలగు చుండెను. పైకొమ్మలపండ్లు పక్షులపాలబడుచుండెను. అతఁడేదైన పొరుగూరుపోయినప్పుడు అవియు నివియు దొంగలపరమగుచుండెను. తోటకట్టుదిట్టము చేయ నాతనికి దృఢసంకల్పముదయించెను. ద్రవ్యము వెచ్చింపక అది కాదని సంకల్పము వికల్పమయ్యెను. ఇట్టిసమయమున క్షామబాధవలన మాతృదేశమును విడచి తనకుటుంబముతో పరదేశయాత్రాపరాయణుఁడగు నొకఆరవసోదరుఁడు తోటచుట్టును సవ్యాపసవ్యప్రదక్షిణములొనర్చి లోభిచర్యగమనించి యాతని తలంపు నెఱిఁగెను. నుదుట కుంకుమబొట్టుతో, ద్రవ్యలోభమున పెరిగినగడ్డముతో నున్న యాతని నొకమంత్రవేత్తయని యూహించి లోభియాతనికి నమస్కరించెను. మందహాసమున నాతనినమస్కారమందికొని యాతడు "తోటచుట్టుతిరుగుచుంటిరే" అని సంభాషణప్రారంభించెను. లోభి తన గోడువెళ్ళబోసికొన్నమీదట నాతడుతలపంకించి, తరుణముదాటిపోయిందే! చిటికెలో కట్టుదిట్టము చేసియుందునే? తిరిగి ఆరుమాసములకు గాని మంచిముహూర్తము లేదే! మంచివారు మీరు నష్టపడుచున్నారే అని గిజగిజకొట్టుకొనసాగెను. బాబూ వివరంగాసెలవియ్యాలి అని లోభి దీనుడై వేడగా, మావద్దమంత్రమున్నది. ఆది శ్రద్ధగావిని తరువాత చేయవలసిన తంత్రము చేసినయెడల చీమలుదోమలుకూడ మీతోటలోనికి రాలేక గీపెట్టుచుండును. మనుష్యులు, జంతువులు పక్షులు తేరిచూడజాలవు అనెను. అయ్యా! నాయందు దయయుంచి నాకుపకారము చేయరాయని లోభి ప్రాధేయపడెను. రాజుగారి ఆస్థానములో పనిలోనుంటిని ఆరుమాసములవరకు మంచిముహూర్తము లేదు. నీసంగతివిన్న జాలికలుగుచున్నది. ఏమిచేయను! అని అర్థాంగీకారసూచకముగా పలుకు మంత్రవేత్తపాదములంటి మహాత్మా! ఈ ఆరుమాసములు నాఅతిథిగానుండి నాకీ మహోపకారమొనర్చి నన్ను రక్షింపుడని వేడు లోభియెడ జాలిబూనెనో యన నాతడట్టులే యంగీకరించి సకుటుంబముగా ఆరుమాసములు షడ్రసోపేతభోజనము సమకూర్చుకొనెను. ఆరుమాసములు గతించినవెనుక, శుభదినమున శుభనక్షత్రమున లోభియు దానును శీతజలస్నానమొనర్చి దిట్టముగ కుంకుమబొట్లుపెట్టి యొక ఉండవిల్లుబద్దతో తోటపైపునకరిగిరి. మాంత్రికుడు లోభిని హెచ్చరించుచు ఉండవిల్లుతో మంటిబెడ్డలను పైకి మేఘమండలము దాసికొనిపోవునట్లు విసరజొచ్చెను. లోభి యానందముతో నహ్వా, సెబాస్ అనుచు తన యానందమును వెలిబుచ్చుచుండెను. తోటచుట్టు నాల్గయిదుప్రదక్షిణములొనర్చి మంత్రములుచదువుచు కొంత కాలముజరిపి సకుటుంబముగా ప్రయాణమై అయ్యా! మంత్రమైనది. తంత్రముమిగిలినది. ఈపెట్టెలో బీజాక్షరములతోనున్న తాటియాకున్నది. ఇక నాల్గురోజులకు సూర్యోదయమగుచుండగా శుచియై, పండితుడునగు బ్రాహ్మణునిపూజించి ఆయనచే నీపెట్టెతీయించి అందలియక్షరములు అతిశ్రద్ధగావిని పిదప ఆతాటియాకుతోట మధ్యపాతవలెను అని చెప్పి తనదారినిపోయెను. దక్షిణఅడుగుట మఱచిపోయినదే చాలునని లోభి యాతని సాగనంపి యాతడుచెప్పినరీతిని గ్రామపురోహితునిచే పెట్టెయందుగుప్తముగు బీజాక్షరములు వినవేచియుండ నాతడీవిధముగాచదివెను. "అయ్యా! తోటనాలుగువైపులను నల్లరాళ్ళతో నేనువిసిరినబెడ్డ లెంతయెత్తు పోయెనో అంతయెత్తున దృఢముగగోడలుకట్టింపుము. అప్పటికిని కాయలుపోవుచున్నచో నీపురాకృతకర్మమని యూరడిల్లుము."

# లక్ష్మీ కటాక్షము

మల్యాల వేంకటశేషగిరి రావు గారు

రాత్రి రెండుజాములయినది. సుందరునకు నిద్రపట్టలేదు. అతఁడు తన యూహాప్రపంచమున శూన్య మందిరములు నిర్మించుచుండెను. అంతలోఁ దన శిరమువైపు కుడ్యములో 'గలగల'మనుశబ్దము—ఆధ్వని గంపెడు రూప్యము లొక్కసారి యచట నొలికినట్లయ్యెను. సుందరుఁడు చటుక్కున లేచి

“ఆహా! ఏమిది? కానరాని యీకర్ణములవిందు!”అని యటునిటు వీక్షించుచుండ మరల 'గలగల'శబ్దము—అతనిడెందము మఱింత సంభ్రమాశ్చర్యముల మునిఁగి “ఓహో! ఇది యీగోడనై యుండనోపు”అనియట నొకతలుపుమూల గడ్డపాఱనుదీసి గోడయందొకనాటు పెట్టెను. తత్క్షణమే యాగోడనుజేరియున్న మఱియొకగోడలోసందడి—“చిత్రము! చిత్రము!!”అని యతఁడటకుఁబోయి త్రవ్వనుంకింప వీధిగుమ్మముకడ నలికిడి—అతఁడు “ఓకలిమికాంతా! నీసందర్శనభాగ్యము నాకు లభింపనీవా? నేనొనర్చినయపరాధమేమి?” యనునంత

“అపరాధమని నెమ్మదిగయనుచుంటివా? అపరాధమే. నీయింట మూఁడుసంవత్సరములనుండి మూల్గుచున్న నన్ను గుర్తింపవైతివి. నీసతి యప్పుడప్పుడు 'ఆశబ్దమువింటిరా' యనినుడివినప్పుడు నీవుమధుపానమత్తుఁడవై 'ఛీ! నోరుమూసుకొని పండుకొమ్ము'అని దురాలాపములాడితివి. మఱియు నీవుదుష్టమతివై, జూదరివై, పరకాంతాలోలుఁడవై యామెను గడుహేయముగఁజూచుచు నొడలుమఱచి చావమోఁదుచున్నావు. ఈరాత్రిమరలఁగొట్టితివి. కంటివా? పాపము! సరళ నీదెబ్బలకోర్వఁజాలక నేలపై నెట్లెక్కియేడ్చి పడియున్నదో! ఆమె గుణగణములనుబట్టియే, నేనింతవఱకైన నిందునివసింపఁగలిఁగితిని. ఇఁకనొక్కనిముసమైన నుండఁజాలను. ఏలనన, ఆమెభూమిపై విడిచినకన్నీటికణము లగ్నికణములై నన్నిటనుండి తఱిమివేయుచున్నవి. నీవుతిరిగి నా యనుగ్రహము నార్జింపనెంచువేని, సద్గుణగరిష్ఠుఁడవై నీసతీలలామనానందాబ్ధినోలలాడించునాఁడు నీకనులకగుపడకే, నీయింటఁ బ్రవేశింతును. నేనీయూర సదాచారసంపన్నులును, గుణఖనులును, మత్పూజాలాలసులునునై మదీయరాకకై నిరీక్షించుచున్న 'మాలతీమాధవు'ల మందిరమునకరుగుచుంటిని. ఈవార్త రేపే, నీచెవులఁబడఁగలదు”అను పవిత్రవాక్కులా గోడనుండి వినసయ్యెను. సుందరుఁడంత

“అక్కటా! నేనెంత యభాగ్యుండను? నేటినుండియైన నాదుర్గుణములవీడి సద్గుణరాశియైన నాభార్యను హింసింపకుండును”అని యచట నేలఁబడియున్న యామెను లేవనెత్తి యావృత్తాంతమెల్లఁజెప్పి దుఃఖముడిపెను. మఱునాఁడుదయమున మాలతీమాధవుల పూజామందిరమున నొక'సువర్ణకలశము'వారికిదొరికినట్లు పురజనుల వీనులసోఁకెను. సరళాసుందరులును సకలసుఖములఁ దేలియాడుచు నచిరకాలములోనే లక్ష్మీకటాక్షులైరి.



## —కందిపప్పు కచోడీ—

అరసేరునీరు పొయ్యిమీద పెట్టవలయును. ఆనీరు మరుగుచున్నప్పుడు, ఒకసోలడు లేక (20 తులములు) కాన్పూరుకందిపప్పు తెచ్చి ఆమరుగుచున్న నీటిలోపోసి చిన్నసెగమీద వుడకనీయవలయును. ఈనీరు అంత యున్నూ అయిపోవునరికి పప్పుకూడా మెత్తగా మగ్గగలదు. మగ్గినపప్పులో వేయించినగర్మపాలా గాని, కొంచెముగా జీలకర్రగానివేసి కావలసినంత, ఉప్పుకారముకూడా చేర్చుకొని మెత్తగానన్నికల్లు మీద నూరవలయును. నూరినతరువాత ఇదిసన్నని గోధుమనూక వుప్మానలె నేతయారగును. మంచిమైదా ఒకపావుశేరు పిండికలుపుగుని పూరీలమాదిరిగావత్తి ఈకందిపప్పుముద్దను చిన్ననిమ్మకాలంతేసివుండలు చేసి యీపూరీలోపెట్టి బొబ్బట్లమాస్తరుగా వత్త వలయును. తరువాత పెనముకాలనిచ్చి నేతిలో కాల్చుగోవలయును. కాలినతరువాత మంచివాసనతో చాలరుచిగానుండును.

—జయంతి వేంకటలక్ష్మి.

## —అనాసపండు జామ్—

బాగుగామగ్గినఅనాసపండు మీదితోలుతీసివైచి ఆపండునువుప్పులోరుద్ది కడుగవలెను. అటువెనుక దానిని నాలుగుభాగములుగాకోసి మధ్యనున్న కాడను తీసివేయవలెను. అంచుగల కళాయిపళ్లెరమునందు, కొబ్బెరతురుముపీటనుంచి ఈపండును కొబ్బెరతురిమి నట్లు తురుమవలెను. వెనుక ఆతురుమునురసముతో గూడ ఎంతగలదో కొలుచుకొని అంతేపంచదారవేసి రెంటిని ఒకపాత్రయందుకలిపి ఆపాత్రను పొయ్యిపై నుంచవలెను. అదిఅడుగంటకుండ గరిటెతో కలుపు చుండవలెను. గరిటెజారుపాకమువచ్చినపిదప ఆపా త్రనుదింపివైచి చల్లార్చవలెను. వెనుక సీసాలోపోసి కొనవలెను. ఈజామ్‌ను రొట్టెతో ఉపయోగించిన చాలరుచిగానుండును.

—పాకల చంద్రకాంతామణి.

## —రాయలసీమ పాలపోళీలు—

ఈపాలపోళీలనే యీప్రాంతమువారు పాలహోళి గెలనుచున్నారు. 'హోళిగె' కన్నడపదము. దానికి సరియైన తెలుగుశబ్దము పోళీ. పోళీలనే ఒబ్బట్లు అందురు. ఒమ్ము + అట్లు = ఒబ్బట్లు. అనగా బలుపు (స్థౌల్యము) గల అట్లేవో అవి. రాయలసీమలో వీనిని రెండురీతులజేయుదురు. గోదుమరేకులనడుమ పూర్ణము (ఉడికిన కందిపప్పుబెల్లముచేర్చి రుబ్బిన ముద్ద) నుంచిచేయుటయొకటి. వీనిని సామాన్యముగా నెల్లరు హోళిగెలందురు. పాలతో జేయుట రెండవ విధము. పాలతోఁజేయబడుపోళీలే పాలపోళీలు. ఇప్పుడిచ్చట వీనినిగూర్చియే వివరింతును. మంచి బెల్లపుపొడి 50 తులములు (లేకకొలఁతలో అరసేరు), కొబ్బెర 10 తులములు, గసాలు (రాళ్ళుదుమ్ము లేకుండఁ జేసినవి) 10 తులములు, గోదుమపిండి అరసేరు (కొలఁత) చిక్కనియావుపాలు $\frac{1}{2}$ సేరు (కొలఁత), సొంటి $\frac{1}{2}$ తు, సోపు $\frac{1}{2}$ తు, ఏలకులు $\frac{1}{2}$ తు, మంచి



వయసుకుమించిన ప్రయత్నము



విద్యాభిలాష

—ఛాయాచిత్రగ్రాహకులు: శ్రీ రామారావువర్మ.

గుమ్మడివంటి బిడ్డ



దసరాఉత్సవములుజరుగు మైసూరుమహారాజభవనము.



అత్తరుకచేరి: మైసూరు

—ఛాయాచిత్రగ్రాహకులు: డి. అన్నాజీరావు.

నేయి 5 తు, వేర్వేఱుగా సిద్ధము చేసియుంచుకొనుము. ఇందు గోధుమపిండితడిపి మెత్తగాదంచి పిసవకుండగనివరీతిని ముద్దచేసియు, సొంటిసోపు ఏలకులుచూర్ణము చేసియు, కొబ్బెరగపాలు చేర్చి చక్కఁగరుబ్బి ముద్దచేసియు నుంచుకొనుము. ప్రొయ్యిమీఁద (ఒకసేరుబియ్యముడికెడు) వెడల్పు మూతిగలపాత్రయుంచుము. అందులో ఆవుపాలు అరసేరుపోయుము. దిగువ సన్నగామంటవేయుము. పాలు సలసల కాఁగుటచూచి, బెల్లముపొడి (అరసేరు) అందులోవేయుము. ఒకగరిటెకాఁడతో నదికరఁగు వఱకు మెల్లఁగాగలయఁద్రిప్పుచుండుము. బెల్లమంతయు బాగుఁగాగరఁగుటలోడనే యావఱకే మెత్తగారుబ్బి యుంచుకొనియుండిన (గసాలుకొబ్బెర) ముద్దలో కొంచెమునీరుపోసి యుండలులేకుండఁ గలిపి, అజాపకాఁగుచున్న పాలలోఁబోసి, గరిటె కాఁడతోఁద్రిప్పుచుండుము. అంతయుఁగలిసుఁగాఁగి తరువాత తెరలునపుడు సొంటిసోపు ఏలకులుచూర్ణమునందులో వైచి కాఁడతోఁగలయఁద్రిప్పి దించి, వేఱొకపాత్రలో నీపానకము (లేతపాకు) పోసి, చేఁడిపోకుండ మూతవైచియుంచుము. బెల్లమునకు బదులు చక్కెరయువాడవచ్చును. పిదప ప్రొయిమీఁదనుంచి సన్నగామంటవేయుము. దంచియుంచుకొనిన గోధుమపిండిముద్దనుండి చిన్నచిన్నయుండలు చేసియుంచుకొనుము. ఆయుండలను పీటపై రేకులుగాఁజేయుము. వీనిని పూరీలకయి చేయురేకులకు వలె నేయిచక్కఁగా రాచి పలుమడతలుగా మడచిలట్టణికతో పలుచని గుండ్రని రేకుగా సాగఁజేయుము. పెనముపైఁగాల్చుము. ఆరేకురొట్టెవలె బాగుగా వేఁగినతరువాత దానినికాఁడతోఁదీసి, పట్టిదిగానుండు వెడదటిపాత్రలో వైచి, యదిమునుఁగఁగలయంత యుడుకుపానకము (పాకు) దానిపై (పాత్రయందలి రొట్టెపై) బోయుము. ఇట్లేయొక్కొకరేకు పెనముపై వేఁగగనే దానినికాఁడతోఁదీసి, పానకముతోఁడఁ దడిపినరొట్టెనుంచి, యదితడియఁగలయంత పానకము బోసి యుంచుచుండుము. దంచినయరసేరు గోధుమపిండిముద్దయుండలన్నియు, రేకులుగను రొట్టెలుగను పూర్తియగుదనుక నిట్లే చేయుచుండుము. అన్నియు పూర్తియైనపిమ్మట మిగిలినపాకుఁజూచి రొట్టెలపై వెడదటిపాత్రలో నేపోయుము. అనంతరము దానిపై మూతవైచి యుంచును. అరగంటదాఁటినపిమ్మట, నారొట్టెలన్నియు పాకులోఁదడిసి మెత్తబడి, తినుటకుఁదగియుండును. ఇవి మృదుమధురములై మిక్కిలి స్వాదుగనుండును. తగుకాలఁదిభుజించుట యుక్తము.

—సీకిపి సావిత్రమ్మ.

—రసగుల్లా—

ఒకసేరుగట్టిపాలుతీసుకొని మరగపెట్టవలెను. మరుగుచున్నప్పుడు కొంచెమునిమ్మకాయపులుసుగాని పటికగాని వేసిన పాలు విరిగిపోవును. విరిగిపోయినపాలు పరిశుభ్రమైన గుడ్డలోవేసి వ్రేలాడగట్టవలయును. పూర్తిగానీళ్ళువాడనిచ్చి ఆముద్ద పైకితీసి వేయవలయును. దానిలో అరసోలెడుగోధుమనూక గిద్దెడు మైదాపిండి కొంచెముఏలకులపొడివేసి బాగుగా మర్దనచేయవలయును. ఒకఅరవీసె పంచదారతెచ్చి దానిని లేతపాకముపట్టవలెను. పాకమువచ్చినతరువాత మంటతీసివేసి వేడివేడిపాకములోనే పైమర్దనచేసిన ముద్దను చిన్నచిన్నఉండలుగా చేసివేయవలయును. పాకములో నానినతరువాత వానినితినిన రుచిగానుండును.

—యశోదాబాయి.

—పూతరేకులు—

మెట్టమెదట పోలెడుబియ్యముశుభ్రముగాకడిగి నానబోయవలయును. బాగుగానానినతరువాత రోటియందుబోసి మెత్తగాను, చాలవఱకు పలుచగాను రుబ్బవలయును. మెత్తగారుబ్బినవెనుక పాత్రయందు ఉంచవలయును. అనంతరము భూమిమీద పొయ్యి ఒకటి తయారుచేసి దానిమీద పూతరేకులకుండను ఒకటి బోర్లించవలెను. ఈకుండకు 3 రంధ్రములు కూడనుండును. ఆరంధ్రములవిడచిపెట్టి క్రిందచుట్టు ప్రక్కలను ఆవిరిపోకుండగ మన్నులో మెత్తవల

యును. తర్వాత పొయ్యిలో మంటచేసి కుండవెచ్చగా కాలినతరువాత పైనచెప్పినపిండిలో తెల్లనివస్త్రము ఒకటియుంచి కుండచుట్టునుపూయవలయును. అట్లు పూసినచో ఉల్లిపొరలవంటి పొరలయారగును. అట్లే అనేకపర్యాయములు పూయుచులాగుచుండవలయును. అప్పుడు పంచదారయు, నేయికూడపొరలుమడిచి వేసిపైనచల్లినచో ఇవితయారగును. వీనినే పూతరేకు లందురు.

—చదలవాడ రాఘవమ్మ.

—సేమ్యా చేయు విధము—

ఒక సేరు సన్ననిగోధుమరవ (అనగా పేణీరవ) ను తెప్పించి శుభ్రపరచవలెను. శుభ్రము చేసినరవను ఒకవెడల్పు పళ్లెములోబోసి కొద్దివేడినీటిచే తడిపి మూతపెట్టవలెను. దానిని రెండుమూడు గంటలకాలము వుంచి నానినతరువాత పీటపైన ఒకపావునెయ్యి వేసి బాగుగా మర్దనచేయవలయును. సరియైన పాకము వచ్చినతరువాత ఆముద్దను నాలుగు భాగములు చేయవలెను. ఒకభాగమునుమాత్రము పీటపైనుంచి మిగిలినవాటిని తడిపినబట్టలో చుట్టవలెను. లేకున్న పిండి పొడియైపోవును. పీటపైనుంచిన భాగమునకు నేయిరాచి పొడుగుగా చీపురుపుల్లప్రమాణముగాచేసి దానినిచుట్టుగా చేతికి చుట్టుకొనవలయును. ఇట్లు చేసినయెడల సన్నగా తీగెవలెనున వచ్చును. దానిని ఒక వెదురుగడపై ఆరవేయవలయును. ఇట్లే మిగిలిన భాగమునుగూడ పైనచెప్పిన విధముగాచేసి గడపైవేయవలెను. రెండుదినములు ఆరినతరువాత పెద్దముక్కలుగాచేసి డబ్బాలో వేసియుంచవలెను. దీనినే సేమ్యాలందురు. సేమ్యా రుచిగలమంచిఆహారము. సేమ్యాలను పరమాన్నములోను, రవయిడ్లెనలోను వేయుదురు. ఇంకను అనేకవిధములుగ సేమ్యాను వాడుకొనవచ్చును.

—కాకుటూరి పద్మావతి.

—అరటిపండ్ల పూరీలు—

ఒక సేరు మయిదాపిండి తీసికొనివచ్చి 20 తులముల నేతిలో వేసి వేయించవలెను. తర్వాత బాగాపండిన అరటిపండ్లనుజ్జు 1 సేరగునట్లుగాజూచి సంగ్రహించి దానిలో పదితులములవెన్న వేసి చక్కగాపిసుకవలెను. పైనచెప్పబడిన మైదా పిండియు తులమువీలకుల పొడియు పొట్టుతీసినబాదంపప్పు 5తులములు వేసి లెస్సగా అన్నిటినికలుపవలెను. విస్తారముగా పలుచగాకుండ ముద్దగాను చేసి వాటిని బిళ్ళలుబిళ్ళలుగా పలుచగాచేసి నేతిలో వేయించవలెను. ఎర్రగా అగునట్లుచూచి పళ్ళెములో పెట్టి వాటిపైన కలకండపొడి చల్లుచుండవలెను. ఇది శరీరమునకు దార్ఢ్యమునుగలుగ చేసి చలువనిచ్చును.

—కోకా పంకజం.

—పెఱుగు వడలు—

ఒక సేరు పెఱుగు గట్టిదిగాతీసి సన్నపాటిమల్లు గుడ్డలోపోసి మూటగట్టి చిలుకునకుతగిలించి నీరు బాగుగావడియునట్లు చేయవలెను. తర్వాత $\frac{1}{4}$ సేరు గోధుమపిండిని ఆముద్దలోకలిపి వుప్పు పచ్చిమిరపకాయలు అల్లం తగుమాత్రమునూరి ముద్దలోకలిపి బాణలిలోచమురుపోసి (నెయ్యికాని, నూనెగాని) మరగకాగనిచ్చి పైముద్దనువడలుగాతట్టి చమురులో వేసి యెఱ్ఱగాకాలనిచ్చి వేడివేడిగాభుజించిన బహు రుచిగానుండును.

—జె యల్. సావిత్రమ్మ.

—పెసరపిండివుండలు—

సేరుపచ్చపెసలురాళ్ళులేకుండచేసి కమ్మగా వచ్చువరకు వేయించవలెను. వేయించిన పెసరపప్పు విసరి దంచి పొట్టులేకుండా చెరగవలెను. $\frac{1}{4}$ సేరు బియ్యము ఎర్రదారుగావేయించి చేసియుంచిన పప్పులోచేర్చి మెత్తగావిసరవలెను. విసిరినపిండిని ఒకపళ్లెములోపోసి మధ్యదొన్నెగా చేయవలెను. $\frac{1}{2}$ వీశ చక్కెర మెత్తగాదంచి దొన్నెలోపోయవలెను. 5 తులముల కలకండ చిన్నముక్కలుగా కొట్టివేయవలెను. 3 తులముల క్రిస్మిస్ శుభ్రముగాఏరివేయవలెను. 5 తులముల జీడిపప్పుసన్నగాతరిగివేయవలెను. $\frac{1}{4}$ సేరు నెయ్యి బాగాకాచి ఆదొన్నెలోపోసి అంతయు బాగుగాకలపినతర్వాత నిమ్మకాయఅంతంతవుండలు కట్టవలయును. జాగ్రత్తచేసి యుంచినయెడల 2 వారములుండును.

—కోకా ధనలక్ష్మమ్మ.

# సంయుక్త పలుకులు

శ్రీమతులు పరుచూరి భువనేశ్వరీదేవి, అన్నపూర్ణాదేవిగార్లు

[స్థానేశ్వరమున గోరీజయచంద్రులు పృథ్వీరాజును ఢీకొనుటకు దండువిడిసిరి. పృథ్వీరాజు రెండు దండులని బెగడొందక మామగారు జయచంద్రులని సందేహించుచుండ ధర్మపత్ని సంయుక్త వారిజంకుకళంకుల మాన్ప నిట్లు ప్రబోధించుచున్నది.]

మూగెను శత్రుసైన్యములు ముప్పుఘటిల్లును గట్టికోటకున్
వేగమె యడ్డుకోవలయు వేఱయుపాయము లేదు సేనలన్
త్యాగముఁజేసి క్షాత్రసుత! పౌరుషదీప్తి వెలుంగ పోరు మో
యీ! గగనంబునన్ కుసుమవృష్టి సురల్ గురియన్ ముదంబుతో.
మానముదాల్చినన్ జెలులమానము ప్రాణముపో ఘటిల్లు యు
ద్ధాన ముహమ్మదీయులు నధర్మపరుల్ కపటాత్మసంయుతుల్
గానఁ ద్వదీయబాహుబలఖడ్గలతచ్ఛాయ నరాతిసేనఁ గో
పానలకీలదగ్ధశలభంబుగఁజేసి స్వరాజ్యమేలుకో.
వీరఖరాసిరక్తము స్రవించిన మోహనకేళికాసర
స్తీరవిహారమున్ సలుపుధీరుఁడ వీవిది యేల నాదులం
డీరణరంగమందుఁగలఁడేని సమిజ్జయ మొల్లనంచు దీ
నారవమే శరణ్యమని నమ్మి సుఖంపగ సింహపోతమా!
ఏలవిలంబనంబు విషమించు ప్రయత్నము కోటజొత్తు రీ
వేళ నరాతులందఱు వివేకవిహీనులమైతిమేని ప్రాణ
ణాలను గోలుపోవలయు నమ్ముము మిదే జయభేరి వేయుఁ గా
మేలు మహాత్మ! లెమ్మిక సమీకజయేందిర వేచియుండెఁగా.

పగను సాధింపనెంచి యీపందతోడ
నరుగుదెంచెను మాతండ్రి యల్లుఁడన్న
మాటమఱచి నీమీఁదకు గోటమీటు
మయ్యు మామగారన్న భయమ్ము నలదు.
ఏకసారులు నిన్ను తానెదిరి చివ్వ
బఱచియున్నట్టి యీపచ్చితురక మఱల
దండువిడియుట కకట! స్వాంతంబునందు
నేఱలజింపఁడో? దీనికేల భీతి?
హరిణశాబంబులెల్ల సంతంతగూడి
చుట్టుముట్టిన సింహకిశోరమేల

తొలఁగిపోవఁగ లోకపెడిదూకుదూకి
పోదివి వానిని వెనఁజీల్చి ప్రోవువిడక.
గుళ్లుగోపురములు గూలిపోకుండఁగ శత్రులతోఁ బోరుసలుపవలదె
మతగ్రంథముల్ నశమాసిపోకుండఁగ వైరులఁ బ్రహరించి ప్రబలవలదె
భారతరమణుల పాతివ్రత్యమ్ము గాపాడఁబగతుల జెండాడవలదె
భారతస్వాతంత్ర్యప్రతిభ దిక్కులఁ బ్రాక దూరదూరము వారిఁ ద్రోలవలదె
ప్రజల క్షామమ్మునుండి వేచాపవలదె దేశకళ్యాణరేఖ సాధింపవలదె
శత్రుగర్వనిర్వాపణశౌర్యధైర్యములకు నాదర్శకుండవై మెలఁగవలదె.
రక్తముప్పొంగ నాళముల రాజకుమారులు బొబ్బపెట్టి మా
శక్తిని జూడుఁడీయనుచు శాత్రవభీకరసింహగర్జనల్
దిక్తటభేదనంబులయి తేజరిలన్ గరవాలధారులై
భక్తిని దావకాజ్ఞ కిదె వచ్చుచునుండిరి హెచ్చరింపుమా!
పగఱఁ జెండాడు టనిలోనబంతులాట పునుకలను మెడఁదాల్చుట పూలమాల
శత్రురక్తము నీదగా సరసిజలము వీరపత్నిని నే గానొ పృథ్విరాజ!
కాంతను సంగరంబునకుఁగా విడఁద్రోచియుఁ దా గృహంబునన్
సంతసముండెనన్న విని సాధ్వసహింపఁగ నౌనె నేఁ ని
శ్చింతరణాంగణంబునకుఁ జేర విధిప్రతికూలమానె యా
శాంతనిశాంతమై మనయశస్సు మలీమసమౌనె నేటితో.

అబల పలుకు లివియని యనాదరమ్ము
సేయుదేమొ ధైర్యమ్మునన్ బాయలేదు
శూరపృథ్విరాజపతికి దారనౌట
మానినీమణి రసకాంతమణిదేమొ.

రాజపుత్రశౌర్యమ్ము విభ్రాజమన్న
రమణులకుమానప్రాణసంరక్షయన్న
భరతదేశము స్వాతంత్ర్యప్రతిమయన్న
అరయ హేతువు నీదుబాహాసిధార.

ఉక్కుసంకెళ్లఁ జిక్కి చేయూతలేక
నవయుమాతను రక్షింప కకట! సతము
శత్రులకుచేతులొగ్గడి పుత్త్రికుండు
పుట్టినన్ గిట్టినను నొక్కపోల్కిగాదె.

జననమరణాలు ప్రాణికి సహజమౌట
తెలిసియుండఁగ జంకేల? ధీరవర్య!
దేశకల్యాణమునకు వెన్దియకుండ
ప్రాణమర్పించువాఁడెగా భవ్యతముఁడు.

సత్యమేప్రక్క నాప్రక్క జయము ధ్రువము
లెమ్ము చింతింపఁబనిలేదు లెమ్ము ప్రియుఁడ!
దేశసంరక్షణమె మీకు స్థిరవ్రతమ్ము
వచ్చునెత్తురు నీఖడ్గపాయసంబు.

ఒజఖడ్గముఁ జెరుకుమిదే
యరినివహంబులను నరుక నదియునునాల్కల్
గొరకారఁ గోరెడునికమై
మరవుతోడిగి దాలుఁ బూనుమా శౌర్యనిధీ!

# వికటనితంబ

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

సంస్కృతవాఙ్మయమున విద్వాంసురాండ్రును, కవయిత్రులును జాలమందికలరు. అందు వికటనితంబకూడ నొక్కతెయని చెప్పవలెను. ఆమె కేవలము కవయిత్రియేగాక సంఘసంస్కారిణియనికూడఁ దెలిసికొననాధారముకలదు. ఈమె రచియించిన పద్యమొకటి దశరూపమునందును, కువలయానందాదులగు నర్వాచీనాలంకారగ్రంథములయందును గూడఁ గానవచ్చుచున్నది.౧ వికటనితంబావిషయకమగు పద్యద్వయము భోజుని శృంగార ప్రకాశమునఁ గన్పించుచున్నది.౨

౧. "అన్యాసు తావదుపమర్ద" దశరూపకమ్, IV ప్రకాశః. పు. 90.
కువలయానందః, ప్రస్తుతాంకురాలంకారః. పు.

౨. పునర్భూవిషయో యథా—
కేఽపి కటనితంబేన గిరాంగుంఫేన రంజితాః ।
నిందంతి నిజకాంతానాం సమౌగ్ధ్యమధురంవచః ॥
అనుభయాపేక్షా యథా—
వృష్టః కాలే వదతి స మాషం
తద్విపరీతం సస్యమరేణ్యే ।
లుంపతిచోష్ట్రిరం వాషం వా
తస్మైదత్తా వికటనితంబా ॥

[శృంగారప్రకాశః. 33. ప్రకా. పు. 160]

మీఁది మొదటిపద్యముంబట్టి వికటనితంబ వచోరచన చాలరమణీయమై యందఱి హృదయములను రంజింపఁజేయుననియు, నామెకవిత్వమునకు ముగ్ధులగువారెవ్వరును దమ కాంతల మధురాలాపములనుగూడ లెక్కచేయరనియుఁ దెలియవచ్చుచున్నది. రెండవ పద్యమున నామెయొకవిద్యావిహీనునకుఁ బెండ్లిచేయఁబడినదనియు, నతఁడు మాసమనుటకు మాషమనియు, మాషమనుటకు మాసమనియుఁ బల్కుచుండెడివాఁడనియు, నుష్ట్రమనుటకు "ఉష్ట్ర"మనిగాని "ఉష్ట"మనిగాని యనెడివాఁడనియు నిబంధింపఁబడినది.

మీఁది పద్యములవలన నామె విద్వాంసురాలనియు, నామెమగఁడు మూర్ఖుఁడని యునేగాక మఱియొకవిషయము తెలియుచున్నది. మొదటిపద్యముయొక్క యవతారిక "పునర్భూవిషయో యథా—" అని యుండుటంబట్టి యామె తొలుత నొకనికీయఁబడె ననియు, నతఁడు మృతినొందఁగా మఱియొకని బెండ్లియాడెననియు, ననఁగాఁ బునర్వివాహ మొనర్చుకొనెననియుఁ దెలియవచ్చుచున్నది. "శృంగారప్రకాశము" నకుఁబీఠికనువ్రాసిన మ-రా-శ్రీ ఎ. రంగస్వామిసరస్వతిగారుకూడ నీమెవిషయమై యిట్లువ్రాయుచున్నారు:

"Sanskrit Anthologists have references to a poetess named Vikatanitamba, although nothing is so far known about her life and work. Bhoja giving a verse long current as recording her praise,, says that she was a Punarbhu, a widow that had married again. This adds a very interesting social

detail about an authoress whose name still lives on in Sanskrit Literature, although her work appears to have been lost."

[*Last para of the Introduction to Sringaraprakasa edited by H. H. The MelkotaSwami.*]

దీనిఁబట్టి యక్కాలమున విధవావివాహములు ప్రచారములోనున్నట్లును, వికటనితంబ యట్టి సంఘసంస్కారమునఁబాల్గొని తనసిద్ధాంతమును వాక్కులలోఁగాక కార్యమునసే జూపించెననియును నిశ్చయింపవీలగుచున్నది.

భారతనారీమణులలోఁ బ్రాచీనకాలముననఁగూడ నిట్టిసంఘసంస్కారములు బయలు వెడలియుండుటచే మనవారు దేశమునుగూర్చి యెట్లుపాటుపడిరో స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. కాని సంఘసంస్కారిణు లిక్కాలముననే బయలుదేరిరని మనమనుకొన నవసరములేదు.

వికటనితంబరచించిన గ్రంథములేమియు నింతవఱకును మనకులభించియుండలేదు. కాని వారిపుణ్యమాయని యాలంకారికులుమాత్ర మచ్చటచ్చట యామె పద్యముల నుదాహరించుటచే నింతమాత్రమైనను దెలిసికొన నవకాశముగలిగినది. కావున విస్మృత గీర్వాణకవయిత్రులఁ దెలిసికొనుటకుఁ జాలవఱకు సాయపడుచున్న గీర్వాణాలంకారికు లెంతయుఁ బ్రశంసార్హులు.

వికటనితంబయొక్కపద్యమును దాని యాంధ్రానువాదమును గ్రిందఁ బొందు పఱతును.

శ్లో. అన్యాసు తావదుపమర్దసహాసు భృంగ!
లోలం వినోదయ మనస్సుమనోలతాసు
బాలామజాతరజసం కలికా మకాలే
వ్యర్థం కదర్థయసి కిం నవమల్లికాయాః.
గీ. తేఁటి! నీధాటికాఁగెడు తేటిపూల
తీవఁజేరి యానంద మెంతేనిగనుము;
బాల నరజస్క నవమల్లికామతల్లి
కలిక జేలనే చెఱుతు వకాలమందు.

[ప్రియుఁడనుకూలురగు ప్రౌఢనాయకలనువిడిచి యజ్ఞాతయౌవనయగు బాలికంగూర్చి ప్రయత్నించుచుండఁగాఁ బ్రౌఢనాయిక యొకర్తుకయన్యాపదేశముగఁ బలికినపద్యము.]

## రాధ

శ్రీమతి వెలగపూడి తులసీదేవిగారు

మోహనంబైనమూర్తి దోఁచినయంత
తుదలేని యానంద మొదవు కృష్ణ!
వలపుబుగ్గలలోని పసజిల్కు నీనవ్వు
గాంచకన్నుల నవ్వుగలుగు కృష్ణ!
చిడిముడిపడు నీకుసేవజేయుటకు నా
తనువెల్లఁజేతులై తనరు కృష్ణ!

అరవిరికంటముద్దార జూచెదు నీకు
హృదయమర్పింప నేవలతు కృష్ణ!
తలచికొని నవ్వినది లతాతన్వి మనవి
హారములలోని నర్మవ్యాపారములను
నన్ను బాలింప బృందావనముజూఁడ
మరలిరావోయి! మాయలమారికృష్ణ!




## మాధురికన్య

హిందు దేశ ఫిల్ము సామ్రాజ్యమునందు పన్నెకెక్కిన మాధురికన్య అసలు నామధేయము బెరిల్ క్లాసెను (Beryl clasen). ఈమె 1913 నవంబరు 3-కే దీని ఢిల్లీనగరమందు జననమొందెను. రోమను కేథలికు మతశాఖకు చెందినయువతి. నైనిటాల్ యందును, పాంచగనీయందును విద్యాభ్యాసము గావించెను.

1923 సం॥లో నీఫిల్ము సామ్రాజ్యమునందు ప్రవేశించి, "యంగుయిండియా పిక్చర్సు" (Young India Pictures) ఫిల్ముకంపెనీలో వరుసగ ఎనిమిది ఫిల్ములవరకు నటించెను. అవి "రాజపుట్ కెవలియరు" (Rajput Cavalier) "రోజ్ ఆవ్ కాష్మీరు" (Rose of Kashmir) "ఏస్ ఆఫ్ స్పేడ్సు" (Ace of Spades) "ఫైటు అన్ టు డెత్" (Fight unto Death) "ట్రయంఫ్ ఆఫ్ లవ్" (Triumph of Love) "మైమదర్లాండు" (My Motherland) "వేలియంటు ఏంజెలు" (Valia-nt Angel) "కృష్ణకుమారి" (Krishna Kumari)

1930 సం॥ జూనుమాసమునందు బరోడాలో నొకఫిల్మునందు నటించుచుండగా, గుఱ్ఱముపైనుండి పడుటచే దిట్టమగు గాయములు తగిలెను. ఈగాయము ఈమెను కొన్నిమాసములవరకు వైద్యశాలయందుండునట్లు చేసెను.

తిరిగి ఈమె 1931 సం॥లో శ్రీరంజితుఫిల్ము కంపెనీలో ప్రవేశించి, "లవ్ బర్డ్సు" (Love Birds) "సైరెను అవ్ బేగ్దాడు" (Siren of Baghdad)

1 :యన్. అప్పన్న నాయుడుగారు

"పెయింటెడ్ ఏంజెలు" (Painted Angel) "రాయలురోమాన్సు" (Royal Romance) "హూరీ రోషను" (Hoori-E-Roshan) "నాటీమెయిడు" (Naughty Maid) "సన్ ఆఫ్ ది ప్యూపుల్" (Son of the People) మొదలగు ఫిల్ములలో ప్రధానపాత్రల ధరించి నటించెను.

ఈమె నటించిన ఫిల్ములలో గొప్ప పేరెన్నికగాంచినవి "పెయింటెడ్ ఏంజెలు" (Painted Angel) "సైరెనుఆవ్ బేగ్దాడు" (Siren of Baghdad) "హూరీ రోషను" (Hoori-E-Roshan) మొదలైనవి.

1932 సం॥లో నీమె రంజితు ఫిల్ముకంపెనీ విడిచిపెట్టి క్రొత్తగా పెట్టబడిన "జయంతు పిక్చర్సు" ఫిల్ముకంపెనీలో కంట్రాక్టుపై ప్రవేశించి వారిమొదటి ఫిల్మైన "గాడ్ ఆఫ్ వార్" (God of war) లేక "రణదేవత" యను ఫిల్మునందు నటించెను.

తరువాత రాయలుఫిల్ము కంపెనీ వారిచే తీయబడిన "బ్లేకుగోస్టు" (Black Ghost) యను ఫిల్మునందు మాస్టరువిఠలు (Master Vital) తో కలసి ప్రధానపాత్రధారిణిగా నటించెను. ఈఫిల్ము ఛంఠీజె దేవుగారిచే డైరక్టు చేయబడెను.

నాట్యమాడుట (Dancing), రంగులువేయుట (Painting), ఈదుట (Swimming), అల్లుట (Knitting), పాడుట (Singing) మొదలగునవి నీమె నిత్యకృత్యములు. ఇంగ్లీషు, ఫ్రెంచిభాషలు తెలియును.

మాట్లాడు ఫిల్ములలో నటించుటకు, ఈమె

ప్రస్తుతము ఉరుదు, హిందీపాటలను (Songs) నేర్చుకొనుచున్నది.

ఈమె తన ఫిల్ములందు గొప్పగ నటించుటచే మిక్కిలి ప్రఖ్యాతి గాంచెను. ఈమె బహు సుందరమైనది. మృదువైన శరీరమును, నల్లని కనుబొమలును, పొడవైన కేశములును గలిగిన మంచి సౌందర్యవంతురాలు. సాధువైన హృదయము గలది.

* * *

# శ్రీమతి గోహారు

నిడదవోలు వేంకటలక్ష్మణరావుగారు

హైందవఫిల్ముకార్యాలయములలో సుందరీమణులగు నటువరాండ్రు కొలదిమందిమాత్రమే గలరు. అట్టివారలలో సహజసౌందర్యముచే నొప్పారుచున్న నటీశిరోరత్నము శ్రీమతి గోహారు.

ఈమె పూర్తినామధేయము గోహారు క. మామజీ. మహమ్మదీయమతస్థురాలు. జననము లాహోరుపట్టణమున, గౌరవమర్యాదగల సంపన్న గృహములో, తే 19-2-1910 ది ఉదయకాలమందు.

చిన్నతనమునుండియు, జాతివేరైనను హైందవనారీమణుల యుదారత్వములయందును, సుస్థిర భావోద్రేకభావములయందును, వారిధీరోదాత్తతల యందును యభిలాషమెండుగా నుండెడిది. తుద కవియే పట్టుపడినవి. చదువునందును, నాట్యము నందును కొంతకాలముజరిపి, పిమ్మట తల్లిదండ్రులతో కలసి బొంబాయినగరము వచ్చెను.

ప్రథమమున ఈమె శ్రీకృష్ణా ఫిల్ముకంపెనీలో నటువరాలుగా ప్రవేశించెను. ఇందు కొన్ని నెలలు మాత్రమే ఉండెను. ఈకంపెనీలో ఈమెనటించిన, జ్ఞాపకమున్న ఫిల్ము 'ఫార్చ్యూను అఫ్ ఫూల్స్' (Fortune of Fools).

పిమ్మట ఈమె తన 15 వ యేట యనగా 1925 సంవత్సరములో కోహినూరు ఫిల్ముకంపెనీలో నటువరాలుగా ప్రవేశించెను. ఈ కంపెనీలో ఈమె నటించిన మేటిఫిల్ముగాథలు "ఢిల్లీదొంగ" (Thief of Delhi). "బ్రీఫ్ లెస్ బారిష్టరు" (Briefless Barrister) "సామ్రాట్టు శిలాదిత్య" (Samrat Siladitya) "ముంతాజ్ మహాల్" (Mumtaz Mahal) "రాకవాత్" (Raw' Kawat) "సతీమాద్రి" (Sati Madri) "సింధుసుమారి" (Sumari of Sind) "గుణవతి" (Educated Wife) "సింహళద్వీపసుందరి" (Fairy of Simhadvipa) "షిరీను ఫర్హాద్" (Shirin Forhad) "టైపిస్టుగర్లు" (Typist Girl) "గుణసుందరి"(Guna Sundari) అయియున్నవి. వీటిఅన్నిటి లోను ఈమె ప్రధాననాయికాపాత్రలు ధరించి, గొప్పగానటించి, ఘనమైనకీర్తి సంపాదించెను.

కోహినూరు ఫిల్ముకంపెనీ మూసివేసినతరువాత ఈమె కొందరినటకులతోను, నటీమణులతోను అప్పటి జగదీశఫిల్ముకంపెనీలో ప్రవేశించెను. తానేర్చుకొనిన, తనకు పట్టుపడిన హైందవనారీసాంప్రదాయతత్వములను ఫిల్ము మూలకముగా వెల్లడి చేయుటకు ఈకంపెనీ చాల వీలుగానుండెను. అదియుగాక వీర లట్టిసాంఘికగాథలనే ఫిల్ముకథల క్రింద తీసిరి. ఈకంపెనీలో ఈమె నటించిన మేటి చలనపత్రములు మూడుమాత్రమేగలవు. అవి "విశ్వమోహిని" (ViswaMohini) "గృహలక్ష్మి" (Grihalakshmi) "చంద్రముఖి" (ChandraMukhi) ఈ పైగాథలలో ఈమె శ్రీయుత రాజాశాండోయను సుప్రసిద్ధసినీమానటకునితో కలసి నటించెను. వారిద్దరు చూపిన అన్యోన్యపరస్పరాభినయనములు, భావోద్రేకములు, భార్యాభర్త లొకరిపైనొకరు చూపు నిర్మలమైన, నిశ్చలమైన, ప్రేమపరిరంభములు చూడవలయునేగాని వ్రాయజాలము.

జగదీశఫిల్ముకంపెనీ మూసివేసిన తరువాత యీమె కోహినూరు, జగదీశఫిల్ముకంపెనీలలో నటించునప్పుడు యీమెకు యభినయనములను నేర్పిన యభినయనవేత్త (Director) యగు శ్రీయుత చందూలాల్ జె షాగారు, 1930 సంవత్సరములో శ్రీ రంజిత్తుఫిల్ముకంపెనీని స్థాపించిరి. ఈ రంజిత్తుఫిల్ముకంపెనీలోనే యీమెయొకముఖ్యభాగస్థురాలుగాను,

ముఖ్యనటకురాలుగాను ఉన్నది.

ఈకంపెనీలోకూడా జగదీశలోవలె ఈమెకు నారీమణుల నాటీర్త్వములను వెల్లడిచేయుట కవకాశముకలిగెను. ఇందీమె నటించిన ప్రథమచలనపటము "దాంపత్యము" (Husband and Wife). పిమ్మట నటించిన మేటిఫిల్ముగాథలు "మై డార్లింగు" (My Darling) "బెగ్గరు గర్లు" (Beggar Girl) "రాజపుటానీ"(Rasputin) "మామన్ వర్షిప్" (Mammon Worship) "వనకుసుమము"(Wild Flower) యనునవి.

అన్నిటికన్న మిన్నయని యెన్నదగినఫిల్ము "వనకుసుమము." ఇందీమె చూపిన యభినయములు వర్ణనాతీతములు. చాంచల్యము, సంతోషము, విచారము, కోపము, యీర్ష్య, ఓరిమి, శాంతి, సానుభూతి మొదలుగాగలయాక్షను లొక్కొక్కటి చూపించినదీయువతి. అప్పటికప్పుడే మరుక్షణమునకు మరోయాక్షను!! చూపిన నటనలు చూపించుటలేదు. అత్యద్భుతము!!!

ఈమె నటనవలన ఈమె కీర్తిచంద్రుడు యావత్తు భారతదేశమందు ప్రకాశించుచున్నాడు. కొన్ని నెలలు శరీరమస్వస్థతగా నుండుటచే, గాలిమార్పు నిమిత్తమై బెంగుళూరునగరమునకు 1931 వ సంవత్సరములో పోయెను. మధ్యదారిలో మదరాసునగరమున ఘనమైన స్వాగతమును, వెండికరండకములను పౌరులవలన స్వీకరించెను.

కొంతకాలమునకే శరీరము స్వస్థతగానుండుటచే బొంబాయితిరుగావచ్చి రంజిత్తు ఫిల్ముకంపెనీలో ప్రవేశించెను.

అప్పటికి కంపెనీవారు మాట్లాడేఫిల్ము (Talkie Films) తీయదలంచియుండుటచే నీమెను యట్టిఫిల్ములలో నటించుటకుగాను నియమించిరి. వీరి మొదటటాకీఫిల్ము "కచదేవయాని" (Kacha Devayani) యను పురాణచరితము. రెండవది మిగులగొప్పదియు, చాలధనము వెచ్చించినట్టియు, హైందవ నారీమణియొక్క కష్టసుఖములు తెలియజేయునట్టి ఫిల్ము యగు "రాధారాణి (Divine Lady of Radharani). మూడవది "సతిసావిత్రి" (Satyavan Savitri) ప్రస్తుతము పూర్తికావచ్చుచున్న ఫిల్ము సాంఘిక నాటకము "శైలబాల" (Shail Bala).

ఈ ఫిల్ములయినతర్వాత ఈమె కొంతకాలము విశ్రాంతి తీసుకొనదలచియున్నది.

ఒకప్పుడు లాహోరుపట్టణమున సినిమా నట్టువరాండ్ర యభినయనపోటీపరీక్ష జరిగెను. ఆపరీక్షలో ఈమెకును, శ్రీమతి సులోచనకును పోటీజరిగెను. అందు శ్రీమతి సులోచనకును 9007 ఓట్లును, ఈమెకు 9759 ఓట్లును వచ్చెను. పరీక్షాధికారులీమెకు "మూవీస్" వారి బంగారుపతకము బహుమతిచేసిరి. కాని యిది పక్షపాతమున జరిగినదని చాలమంది యనుకొనుచుండెడివారు. మొత్తముమీద యీమె 10 సాంఘికఫిల్ములయందును, 8 చారిత్రకఫిల్ములందును నటించెను. 4 యితరసాంప్రదాయకములైన ఫిల్ములందును నటించెను.

ఈమెతో శ్రీయుతులు రాజాశాండో, డి. ఆర్. బిల్లిమోరియా, ఖలీల్ అహమ్మదు, వైద్యా, భగవాన్ దాస యనుసుప్రసిద్ధసినిమానటకాగ్రేసరులుకలసి నటింతురు.

ఈమెకు యింగ్లీషు, హిందీ చదువను, వ్రాయను, మాట్లాడను చేతనగును. మంచిపాటగత్తె. మధురమైన కంఠస్వరము. దీర్ఘములగు, నల్లనగువేణి. నల్లనై విశాలములైన నయనములుగలిగి సహజసౌందర్యముచే నొప్పారుచున్న సంపన్నయువతి. మానాభిమానమర్యాదలుగల మానవతి. నటనలందారితేరిన నారీమణి. నవరసముల భావములను చూపుటలో నారితేరిననాతి. నగుమోముగల నట్టువరాలు. గుఱ్ఱపుస్వారియందును, కత్తిసామునందునుయద్వితీయురాలు. గర్వమెరుగని ఘనురాలు.

విశ్రాంతికాలమప్పుడు సినిమావార్తలనే చదువును. తనజీవితమంతయు ఫిల్ముపరిశ్రమలయందే వినియోగింప నిశ్చయించిన తన్వి. ఇప్పటి యీమె వయస్సు 22 సంవత్సరములు.

దైవమీమె నాయురారోగ్యైశ్వర్యవంతురాలిగా నొనర్చి యీమెకీర్తి నాచంద్రార్కము ప్రకాశించునట్లాశీర్వదించును గాత!

# శిథిలప్రేమ

ఓలేటి సీతారామమూర్తిగారు

[భగ్నహృదయుఁడగు సలీము ప్రణయదేవతయగు ననార్కలి గోరీపై నాలపించిన విషాదగీతికలు]

౧

ఓయనార్కళీ! నీశోణితాయతాశ్రు
లెడఁదబ్రద్దలువాఱ స్రవించిపోవఁ
బొగిలితివిభోలు:— ఈగడ్డిపూలుకూడ
జాలిగా ముకుళించె విషాదదృష్టి.

౨

ధారుణీపథిఁ బ్రేమకర్పూరహాసిత
దివ్యసౌరభస్నిగ్ధసందేశమధుర
గానసంపదనించి మాధుర్యంబొసంగు
ప్రాణకాంత! తావకచిహ్నమౌనసమాధి.

౩

నాఁడు మనహృదయాలు సంధ్యాంతమందు
జిలుగుకౌఁగిలింతలలో హసించినంత
జీరుకాడు చీఁకటితెరఁ జీల్చికొనుచుఁ
బ్రకృతిననురాగకౌముదీప్రతిభతోఁచె.

౪

అపుడు విశ్వవిమ్మోయాఁదల నల్లనూచిఁ
యమరనందన సుమమంగళాక్షతలను
గురిసి దీవించె మనలను బరిమళించు
నకలుషప్రేమ జీవకల్యాణగీతి.

౫

అస్మదీయాంతరంగభామామృతప్ర
దీప్తయువదీపకళిక త్వదీయనయన
విలసితాలోకనప్రేమలలితకాంతి
సమయశోకతమోరాశిఁ గుములుచుంటి.

౬

నీసమాధిపై నవ్వువెన్నెలలుబఱపు
మల్లికాసూనములఁ గుమారిల్లఁజేయు
గాటమగువేడినిట్టూర్పుగములతోడ
నీనిరాశాప్రణయజీవి యిటుకృశించు.

౭

ప్రేమసౌరభమింక సుమాళింపఁబోని
నా యెడఁదమల్లెపూవు విన్నాణముడిగి
ప్రబలశైశిరమిహికార్ద్రవాతహతిని
త్రుళ్ళి, వసివాడి, పోరలెను ధూళినకట!

౮

మనవిషాదప్రణయగాథ మలినశోభ
హృదయకుహరాన వెల్గొందు నీసమాధిఁ
దడుపుచుండెద నయనోద్గతాశ్రుధార
బ్రతుకుమృతజీవరాగగభస్తికాఁగ.

౯

లలితవాసంతకల్యాణకలితగీతి
పాడలేనింక! మృత్యునిశ్వాసధూమ
భీకరతమోగ్రవీథిలో వెడలిపోవఁ
గాచుకొనియుంటి శుష్కరాగప్రవృత్తి.

## వనకుమారీదేవి — శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

ఈమహారాణి రాజపుత్రస్థానములో జయపురాధీశ్వరుని తనయ. క్రీ. శ. ౧౮౫౦ సంవత్సరమున జన్మించి ౧౮౭౯ సంవత్సరము మొదలు ౧౮౯౭ వరకు ఆంధ్రదేశసంస్థానములలో ఉత్తరసర్కారులలోని విజయనగరసంస్థానమును పరిపాలించిన శ్రీమదానంద గజపతి మహారాజా జీ. సీ. ఐ. ఈ. వారిదేవేరి. రూపసి. బీదలపాలిటి పెన్నిధాన. పురజనులను పుత్రులవలెచూచెడిది. కరుణామయి. నాధునిజనయిత్రిమాటజవదాటి యెరుగనిది. అధిపు డూరలేనియపుడు అతని భుక్తావశేషపదార్థమును భోజనకాలమందు నించుకభుజించినగాని తానేమియు భుజించెడిదికాదు. పతినిధ్యానించికాని యేపనియు జేసెడిదికాదు. నవ్వులాటలకైనను నసృతమాడియెరుగదు. తనపతి రాచకార్యములనిమిత్త మన్యప్రదేశములకేగిన నాతని దివ్యవిగ్రహమును నిరతము నిర్మలభక్తితోగొలచి పూజించుచుండెడిది. భోజనపువేళ భర్తపేర నొకకబళమువేరనిడి మరియు భుజించెడిది. అసూయాదిగుణము లామెకడ కలికములోనికైనను లేవు. పతి దానప్రియుడని సదా దానము జేయుచుండెడిది. పతియె దైవముగ మనసారనెంచి వర్తించు సుగుణమణి. ఈసాధ్వీమతల్లి తనసలువదిరియొకటవయేట మేనెలనైదవతేదీరాత్రి పదిగంటలకు జీవితేశ్వరు నాత్మనిలిపి సర్వబంధువులను, పరివారమును, దీనజనులను దుఃఖసాగరగర్భమున గూలద్రోచి కాశీపట్టణమున భౌతికశరీరమును విడిచి స్వర్గమలంకరించెను. అట్టితరి ఆనందగజపతిమహారాజు చెన్నపట్టణముననుండెను. ఆరాజశేఖరున కీవృత్తాంతమేమియును తెలియదు. పాపమాప్రభువు తన సహధర్మిణి కాశీనుండి చెన్నపురికి వచ్చుననియు, నీలగిరికొండుగల యాత్మీయసౌధమున నివసించి, తరువాత ఆమెకు బొంబాయినగరమును జూపించి పుత్తేరవలెననియు తలంచి తత్ప్రయాణసన్నాహములన్నియును ఆయత్తపరచి సిద్ధముగానుండెను. కాని దుర్విధి ఆయానందమును చూచి సహించలేకపోయెను. అహా! విధిదాట నెవ్వరివశము? దేవి మరణవార్త తంత్రీమూలమున తెలియవచ్చెను. భూవిభు డావిషాదవార్త విని హృదయసంధులు చలింప గుండెలవియ మంత్రెబ్బ...న తెగిపడిన ఛింతకాయవలె మూర్ఛిల్లి భూమిపై పడెను. నిష్కళంకప్రణయజీవుల ...మిట్టిదిగదా! దేవికి యింతకు మున్నొకింత శరీర మస్వాస్థ్యముగ నున్నదని తెలిసినంతనె ఆమె ఆరోగ్యముకొరకు దేవాలయముల ప్రార్థనాదులు చేయించెను. శాస్త్రచోదితమైన యనేకదానధర్మములు చేసెను. మైలాపురమునగల మాదాగుడికి వెయ్యిరూపాయలిచ్చెను. వెయ్యేల! ఎవ్వరేదిచెప్పిన నవన్నియు నొనర్చెను. కాని యేమిలాభము? దైవబలము చాలదయ్యెను. జీవితేశ్వరినిబాసిన నాటనోశ అహర్నిశము లోకక్కతీరున నవ్వుతో ప్రకాశించు నారాజచంద్రునిమోము వాడిపోయి నన్నగిలి నల్లనయ్యెను. ఆటపాటల మాటమరచి శోకమున మునింగెను. తుదకాధరాకాంతు డాత్మసతీవియోగతప్తహృదయుడై వనటకృశించి నిరాశాజీవితమున అకాలమృత్యువదనభీకరక్రూరదంష్ట్రిల జిక్కుకొనియెను.

# మార్పు

శ్రీమతి తాయి రత్నమాలగారు

పుష్ప సర్వపుష్పాలంకృతయై సకలాభరణభూషితయై బంగారుకుంకుమబరిణె చేబూని తన చెల్లెలను బొమ్మలకొలువునకు పిలుచుటకుబయలుదేరి వెడలుచుండెడిది. ఇంట మేనత్త వరుసలు వరుసలుగ బొమ్మలుపేర్చి శృంగారించెడిది.

ఇట్లే పుష్ప మాతృహీనయైన నాలుగేండ్లనుండియు ఏకొదువయులేక అల్లారుముద్దుగ జరుగుచున్నది. పుష్ప ఒక్కనిముసమగపడకున్న తల్లడిల్లెడివాడు తండ్రి. పుత్రీవాత్సల్యమున పుష్పకు నాన్నకొన్న బొమ్మలు లెక్కకుమించి. పుష్పబొమ్మలుపెట్టిందంటే చూడవచ్చినజనం మితిమీరి. పుష్పజీవితంలో మార్పుకలగటానికికారణం నాన్న మళ్లీ పెళ్లిచేసుకోవటమే. నాన్న పెళ్లిచేసుకుంటే పేరంటంచేద్దామని ముచ్చటపడిందేకాని మారుటమ్మ తనని ఏమికష్ట పెడుతుందోఅన్న ఆలోచన లేకపోయింది ఆనాటిపుష్పకి. ఈ అమ్మ ఇంటికి వచ్చిరావటంతోనే పుష్ప అత్తసాకవుతీసుకుంది. ఇప్పుడు పుష్పకి ఏదికావలసినా అమ్మనడగటం అమ్మ నాకేంతెలుసు మీనాన్ననడుగు అనటం ఈపరిస్థితులలో పుష్పసంగతిచెప్ప నవసరంలేదు. ఎవరితోమాట్లాడుతున్నాసరే పుష్పవచ్చిందంటే ముద్దుపెట్టుకునే నాన్న ఇప్పుడు పుష్పని చూస్తేనే కస్సుమంటాడు. ఈ సంగతి కనిపెట్టినవాన్నగుమాస్తాలు పుష్పనిచూచి వేడి కన్నీటిచుక్కలు రాల్చి ఎంతలోవింతమార్పుఅని గుసగుసలాడుకునేవారు.

దసరాపండుగవచ్చింది. శారదానవరాత్రులలో బొమ్మలకొలువుపెట్టాలి. పుష్పఅమ్మ తనచెల్లెలు కమలనిపిలుపించుకొని తనదగ్గరపెట్టుకుంది. పండుగదినములలో కమలనిముస్తాబు చేసి పేరంటంపిలుచుటకు పంపి తాను బొమ్మలు సర్ది శృంగారించుకొన్నది. పుష్పమాట తలపనే లేదు. పుష్పఇదంతాచూచింది. ఆచిన్నిఅమాయకపుబాలహృదయము బ్రద్దలైంది. ఏమూలనో పుట్టిపెరిగిన కమల తనబొమ్మలకు సర్వాధికారిణిఅయింది. పుష్ప వారముదినములుకట్టిన పావడ చొక్కా మాసిపోయినవి. ఇకముందు తనగతిఏమికానున్నదో ఎవ్వరికెరుక? పుట్టినదాది మాతృ ప్రేమామృతమును గ్రోలియెఱుంగని ఆబాల ఆనాడు తోటలోనికివెళ్లి బిగ్గరగ విలపించినది. పుష్పతోపాటు ప్రకృతిఅంతా విలపించినట్లయింది. పుష్పగుచ్ఛములు పుష్పనుచూచి కన్నీటి బిందువు లొలికించినవి. పుష్పహృదయానికెక్కడశాంతికుదురలేదు. విచారగ్రస్తహృదయయై బరువెక్కిన పాదద్వయముతో మెల్లగా నొకచీకటిగదిలో తలుపులువైచుకొని కటికరాతినేలను పడుకొని తనలోతాను ఏడ్చియేడ్చి నిద్రించినది. పేరంటమునకు వచ్చినవారెల్లరు పుష్పకనబడ మికి ఆశ్చర్యపడి ఈమార్పుకలుగుట కీసవతితల్లియే కారణమనితలపోసిరి. పుష్ప ఆనిదురలో నొకవిచిత్రసుఖస్వప్నముగాంచినది. తాను వెలలేనివస్త్రములుధరించి సర్వాభరణములతో బంగారు కుంకుమబరిణచేతనిడుకొని పేరంటమునకు బయలుదేరుచుండగా, అమ్మ—తానెప్పుడునూ చూడనటువంటికన్నతల్లి—రెండుచేతులుపట్టుకొని అతిప్రేమతో ఆలింగనమొనర్చుకొని తన శిరస్సు ముద్దులాడుచున్నట్లూ. ఆప్రేమలో పుష్ప అంతులేనిఆనందములో పొంగిపోయింది. ఈమార్పుకలుగటానికి కారణం సవతితల్లే.




### ఒకే కాన్పున ముగ్గురు బిడ్డలు :—

విశాఖపట్టణముజిల్లా శృంగవరపుకోటతాలూకా కల్లంపూడి గ్రామమున ఒక శూద్రవనితకు ఒకే కాన్పున ముగ్గురుబిడ్డలు పుట్టిరి. మొదట ఒక ఆడపిల్ల పుట్టెను. ఆరుగంటలతరువాత ఇరువురు మగబిడ్డలు పుట్టిరి. ముగ్గురు శిశువులును మరునాడు మరణించిరి. వైద్యసాహాయ్యమునుపొంది తల్లి సురక్షితయై యున్నది.

### నాలుగు చేతులు నాలుగు కాళ్లు గల బిడ్డ :—

బర్మాయందలి పెగూలో సివిలుహాస్పిటలులో ఒక బర్మాస్త్రీ ఒక వింతశిశువును ప్రసవించెను. ఆబిడ్డకు నాలుగుచేతులు నాలుగుకాళ్లుఉండెను. పుట్టిన పదునైదు నిమిషములకే ఆబిడ్డ చనిపోయెను.

### ఒకే కాన్పున ముగ్గురు బిడ్డలు :—

సికిందరాబాదులో కూలిపని చేసికొను స్త్రీ ఆస్పత్రిలో ప్రసవించెను, ముగ్గురుబిడ్డలు పుట్టిరి. ఇరువురు మగపిల్లలు, ఒకఆడపిల్ల. మాతాశిశువులు కులాసాగా ఉన్నారు.

### రెండు ముక్కులు నాలుగు కళ్లు గల బిడ్డ :—

తిరుపత్తూరు తాలూకాకుచేరిన అగరంపేటలో ముత్తరాజుకులమునకు చెందిన నొక స్త్రీ ఒక వింతశిశువును ప్రసవించెను. శిశువు గర్భములోనే మృతినొంది పుట్టెను. రెండుతలలు, రెండుముక్కులు, కనులు చెవులు కాళ్లు చేతులు నాల్గేసి, మొండెముమాత్ర మొక్కటి. స్త్రీపురుషచిహ్నంగములు లేవు.

### చంద్రలోకమున ఎత్తైన పర్వతము :—

చంద్రలోకమునందలి పర్వతములన్నిటిలోకి ఎత్తుఅయినది కనుగొనబడినది. ఈదీనిఎత్తు ఇరువదినాలుగువేల అడుగులు.

### సముద్రమున మిక్కిలి లోతైన ప్రదేశము :—

పసిఫిక్ మహాసముద్రమున మిండానో ప్రాంతమున మిక్కిలిలోతైన ప్రదేశముగలదు. సముద్రమున ఇంతకంటె లోతైన ప్రదేశము ఈనాటికి కనుగొనబడలేదు. దీనిలోతు 32,089 అడుగులు.

### వర్షము: సూర్యుడు :—

మేఘములనుండి వానవచ్చునుగదా! నదులు, సరస్సులు, సముద్రములు మొదలగు వానినుండి గైకొనబడిన ఆవిరిరూపపునీరే మేఘములు. సూర్యుడు భూమినుండి సెకండుకు 16,00,000 టన్నులనీటిని గైకొనుచున్నాడు. అదేరేటున భూమిమీద ప్రతిసెకండుకు ఏదోఒకప్రదేశమున వర్షము కురియుచుండును.

# పత్రికాపరిచయము

**శక్తి:—**

ప్రతిశుక్రవారము వెలువడు వారపత్రిక. ¼ క్రౌనుసైజున పుస్తకరూపమున ప్రచురింపబడుచున్నది. సంపాదకుడు: మొక్కపాటి నరసింహశాస్త్రిగారు. 'బారిష్టరు పార్వతీశము' గ్రంథకర్తగా నరసింహశాస్త్రిగారిపేరు తెలుగుమాగాణియందు అల్లుకొనియున్నది. హాస్యరచనకుతోడు చిన్నికథలనుగూడ చక్కగ వ్రాయగల సమర్థులు. ఇట్టివారు తెనుగుపత్రికానిర్వహణమునకు పూనుకొనినది ఎంతయు స్తుతింపదగిన విషయము. ఈవారపత్రిక మొదటిసంచిక సెప్టెంబరు 16-వ తేదీని వెలువడినది. పూజ్యస్థానమునున్న 'బాపూజీ: మూబాఫ్' అను బసవరాజు అప్పారావుగారిపాట మనోహరముగనున్నది. డాక్టరు బుర్రా శేషగిరిరావు ఎమ్. ఏ. పి. హెచ్. డిగారు శక్తినిగూర్చియు, శ్రీకల్యాణానంద భారతీ మంతాచార్యస్వాములవారు వేదవ్యాసహృదయమునుగూర్చియు వ్యాసములు వ్రాసియున్నారు. శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారి బండమబ్బదు వారికిసహజమగు హాస్యమున ఒప్పుచున్నది. ములుకుట్ల పేరిదీక్షితులు బి. ఏ. యల్. టి; తెలికిచెర్ల కృష్ణమూర్తి ఎం. ఏ. మొదలగు విద్యాధికుల రచనములు, శ్రీ శివశంకరశాస్త్రిగారి 'ప్రతాపకుమారి' అను వ్యాసము లీసంచికకు పుష్టిని గూర్చుచున్నవి. నండూరి వేంకటసుబ్బారావుగారి 'పూలబాసలు' మనోజ్ఞము. విమర్శనలు మొగమోటము పొంతబోవకున్నను ఎడనెడ మోటుపుంతలో బడుచున్నవి. మృదుశైలి అవలంబించిన బాగుండునని మాతలంపు. విద్యాధికులగు నరసింహశాస్త్రిగారు విద్యాధికులతోడ్పాటున నడుపుచున్న 'శక్తి' చిరము వర్ధిల్లి తెనుగుతల్లిని సేవించుగాక! కార్యస్థానము బెజవాడ.

**జ్ఞానవాహిని:—**

ఆర్యమతరహస్యములను, ఆంధ్రభాషాసౌందర్యమును వివరించు ద్విమాసపత్రిక. నాస్తికమతాళిదళనసన్నాహిని, కలితనిగమాగమార్థావగాహిని, సన్నుతాంధ్రోక్తిసేవనోత్సాహినియై ఆవిర్భవించిన ఈ నూతనాంధ్రపత్రికకు మాస్వాగతము. సంపాదకుడు మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. డిమ్మిసైజున ప్రచురింపబడుచున్నది. సంవత్సరచందా 2-0-0. ఆంగీరస శ్రావణ భాద్రపదములదియైన ఈ తొలిసంచికయందు జ్ఞానము, మతము: దీనివలని ప్రయోజనము, హిందూమతప్రాశస్త్యము, ఆస్తికతత్త్వము, ఆత్మనిర్ణయము, సర్వమతసారము మున్నగు విషయములుగలవు. వలయువారు తెనాలి, రామలింగేశ్వరపేటయందుగల ఈ పత్రికాసంపాదకులపేర వ్రాయునది.

**ది ఇండియన్ నాచురోపత్:—**

**The Indian Naturopath.** ది ఇండియన్ నాచురోపతిక్ అసోసియేషనువారి మాసపత్రిక. ప్రకృతివైద్యవిధానమును ప్రచారము చేయుటకేర్పడిన ఆంగ్లపత్రిక. క్రౌను ¼ సైజున ప్రచురింపబడుచున్నది. సాలుచందా ఒక్కరూపాయిమాత్రము. మూడవసంపుటము 7, 8 సంచికలు మాకందినవి. ప్రకృతివైద్యవిధానమున నమ్మకముగలవారు అవశ్యము పఠింపదగుపత్రిక: చిరునామా: బెజవాడ.

**జమీందారీరైతు:—**

సొంతముద్రణాలయములేమిని ఈ పత్రిక కొంతకాలము ప్రచారము నిలుపవలసివచ్చినది. ప్రస్తుతము స్వంతముద్రణాలయమును చేకూర్చుకొని తిరిగి ఆంధ్రులను సందర్శింపవచ్చిన ఈ పత్రికకు మాస్వాగతము. సెప్టెంబరు 10, 17 తేదీలయందు వెలువడిన రెండవసంపుటపు ఒకటిరెండుసంచికలు మాకార్యాలయ మలంకరించినవి. యథోచితవిషయములతో నొప్పుచున్నవి. పత్రిక బహుకాలము వర్ధిల్లుగాకయని కోరెదము. జమీందారీరైతుల ఆర్థికసాంఘికవ్యవసాయిక భాగ్యోదయమునకు ప్రతిశనివారము ప్రచురింపబడు ఈవారపత్రిక సాలుచందా నాలుగురూపాయిలు. డబుల్ రాయలుసైజు. చిరునామా: నెల్లూరు వెంకట్రామానాయుడు, సంపాదకుడు, జమీందారీరైతు, గాంధిచౌక్, నెల్లూరు.




## సహగమనము :—

ఆగ్రాప్రాంతమున ఒక బ్రాహ్మణయువతి చనిపోయినభర్తతో సహగమనము చేయగోరెను. ఇదివిని జనులు గుంపులుగ మూగిరి. ఆగ్రామములోని పెద్దలు సహగమనము చేయరాదని నచ్చజెప్పి యొప్పించిరి. ప్రజాసమూహము వెడలిపోక యెదురుతిరిగి ఆమె దర్శనమునకై పట్టుబట్టెను. ఆమె యింటితలుపులు లోపల తాళము వేసుకొనెను. ప్రజలగుంపు ఆమెయింటికి నిప్పుఅంటించ ప్రయత్నించిరి. ఇంటిలోపలినుండి పోలీసు వారు తుపాకులను కాల్చిరి. కాని ప్రయోజనము లేకపోయెను. పిమ్మట పోలీసువారు యింటిలోనుండి బయిటికివచ్చి మూడువైపులకు గుండ్లను కాల్చిరి. అంతలో ఆగుంపు యింటిలోనికి ప్రవేశించి ఆస్త్రీని చనిపోయిన ఆమెభర్తచితిపద్దకు యెత్తుకొనిపోయిరి. పోలీసువారు జనసమూహమును వెంబడించి తుపాకులను గాల్చిరి. ఆస్త్రీ విడిపింపబడి యింటికి గొంపోబడెను. మొత్తము 50 రౌండ్ల బక్కు-పాటు కాల్పబడెను.

## భర్తరోగనివారణకై భార్య శరీర మాంసము కోసి యిచ్చుట:—

బర్మాపైభాగములో కాథయను గ్రామమున నొక సతీమణి తన భర్త రోగనివారణకై తనశరీరము నుండి మాంసమును కోసి దానితో కూరచేసి భర్తకు పెట్టెను. భర్త మలేరియా వ్యాధిచే బాధపడుచుండెను. రోగికి ఆప్తబంధువు లెవరయినను తన శరీరమునుండి మాంసమునుతీసి కూరచేసి రోగికి పెట్టినయెడల రోగము నివారణమగునని చైనావారికి మూఢవిశ్వాసముగలదు. ఈయువతికిగూడ అ విశ్వాసమునకు అనుకూలురాలు. ఎట్టి రోగమునకైనను ఈమాంసచికిత్స అమృతమువలె పనిచేయును. మాంసము మాత్రము రోగికి ఆప్తబంధువులదిగా నుండవలెను. ఈయువతి తన వక్షస్థలమునుండి మాంసమునుకోసి దానితో కూరచేసి భర్తకు వడ్డించెను. భర్త భోజనము చేయుచు అనుమానించి తుదకు నిజస్థితిని తెలుసుకొనెను. భార్యకు గాయము నుండి రక్తమింకను స్రవించుచునే యుండెను. ఆమెను వెంటనే ఆసుపత్రికి పంపిరి. అక్కడఆమె యింకను చికిత్స పొందుచున్నది. పోలీసువారు ఆమెమీద ఆత్మహత్యానేరమును ఆరోపించిరి. ఆమె తనకట్టి దురుద్దేశము లేదనియు, భర్త రోగనివారణకే తానట్టి త్యాగమును చేసితిననియు చెప్పెను. —ఆంధ్రపత్రిక.

## చిత్రగుప్తుని పొరపాటు: యమలోకమునుండి వాపసు :—

లాహోరునందు గోవులుమండి నివాసియగు తేజాఅనునతడు రోగగ్రస్తుడుకాగా డాక్టర్లువచ్చి అతనిని చూచి జీవించు నాశలేదని చెప్పిరి. అతడు రాత్రి 12 గంటల తర్వాత మృతినొందెను. మామూలు ప్రకారము అతని బంధువులు శవమునకు జరుపు విధినంతయు జరిపిరి. గోమయముతో నేలను అలికి అతనిని ఆచోట పరుండపెట్టిరి. ఆప్తవారు శవముచుట్టును చేరి యేడ్చుచుండిరి. ఉదయము శవమును దహనమునకై తీసికొని వెళ్లుటకు ఏర్పాటు చేసిరి. శవమును కట్టెమీద పెట్టుచుండగా "రామరామ"అనుచులేచి అచ్చట ఉన్నవారితో అతడు తన స్వర్గానుభవమును గురించి చెప్పెను. "నన్ను స్వర్గమునకు తీసికొని వెళ్లిరి. కాని కావలసిన మనుష్యుడు నేనుకాదని చెప్పి నన్నుయింక కొంతకాలము భూలోకములో సాధుజీవనము గడుపమని పంపివేసిరి."

—గోలకొండ.

# గ్రంథ పరిచయము

**వాయువిమానము:—**

వైజ్ఞానికగ్రంథమండలిలో ప్రథమగ్రంథము. చిత్తరంజన్ అను వారపత్రికను, ఆంధ్రరాష్ట్రము అను మాసపత్రికను నిర్వహించిన ప్రజ్ఞానిధులును, మంచివక్తలును, దేశసేవానిరతులును అగు శ్రీ గాడేపల్లి సూర్యనారాయణశర్మగారిచే రచియింపబడినది. శాస్త్రీయగ్రంథప్రచురణకు గడంగిన ఈ గ్రంథమండలి వారిని ఎంతయు కొనియాడుదుము. ఈ గ్రంథమున వాయువిమానముల క్రమాగతచరిత్ర, నిర్మాణాభివృద్ధి, వివిధరూపములు మొదలగు విశేషములు సులభశైలిలో సచిత్రములుగ వర్ణింపబడినవి. ప్రోత్సహింపదగిన ప్రయత్నము. గ్రంథము క్రౌనుసైజున 104 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు 1-0-0. దొరుకుచోటు: వైజ్ఞానిక గ్రంథమండలి, ఆర్యాపురము, రాజమండ్రి.

**అమరావతీస్తూపము, ఇతర వ్యాసములు:—**

ఆంధ్రపరిశోధకమణులు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచే వ్రాయబడినది. ఈ గ్రంథమున అయిదువ్యాసములు గలవు. అమరావతీస్తూపమునుగూర్చిన వ్యాసము గౌరవస్థానమంది గ్రంథనామమునకు కారణమగుట సముచితముగనున్నది. ఈవ్యాసములలో మమ్ముల నెక్కువగ నాకర్షించినది 'అనాదృతవాఙ్మయము.' నీటికోలది తామరయనునట్లు ఈవ్యాసము చదివినకొలదిని క్రొత్తవిషయములను స్ఫురింపజేయుచున్నది. ఆంధ్రతాముద్రగల ఈగ్రంథమును విశ్వవిద్యాలయములవారు పాఠ్యగ్రంథముగా నిర్ణయించినది ప్రస్తుతింపదగినది. స్థలాభావమున ఈగ్రంథమునుగూర్చి విపులముగ వ్రాయజాలక పోవుచున్నందులకు విచారించుచున్నారము. అక్షరాస్యుడగు ప్రతిఆంధ్రుడును చదువదగుగ్రంథమనిన చాలును. గ్రంథముద్రణాదులు సుందరముగనున్నవి. గ్లేజుకాగితములు. క్రౌనుసైజున 132 పుటలు. వెల 0-12-0. పుస్తకములకొఱకు: మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, 2/19 అరప్ప మొదలివీథి, పురశవాకము, మద్రాసు.

**కథాసరిత్సాగరము:—**

ఒకటిరెండు మూడుభాగములకు గౌణవాచకముగానుండుట కనుపగునట్లు సుప్రసిద్ధమగు కథాసరిత్సాగరము కథను తెనుగువచనముగా శ్రీహరి సుబ్బారావుగారు వెలయించినారు. క్రౌనుసైజున 128 పుటలు. గ్లేజుకాగితములు. వెల0-10-0 అణాలు. ప్రచురణకర్తలు: సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు, మదరాసు.

**రఘునాథ్:—**

సారస్వతచంద్రికాగ్రంథమాల రెండవకుసుమము. చరిత్రాత్మకనాటకము. కర్త శ్రీకోటుకూరు సత్యనారాయణరావు బహద్దరువారు. దివంగతురాలైన వారిసతీమణికి ఈనాటకము అంకితము చేయబడినది. ఇందు శివాజిపాత్ర యథోచితముగ చిత్రితము. ఇందలి కొన్నిరంగములు కరుణారసముతో జాలువాఱుచున్నవి. 'మహావీరులచరిత్రముల ప్రబోధించి నన్నింతవానిగజేసిన పరమదేశభక్తురాలు నాతల్లి పవిత్రచరణారవిందముల కెరగి సన్నద్ధుడ నయ్యెదను. ఇట్టి తల్లులెందరో వెలసినగదా మాతృదేశదాస్యము తొలగిపోవుట' అను శివాజివాక్యములు— 'ఈరఘునాథుడు గాయపడియు మాతృదేశముకొరకు పెనగులాడును. ప్రాణములున్నంతవరకును పెనగులాడును. ఈరక్తము మాతృభూమిలో ప్రవహింపవలెను. ఈకంఠము మాతృదేవిను కొరకై తెగిపోవలెను. ఇది మానాయకుని యాజ్ఞ— మాధర్మము.' అనురఘునాథుని వాక్యములు ఈనాటకమునందలి జాతీయభావమునకు నిదర్శనములు. నాట్యకళాప్రపూర్ణ శ్రీమాన్ టి. రాఘవాచార్యులవారి




కేసరికుటీరము: బెంగుళూరి బ్రాంచిభవనము: ముఖద్వారము.



కేసరీకుటీరము: బెంగుళూరి బ్రాంచి భవనము

కేసరిగారి దంతధావనవనీతము, మల్లిక, మాలతి టాయిలెట్సు చేయు ఫ్యాక్టరీ.

నాటకమునుగూర్చి ఇట్లు వ్రాయుచున్నారు: 'ఈనాటకములో మూడు నాలుగురంగములు నాటకకళోచిత దృష్టితో హితవుగానున్నవి. శైలియు, కళోచితమైన ముగింపును నాకు చాల ఎక్కువగానచ్చినది.' గ్రంథ ముద్రణము సుందరము. క్రౌనుసైజు 126 పుటలు. మంచిదళసరికాగితములు. వెల 1-0-0. చిరునామా: సారస్వతచంద్రికాగ్రంథమాల, ఆర్లపాడు, గంపలగూడెంపోస్టు, కృష్ణాజిల్లా.

ప్రాథమిక ప్రకృతి శాస్త్రము.—

ఆరోగ్యశాస్త్రసమేతము. రెండవఫారమునకు అనువుగనుండునట్లు వ్రాయబడినది. టి. వి. చెల్లప్ప శాస్త్రిఅండుసన్సువారు ప్రచురించినది. శాస్త్రగ్రంథరచనము దేశభాషలయందు సుకరముగాదు. అయినను విద్వాన్ మంకాల శ్రీపతిగారు శ్రద్ధవహించి దీనిని రచియించినారు. రచనము సాఫీగను, సరళముగను ఉన్నది. విషయము సులభముగ బోధపడుచున్నది. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు, 162 పుటలు, వెల 0-12-0 అణాలు. శ్రీపతిగారిట్టినిర్దుష్టభాషలో మరికొన్ని శాస్త్రగ్రంథములు రచియింతురేని భాషాపోషకము కాగలదు.

గోవు:—

ఏలూరువాస్తవ్యులు బొడ్డు బాపిరాజుశ్రేష్ఠిగారిచే రచియింపబడి ఏలూరు గోసంరక్షణసమితీత్రివార్షికకావ్యబహుమానములలో ద్వితీయగణ్యము. గోప్రభావమును విపులముగ వర్ణించుచున్నది. కవిత్వము చక్కగనున్నది. క్రౌనుసైజున 44 పుటలు.

కామధేనువు:—

లక్కవరము సంస్థానవిద్వాంసులు కొత్తపల్లి సుందరరామయ్యగారిచే రచియింపబడి ఏలూరు గోసంరక్షణసమితీత్రివార్షికకావ్యబహుమానములలో తృతీయగణ్యము. గోవునుగూర్చిన కొన్ని అపూర్వవిషయములుగలవు. క్రౌనుసైజున 38 పుటలు.

గోప్రభావము:—

తెనాలివాస్తవ్యులు మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే రచియింపబడి ఏలూరు గోసంరక్షణసమితీత్రివార్షికకావ్యబహుమానములలో ప్రథమగణ్యము. క్రౌనుసైజున 34 పుటలు.

వేమభూపాలవిజయము:—

గ్రంథకర్త రావాడ వేంకటరామశాస్త్రిగారు. శ్రీకృష్ణదేవరాయగ్రంథమాలలో 5-వ పుష్పము. రెడ్డిరాజులలో వేమభూపాలుడు సుప్రసిద్ధుడు. అతని విజయములకీర్తించు ఈగ్రంథము ఆంధ్రులకు అవశ్యము సమాదరణీయము. కవిత ధారాశుద్ధిగలిగియున్నది. లఘుటిప్పణమును చేర్చబడినది. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు. 80 పుటలు. వెల 0-8-0. చిరునామా: మేనేజరు, భారతిభవనము, కౌలుబజారు, బళ్లారి.

ప్రకృతి తత్వప్రకాశిక:—

వేదాంతషణ్ముఖదాసులవారిచే వ్రాయబడినది. ఏలూరు బ్రహ్మజ్ఞానసమాజమువారి ఆరవనెంబరు గ్రంథము. ప్రశ్నోత్తరరూపమునను న్న వేదాంతగ్రంథము. హిందూమతసిద్ధాంతములను బోధించుచున్నది. క్రౌనుసైజు. గ్లేజుకాగితములు 44 పుటలు. వెల 0-4-0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేరు తూర్పువీథి ఏలూరుఅను చిరునామాకు వ్రాయునది.



**కృతజ్ఞతాసమాధానము:—**

"గతమాసపు మా హిందూసుందరి 'కథావటి విన్నపము' అను శీర్షికతో వ్రాసుకొన్న నివేదనపైని యితర సోదరసోదరీమణులు క్రియచేతగాని, మాటచేతగాని యెట్టి సానుభూతియు గనుపరుపకయున్నను సజాతీయయు గుణగ్రహణపరాయణయునగు గృహలక్ష్మి తనయగ్రసోదరియందు గలయభిమానవశమునను నామధేయమునుబట్టి కష్టసుఖము లెరిగిన కారణమునను జాలికొంది అక్కా గతికేవగవకుము, సోదరు లేమిచేసి నను మానినను సోదరీమణులైన హిందూసుందరి అకాలపరిసమాప్తినొందకుండ జేయూతనొసగి నిలువబెట్ట వలయునని చేసిన హెచ్చరికకై మాసుందరి యామె కనేకకృతజ్ఞతాభినందనము లర్పించుచున్నది. ఇదిగాంచిన పిదపనైన నాంధ్రవిదుషీమణులకును, వారిభర్తలగువారికిని దయకలుగక పోవునాయని యాశయొకటి పెట్టుకొని ప్రచారము నొక్కమారు మానజాలక అప్పుచేసి పప్పుగూడన్న సామెతగా నింకను బుట్టి నంత వరకు ఋణముజేసి యేఅర్థభోజనమో చేయుచు నింక గొన్నాళ్ళు జూచెదనని యాబీదవేషమునసే మసల జలపెట్టినది. మానుషయత్నమెల్లవ్యర్థమగునో నది పరమేశ్వరుని నియామకమేయని తలంచి ఆది యంతియే యున్నది కాబోలునని నిశ్చయించి భావినిర్ణయము చేసికొనగలదు."

—హిందూసుందరి.

**ఉత్తమసంతానకాంక్ష:—**

"మనపూర్వు లుత్తమసంతానముకొరకు నిర్ణయించిన విధులు గృహ్యసూత్రములను, ఉపనిషత్తులను కొన్నిస్మృతులను జదివినయెడల దెలియవగును. ఈసందర్భమున బృహదారణ్యకోపనిషత్తునందు అష్టమాధ్యాయ చతుర్థబ్రాహ్మణమున జెల్పబడిన ప్రక్రియను సంగ్రహముగ నిట వివరించెదను. అందలివిషయములు చాలవఱకిప్పుడు చాదస్తముగను పిచ్చిగను కానుపించుచున్నను విధులు కాలానుసరణముగ నప్పటి వ్యవహారముల ననుకరించి యుండును గాన వానినుండి మనము ముఖ్యములగు వానినే గ్రహింతము. పుత్రమన్థనమను కర్మనుగూర్చి చెప్పెడు నాబ్రాహ్మణము చెప్పిన జంగమస్థావరాత్మకమైన సమస్తభూతములసారము భూమి, భూమిసార ముదకములు, ఉదకసార మోషధులు, ఓషధులసారము పుష్పములు, పుష్పసారము ఫలములు, ఫలసారము పురుషుడు, పురుషసారము రేతస్సు. రేతస్సుయొక్క సద్వినియోగముకొరకు బ్రహ్మ స్త్రీలను సృజించెను. వారితో సంసర్గమువలన ప్రజలు సంతానము బడయుదురు. ప్రజననేంద్రియమును యజ్ఞవేదికగ సంభావించి గౌరవించవలెననియు స్త్రీపురుషసంసర్గమును వాజపేయయాగతుల్యముగ నెంచవలసినదనియు నందు నిరూపించిరి. అట్టి గౌరవభావముతో స్త్రీసుఖము ననుభవించువాడు స్త్రీలనుకృతమును పొందగలడు. కేవల కామాతురుడైనవాని కాపుణ్యము లభించక యది యంతయు స్త్రీకే లభించును. స్త్రీలలో

రజస్వలా స్త్రీ మిసులక్రేష్ఠురాలు. అట్టి స్త్రీని పురుషుడు నాలుగవదివసము స్నానానంతరముపొంది తేజము, బలము, ధనము, కీర్తి, దానివలన తనకు లభింపవలెనని దేవతలను కోరుచుండెను. ఆనాడు స్త్రీ మొఱకుదనము జూపినయెడల దానిని భూషణాదిబహుమానముచే వశపరచుకొనవలయును. మంచిమాటలచేత నామె లొంగనియెడల దండతాడనమువలనగాని హస్తతాడనము వలనగాని వశపరచుకొనవలయును. భార్య భర్తృ విరుద్ధముగ సంచరించుచున్నట్లు తెలిసినను పురుషుడామెను మండలించి కాపురము చెడగొట్టకుండుమార్గములు తెలుపబడెను. బహిష్ఠయైన స్త్రీయొక్క స్నానానంతరము ధాన్యము నామెచేత దంపింపవలెను.

(1) తెల్లని దేహకాంతి గలవాడును, నూరేండ్లు ఆయుస్సు గలవాడును, ఒక వేదమును సాంగముగా చదువుకొనగల్గినవాడునగు పుత్రుడు తనకు కలుగవలయునని కోరికగలపక్షమున పాలియ్యముతో క్షీరాన్నమును వండించి స్త్రీపురుషు లిద్దరును భుజింపవలెను. అప్పు డట్టిపుత్రుని బడయుటకు వారు సమర్థులగుదురు. (2) కపిల పింగళవర్ణములు గలిగి రెండువేదములు చదివి సంపూర్ణాయుర్దాయముగల పుత్రులు కలుగవలయునను కోరిక యున్నపక్షమున పైబియ్యముతో దధ్యోదనము చేయించి, దానిని నేతితో కలిపి, స్త్రీపురుషు లిద్దరు తినవలెను. (3) శ్యామవర్ణము కలిగి లోహితాక్షుడగు పుత్రుడు పుట్టి వాడు మూడు వేదములను చదివి పూర్ణాయువు గలవాడు కావలెనను కుతూహలమున్నపక్షమున భార్య దంపినబియ్యముతో శుద్ధాన్నమును క్షీరాదులు కలియని యన్నమును నేతితో కలిపి స్త్రీపురుషులు భక్షించవలెను. (4) పూర్ణాయువుగలదియు గృహకృత్యనిర్వహణనిపుణురాలునగు కుమార్తె కలుగవలెనను అభిలాషకల్గిన పక్షమున నువ్వులపులగము వండించి నేతితో కలిపి స్త్రీపురుషు లిరువురు భక్షించవలెను. (5) సమస్తవేదాధ్యయనము చేసి సంపూర్ణాయువు గలవాడును పండితుడును ప్రసిద్ధుడును సమితాగముడు నగు (సభాపూజ్యుడు) పుత్రు డుదయించవలెనను కోరిక గలయెడల వయసు ముదిరిన లేక అధికవయస్సుగల (ఆర్షభేణవా) యెద్దుమాంసముతో కలిపి పచనము చేసిన మాంసాన్నమున నేతిని చేర్చి స్త్రీపురుషులిరువురును భక్షించవలెను. ఈచెప్పిన క్షీరాన్నాది భక్షణము చేసిన పిమ్మట భార్యాభర్త లొకరినొక రాలింగనము చేసికొనవలెను. 'నేను ప్రాణమును, నీవు వాక్కువు. ప్రాణమునకు వాక్కు స్వాధీనమగునట్లు నీవు నాకు స్వాధీనమైతివి. నేను సామవేదము, నీవు ఋగ్వేదము. సామవేదమునకు ఋగ్వేద మాధారమైనట్లు నాకు నీవాధారమైయున్నావు. నే నంతరిక్షము, నీవు భూమివి. భూమ్యంతరిక్షములు లోకమునకు తల్లిదండ్రులైనట్లు మనము మన సంతానమునకు దలిదండ్రుల మగుదుము గాన నీవిటు రమ్ము. పుంస్త్వముగల పుత్రధనముకొరకు మనమిద్దరమును సంసిద్ధులమగుదము' అని భర్త భార్యతో ననవలెను. శ్రేష్ఠతరమగు సంతానాపేక్షచే నాడు కాపురములు చేయుట కాకాంక్షించుచుండిరని తెల్పుట కీక్రిందివాక్యము ప్రమాణము: "తేజోరూపమైన అరణులచే నశ్వినీదేవతలు మథింపబడిన రీతిని పది యవమాసమున నీగర్భమునుండి తేజస్కుడగు పుత్రుడుదయించుటకు నేను గర్భహోమము చేయుచున్నాను. ఏ ప్రకారము భూమి అగ్నిగర్భయో, ద్యులోక మింద్రగర్భయో, దిశలు వాయుగర్భములో అప్రకారమే నీగర్భము సుపుత్రుని ధరించుగాక!' ప్రసవసమయమున పురుషుడు 'యథావాయుః పుష్కరిణీం' అనుమంత్రమును పఠించి మంత్రోదకమామెపై ప్రోక్షించెడివాడు. స్వరూపమునకు హానికలుగకుండ వాయువు తటాకమును చలింపజేయునట్లు ప్రసూతికగర్భముచలించుచు, మావితో గూడ పిండము వెలికివచ్చి సుఖప్రసవమును భర్తగూడ యపేక్షించుచుండెడివాడు. జాతకర్మహోమము చేయునపుడు జననీజనకు లీరీతిని ప్రార్థించుచుండిరి. 'ఈ నాగృహమందు పుత్రరూపముతో వృద్ధిపొందిన నేను పెక్కంద్ర పోషింపగల్గినవాడ నగుదునుగాక! ఈ నాపుత్రునిసంతతి సంతానముతోను, పశువులతో నెడతెగని సంపద ననుభవించుచుండును గాక! నాప్రాణములను మనస్సుతోకూడ నీకు (అగ్నికి) అర్పించుచున్నాను'. భూషితమైన శిశువునకు

పిమ్మట తండ్రి పెరుగును తేనెను చేతినికలిపి సువర్ణముతో నాకించి తదనంతరము తల్లి చన్ను కుడిపించును. అట్లు శిశువుచేత తల్లిచన్నుబాలు త్రాగించకముందు సరస్వతీదేవినావాహనించి యీరీతిని ప్రార్థించును: "ఓసరస్వతీ! సమస్తప్రాణులకు స్థితిహేతువై అన్నక్షీరములను కలుగజేయుచు సమస్తకర్మఫలముల గ్రహించి వానినొసంగుచు దేవాదిసమస్తభూతముల పోషించు నీస్తనమును నాపుత్రుడు పానముచేయుటకాశుభలక్షణములను నాభార్యరొమ్ములం దంకురింపజేయుమా.' దుర్బలశరీరములుగలిగి భార్య, పుత్రిక, కోడలు, సోదరి గర్భిణిగనున్నదను మాట వినినతోడనే కంపము నొందెదు ప్రస్తుతకాలమున పైనవ్రాసినదంతయు నాశ్చర్యకరముగనుంట వింతకాదు. స్త్రీ గర్భవతిరైన దాదిగ కాఫీ, ఓవల్‌టీను, గ్లాక్సో, హార్లిక్సు, నెసిల్సు, మెలిన్సులోనగు కృత్రిమాహారములతో తల్లిని శిశుజననమైనపిదప మాతా శిశువులను పోషింపనభిలషియున్న నీ కాలమున పూర్వకాలపుదంపతుల నాయురారోగ్యములు విస్మయజనకములుగ నుండును. జన్మనిరోధనవిధాన (Birth control) మొక్కటి తలనూపికొన్ని దేశములందది ప్రభుత్వాదరణము బడయుచున్నది. భరతఖండమున బాల్యవివాహములు ప్రబలముకానికాలమునందుగల వివాహవిధుల నవలంబించిన పక్షమున ప్రజాబాహుళ్యము, దుర్బలసంతానము, క్షుద్బాధ, దరిద్రము, శిశుమరణములు నామమాత్రములు కాగలవు." హిందూసుందరి.

—దుగ్గిరాల సూర్యప్రకాశరావు.

దీపావళి:—

"మనమాచరించు నుత్సవములలో దీపావళియు మిన్నయని చెప్పవచ్చును. ఇయ్యది ప్రతివత్సరమునందు నాశ్వయుజబహుళమున నమావాస్యదినమున జరుపఁబడుచుండును. దీపములయొక్క యావళి—సమూహమీదినమునందెల్లెడలఁగానవచ్చుట దీనికీపేరు కల్గియుండవచ్చును. పలురకముల మతాబాలును వింతవింతలగుఁగాంతుల నీనుచు మీఁది యాకాశమునే యాదినమున వెల్లడి చేయుచుండును. మనదేశమున సంవత్సరము పొడుగునను వివిధములగుఁ బర్వములును, పండుగలును దటస్థించుచుండును. కాని కొన్ని ప్రాంతములయందు గొన్నిమాత్రమే ముఖ్యములుగ లెక్కింపఁబడును. దక్షిణదేశమున ముఖ్యములగు వినాయకచతుర్థియు, మకరసంక్రమణము నుత్తరదేశమున ముఖ్యములుకావు. ఉత్తరదేశమున ముఖ్యములగు నాగపంచమి, హోలికోత్సవము దక్షిణదేశమునఁ బ్రచారమున లేవు. కాని యీ దీపావళిమాత్ర మన్నిప్రాంతములయందును, ముఖ్యమైన పండుగగనే యెంచఁబడుచున్నది. ఈ యుత్సవమొక్క మనహిందూదేశము నందేగాక ప్రపంచమంతటను జరుపఁబడుచున్నది. మనపురాణములఁబట్టి చూచినచో శ్రీకృష్ణునిచే నరకాసురుఁడు చతుర్దశిదినమున సంహరింపఁబడినట్లును, లోకకంటకుఁడగు నాతనిచావువిని యపరిమితానందభరితులగు లోకులు మరునటిదినమున నుత్సవమును జేసికొనినట్లును, దీపావళి కియ్యదియే కారణమనియుఁ దెలియవచ్చుచున్నది. కాని మనపురాణగాథల నెఱుఁగనివారును, వానియాథార్థ్యము నంగీకరింపనివారునగు పాశ్చాత్యులు—ప్రాచ్యులు నౌత్తరాహులుకూడ దీనినాచరించుటచేఁ బైయితిహాసమునందఱు నంగీకరింపక పోవచ్చును. యమునికిని, లక్ష్మికిని దీపావళితో మిక్కిలి సంబంధమున్నట్లును, దీపావళి యన్నిదేశములందును జరుపఁబడుచుండుటకు మీఁది దేవతలతోడి సంబంధమే కారణమైనట్లును టాడ్డుపండితుఁడు తనరాజస్థానకథావళియం దీవిషయమును బ్రతిపాదించినట్లును, ఇదివఱకొకరు "ఆంధ్రభారతి"యందుఁ బ్రకటించియున్నారు. [సం 1. సంచిక 7] కావున నావిషయమునే మరలఁ బ్రతిపాదించుట చర్వితచర్వణమగునని మరలఁ బ్రతిపాదించుట మానివేసితిని. కాని మరియొక చిన్నవిషయమును మాత్రము నిరూపించెదను. సంవత్సరమునకుఁగల రెండయనములలో దక్షిణాయనముకంటె నుత్తరాయణమే యుత్తమోత్తమమైనదని మనపురాణములందుఁ జెప్పఁబడుచున్నది. ఉపనిషద్రూపములగు భగవద్గీతలయందుఁగూడ నీవిషయమే చెప్పఁబడియున్నది.

"యత్రకాలేత్వనావృత్తి మావృత్తించైవయోగినః।
ప్రయాతాయాన్తితంకాలం వక్ష్యామిభరతర్షభ॥
అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్రప్రయాతాగచ్ఛన్తి బ్రహ్మబ్రహ్మవిదోజనాః॥
ధూమోరాత్రిస్తథాకృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।
తత్రచాంద్రమసంజ్యోతి ర్యోగీప్రాప్యనివర్తతే॥
శుక్లకృష్ణే గతీహ్యేతే జగతశ్శాశ్వతేమతే।
ఏకయాయాత్యనావృత్తి మన్యయావర్తతేపునః॥"

పైభగవద్గీతావచనములంబట్టి యుత్తరాయణము పగటివంటిదనియు, దక్షిణాయనము రాత్రివంటి దనియు, మొదటిది జ్ఞానదాయకమైనదనియు, రెండవది యజ్ఞానజనకమైనదనియు, నుత్తరాయణమున మరణించినచోఁ బునరావృత్తి యుండదనియు, దక్షిణాయనమున మరణించినచోఁ బునరావృత్తి యుండును నియుఁ, గావున నుత్తరాయణ ముత్కృష్టమైనదనియుఁ దెలియవచ్చుచున్నది. రాత్రిందివరూపములగు దక్షిణో త్తరాయణములనడుమ నీదీపావళి ప్రభాతకాలమువంటిది. అనఁగా రాత్రియందుఁ దురీయయామమువంటిది. రేయి తమోనిద్ర మైమఱచినప్రజలు వేకువజామునలేచి యిల్లలికి ముగ్గులుపెట్టి పగటికొఱకు నిరీక్షించు చుందురు. ఇయ్యది సర్వజనానుభవసిద్ధము. ఆరీతినే పుణ్యజనలభ్యమగు నుత్తరాయణమును బ్రతీక్షించుచు ప్రజలు దక్షిణాయనపు చరమయామమును దీపావళియందుఁ బ్రాభాతిక కాల్యకృత్యముల నీదీపప్రజ్వలనము రూపున విశదీకరించుచున్నారు. దీపావళియే వేకువజామునకుఁ బ్రారంభమని యంగీకరింపవలెను. అట్లయి నచో శాశ్వసంచా, మతాబా—టపాకీ మొదలగువవికూడ వేఁకువజామునఁ బ్రజలను మేల్కొల్పుటకుఁ బరికరములుగ నుపయోగించు నేమో! —బులుసు వేంకటరమణయ్య

సంగీతము: దశరా:—

"ప్రతివత్సరము దశరాదినములలో ఆంధ్రదేశమునందలి ప్రతిపట్టణమునందును సంగీతకచ్చేరీలను గావించి ప్రజలకెక్కుడు ముదమొనకూర్పబడుచుండెనుగాని రాను రాను ఈ పద్ధతి పెక్కుపట్టణములలో విడనాడ బడుచున్నది. ద్రవిడదేశమున గానముపై జూపెడు అభిమానము ఆంధ్రదేశమున గానబడదు. సంగీతవిద్వాం సుల కాదేశమున ఆదరణయధికము. మన ఆంధ్రదేశమున సంగీతమునం దారితేరినవారు లేకపోలేదు. శ్రీయు తులు హరి నాగభూషణం, శర్మసోదరులు, కె. అరుణాచెలంనాయుడుగార్లవంటి యుత్తమగాయక శిఖామ ణులుయున్నను వారికి ఆదరణ, ప్రోత్సాహములు తక్కువ. సంగీతకళ యభివృద్ధిపొందుటకు పలువురు పలు మార్గములు తెలుపుచున్నారు. చిత్రకళను పునరుద్ధరింప గోరువారందరును నడుములుగట్టి ధృఢప్రయత్న ములు గావించుట ధర్మము. జాతీయకళాశాల మున్నగు ప్రతిష్టాపనలు గానవిద్యకు రొక్కడు ప్రోత్సాహ మొసగుటలేదు. ఇట్టిస్థితియందు ఈ కళాభివృద్ధికి సంగీతమునందభిమానముగల స్త్రీపురుషులెల్లరును రొక్క డుకృషి సలుపవలయునని వేరుగ చెప్పనుట అనవసరము. సంగీతమును అభివృద్ధిగాంచ జేయుటకు కొన్నిస భలు సమావేశ పరుపబడుచున్నది. కేవలము తీర్మానములలో సంతృప్తిచెందెడిసభల కింకొకసభను చేర్చినందు వలన లాభములేదు. దక్షిణదేశమున నేటికిని ఆంధ్రగానమే పరిపాటయందున్నది. ఆంధ్రనృపులు దక్షిణదేశ మునందంతటను తమ పరాక్రమముచే జయించి పరిపాలించియుండ ఆంధ్రుడగు త్యాగరాజభక్తుడు తన అపూర్వగానమహిమాతిశయముచే దక్షిణదేశమునందంతటను దిగ్విజయమును బడయగలిగెను. తమిళదేశము

నందుగాని, మళయాళదేశము నందుగాని, కన్నడదేశము నందుగాని, నేటికిని సంగీత విద్వాంసులందరును, త్యాగరాజ కృతులనే సభలయందు పాడుచుండుట మనము గాంచుచున్నారము. వినోదముకొరకు యొకటి రెండు కృతులనుమాత్రము స్వభాషయందు పాడుచుందురు. సంగీత విద్వాంసు లాంధ్రమునందు పాడవలసి వచ్చుటచేతనే ఆంధ్రభాషలో దక్షిణదేశమునందంతటను పరిచయమేర్పడినది. ఉత్తరహిందూస్థానము నందును, వంగదేశమునందును, సంగీతవిద్యకు ఈలోపల ప్రోత్సాహ మొసగబడుచున్నది. త్యాగరాయుని వాక్యములనుబట్టిచూచినచో సంగీతకళ బ్రహ్మానంద మనుభవించుట కొకప్రధానసాధనమని తేటపడు చున్నది. నాదము మూలముగకలిగెడు సౌఖ్యము, ఆనందము, ముక్తిమార్గములుగ పరిగణింపబడినవి. నాదము బ్రహ్మస్వరూపముగ నెంచబడుచున్నది. నాదోపాసనచే నారద, తుంబురు, త్యాగరాయాది మహామహులు తరించినటుల నిదర్శనములు గాన్పించుచున్నవి. సంగీతమున కట్టియుత్కృష్టాదర్శము కలదని ఆధునికులు మర చినను, సంగీతస్వరూపము భరతఖండమునందు నశింపలేదు. సంగీతకళయందెట్టి మార్పు చేయబోయినను స్వరూపము నశింపకుండ కాపాడుట యవసరము. నాదముయొక్క యుత్కృష్టదశను కాపాడుటకే సంగీత విద్వాంసులు పాటుపడవలయును. శ్రీకృష్ణుడు తన వేణుగానముచే ప్రపంచమునంతను మోహపరవశము గావించి తానానందము ననుభవించెను. ఆగానమహిమచే ననేకులు తరించిరి. అటులనే ప్రతిసంగీతపాఠకు డును తన సామర్థ్యవిశేషముచే ప్రత్యేకప్రతిభను చూపగలుగును. హిందూదేశమున గాత్రపాఠకుడు తన సామర్థ్యవిశేషముచే ప్రత్యేకప్రతిభనుచూపగలుగును గాని రాగమునుగాని పల్లవినిగాని పాడునపుడు ప్రక్క నుండెడు జంత్రజ్ఞుడు గాత్రపాట సంప్రాయముగ ననుసరించుటలేదు. తనప్రతిభను తానుకూడ ప్రత్యే కముగ జూపెట్టుటకు ప్రయత్నించును. మృదంగవాద్యకుడు పాటయొక్కగతి తప్పకుండ ననుసరించుటలో సంతృప్తిచెందక ప్రత్యేకవ్యక్తిత్వమును జూపెట్టును. సంగీతవిద్వాంసుడితరుల నానందపరచుటకు ప్రయత్నిం చుచున్నను ఆత్మానందమును ననుభవించుటకే ప్రయత్నించుచుండును. గానవిద్యయందు ప్రజలు తగిన ప్రోత్సాహము కల్పరచని కారణమువలన సంగీతవిద్వాంసులితరవృత్తులలో ప్రవేశించుట కవకాశమేర్పడు చున్నది. ఆంగ్లవిద్యార్థికులు రాగము, పల్లవి, మొదలగునవి పాడుట కాలహరణముగ నెంచుకొందురు. జన సామాన్యమునకు శాస్త్రసిద్ధమగు సంగీతమునందు అభిరుచియుండదు. నాటకపుకంపెనిలలో పాడెడు కీర్తన లకును, పద్యములకును చివరగావించెడి ఆలాపనయే సంగీతము క్రిందపరిణమించుచున్నది. ఇట్టి దుస్థితిలో కష్టపడి సంగీతవిద్య నభ్యసించినవారికి భుక్తియు ముక్తియు, దొరకుట కడుదుర్లభమగుచున్నది. సంగీత విద్వాంసులుగూడ ఏపాప్సీమెట్లలో నాల్గింటిని సంపాదించి ప్రజలను రంజింపచేయవలసివచ్చుచున్నది. గాన కళ ఇట్టిదైన్యస్థితియందున్నపుడు చిత్రకళలను పునరుద్ధరింప గోరువారందరును తగిన కృషిసలుపవలయును. దశరాసమీపించుచున్నది గావున ఆంధ్రమహాజనులెల్లరును తమతమ పట్టణములలో గానసభలనుగావించి ఈకళకు ఎక్కుడు ప్రోత్సాహ మొసగుటత్యంతవసరము."

—గాలి సుబ్బరామయ్య.

శారదా చట్టము ;—

"భారతశాసనసభలో హరవిలాసశారదాగారు హిందూసంఘమునగల అతిబాల్యవివాహదురాచారమును అంతరింపచేసి, సంఘమును ఉద్ధరించుటకై ఒక చట్టమును ప్రవేశపెట్టుటయు, అదిఎన్నియో గండములుదాటి తుదకు చట్టరూపమును దాల్చుటయు ఎల్లరునుఎరింగిన విషయమే. ఈచట్టము అమలులోనికి రాకముందే అతి ఆతురతతో, అమితమగు హడావిడితో, సనాతనధర్మపరాయణులగు తలిదండ్రులుకొందరు తమయొక్క మూడుమాసముల బాలికలకుకూడ ఎవరినోకొందరిని వరులనుసంపాదించి, వేలకువేలు కట్నములిచ్చి, వివాహ ములను గావించిరి. వారు అటులగావించుటకు అవసరము ఇందుకేని ఇప్పటిపరిస్థితులను బట్టిచూచిన కాన్పిం చదు. ఏమన శారదాచట్టము అమలులోనికివచ్చి చాలకాలమైనను అతిబాల్యవివాహములు యథావిధిగా దేశ మందంతటను అన్నిసంఘములయందును నిరంతరాయముగా కొనసాగుచునేయున్నవి. వానిని ఆపుటకు శార

దాచట్టమునకు శక్తిచాలకున్నది. ఏమన ఆచట్టమును ధిక్కరించు ప్రజలకు విధింపబడు శిక్షానిబంధనలు ఏమాత్రమును కఠినముగ లేవు. వేలునులక్షలును వ్యర్థముగావించి, వివాహములను గావించు హైందవ తలిదండ్రులు అతిబాల్య వివాహములను తమపిల్లలకుగావించి, ఏక లెక్చరుచేతనో పది లేక పాతిక లేక ఏబదిరూప్యములు మాత్రము జరీమానా విధింపబడినచో, ఇదియును ఒక బాజాభజంత్రీల ఖర్చుఅని భావించుకొని జరిమానాలు సులభముగా చెల్లించి వైచుచున్నారు. ప్రభుత్వమువారు శారదాచట్టనిబంధనలను తీవ్రముగా అమలులోనికి పెట్టకున్నారు. వారికి శాసనోల్లంఘనఉద్యమమును అణచివైచుటకు ప్రయత్నించుటతోడనే కాలముగడచుచున్నది. ఈవిషయమునవారు ఏమియుశ్రద్ధవహింపకున్నారు. సంఘమునందు అతిబాల్యవివాహదురాచారముయొక్క దుర్గుణములను చెడుగులను ప్రజలు అంతమందియుగాకున్నను అధిక సంఖ్యాకులైనను బాగుగాగ్రహించియున్నచో యీదురాచారము చట్టముయొక్క అవసరములేకనే చాలకాలముక్రిందటనే అంతరించియుండెడిది. కాని సంఘమున ప్రజలలో ఇంకను సనాతనధర్మమును పూర్వాచారములను ఎంత చెడుగులైనను ఎంతహానికరమైనను విడనజాలక, విడిచినచో, ఇహపరములకు దూరమైపోదుమని భయభ్రాంతులతో, కూపస్థమండూకములవలె కొట్టుకొనువారు అధికముగ గలరు. కావుననే ఈదురాచారమును సులభముగ అంతరింపజాలకున్నది. పూర్వాచారపరాయణులతో సమానసంఖ్యగల సంఘసంస్కరణాభిలాషులునుగలరు. శారదాచట్టమును అమలులోనికి తీసుకొనిరావలెనని సంఘసంస్కర్తలగు స్త్రీలు పురుషులుగూడ ఆకాలమందు పత్రికలలో వందలకొలది వ్యాసములను వ్రాసియు, వేలకొలది బహిరంగసభలలో నుపన్యసించియు తీవ్రమగు ఆందోళనమును గావించిరి. కాని శారదాచట్టము చట్టరూపమునుదాల్చి అమలులో పెట్టబడినపిమ్మట సంఘసంస్కర్తలు తమకర్తవ్యము అంతటితోముగిసెనని, ఇపుడు విశ్రాంతిగైకొనుచున్నారని భావింపవలసి వచ్చుచున్నది. వారికర్తవ్యమును వారుసరిగా గ్రహించినటుల దోపకున్నది. ఇదిచాలవిచారకరమగు విషయము. సంఘసంస్కర్తలు దేశమునందు ఎల్లచోటలను విజిలెన్సుకమిటీలను ఏర్పరచి, అతిబాల్యవివాహములను గావించెడి ప్రజలపై వెంటనే కేసులను పెట్టుచును, సంఘమునందు ఈదురాచారమును తొలగించుటకు అవసరమగు బోధమును ఉపేక్షవహింపక నిరంతరాయముగసలుపవలెననియు, తన్మూలమున సంఘమును ఉద్ధరించవలెననియు కోరుచున్నాను."

—జోస్యుల లక్ష్మీనరసమాంబ.

## డైరి

### ఆగస్టు

22:—కలకత్తా. ఆర్యసమాజపుహాలులో శ్రీమతి సందమణిమెహతాగారి అధ్యక్షతక్రింద జరిగిన స్త్రీల ప్రత్యేకసభలో పండిత మదనమోహనమాలవ్యాగారు ఉపన్యసించిరి.

23:—కైలాసపట్టణము. విశాఖపట్టణమండల రాజకీయసభలు, శ్రీమతి పేకుమళ్ల బుచ్చిరామయ్యమ్మగారి, అధ్యక్షత. అధ్యక్షురాలితోబాటు ఈ క్రిందిస్త్రీల అరెస్టు: శ్రీమతులు మాలా వెంకమాంబ; శిష్ట్లా లింగమ్మ, గాదె సత్యనారాయణమ్మ, మిన్నల లక్ష్మీనరసమ్మ, మిన్నల శేషమ్మగార్లు.

:—తెనాలితాలూకా రాజకీయ మహాసభాధ్యక్షతవహించినందుకు అరెస్టుచేయబడిన కంభంపాటి సత్యనారాయణ ఎం. ఏగారిసతి శ్రీమతి మాణిక్యాంబగారికి 6 మాసములవిడిఖైదు, బి. క్లాసు.

:—లాహోరు. శ్రీమతులు అమర్కౌరు, అద్వేషకుమారి, (లాలాపిండిదాసు రెండవతనయ), కృష్ణకుమారి జసోదకుమారి (గోవిందరాము కుమార్తెలు) గార్లు నలుగురు యీమధ్యనే జైలునుండి విడుదలైరి. వీరిని బడామిబాగుస్టేషనుదగ్గర రైలుబండి అలారంగొలుసులాగి రైలునాపినందులకు అరెస్టుచేసిరి. వీరు ర్యాల్పూరులో రాజకీయ కాన్ఫరెన్సుకుహాజరై లాహోరుకు మరలివచ్చుచు దారిలో నీపనిని చేసిరి. వీరిని రైల్వేపోలీసులాకప్పులో నుంచిరి.

:—బొంబాయి. బొంబాయి కమిషనరుఉత్తరవు నుల్లంఘించి బొంబాయిలో ప్రవేశించినందుకు మీరాబెనుగారు (స్లేడుకన్య) నేడు మజగోవాసుపోలీసుకోర్టులో ఖైరాజాగారిచే ఏడాదివిడిఖైదు విధింపబడిరి. మీరాబెనుగారు నవ్వుచు శిక్షస్వీకరించిరి.

24:—రాజమండ్రి. శ్రీయుత తల్లాప్రగడ ప్రకాశరాయుడు ఎం. ఏ. గారిని సెంట్రలుజెయిలులో చూచుటకు వారిభార్య శ్రీమతి వెంకాయమ్మగారు అనుమతికోరగ నిరాకరింపబడెను.

:—బాలసోర్. ఉత్కళ కాంగ్రెసుసంఘునియంత్రి శ్రీమతి సుభద్రాదేవిగారికి 3 నెలలుశిక్ష, కాంగ్రెసు శాంతిసైనికురాండ్రగు శ్రీమతులు ఫుల్ మానదేవి, సరస్వతీదేవి, ఇందుమతీదేవిగార్లకు రెండేసినెలల కఠినశిక్ష, నారీ ఆశ్రమముపై దాడిచేసినందులకు శ్రీమతి మైనాబీబీగారికి మరియైదుగురు స్త్రీలకు వాలుగేసినెలలచొప్పున కఠినశిక్ష.

25:—సంబల్పూరులో కాంగ్రెసుప్రచారమునకై శ్రీమతి సరళాదేవిగారు అరెస్టుచేయబడిరి.

:—వేలూరు. హిందూయువజనసంఘభవనమున స్త్రీల ట్రెయినింగుస్కూలు హెడ్ మిస్ట్రెసును మిస్. కావేరీబాయిగారి యధ్యక్షతనుజరిగిన స్త్రీలసభలో శ్రీమతి మాలతిపట్వర్ధను గారు ఉపన్యసించిరి.

:—మదరాసు. శ్రీమతి అచంట రుక్మిణమ్మగారు వేలూరుస్త్రీల చెరసాలనుండి విడుదలచేయబడి మదరాసు వచ్చిరి.

26:—మీరటు. న్యాయవాదియగు జ్యోతిప్రసాదుగారిభార్య శ్రీమతి విద్యావతిదేవిగారు ఏతరగతిఖైదీకి జబ్బుగానుండుటచే వైద్యపరీక్ష గావింపబడెను.

27:—అలహాబాద్. బాయికాట్ డే సందర్భమున ఊరేగింపుచేసినందులకు శ్రీమతి కమలాదేవిశర్మసతి అరెస్టుచేయబడెను.

:—నెల్లూరు. శ్రీమతి ఓరుగంటి మహాలక్ష్మమ్మగారు నెల్లూరుజయిలునుండి విడుదలపొందివచ్చిరి.

28:—సర్వసిద్ధి తాలూకాకు ఎలమంచిలిఫిర్కానుండి శ్రీమతి గుబ్బల యెరికమ్మగారు యువతులకు ప్రత్యేక స్థానమునకు ఎన్నుకొనబడిరి.

:—రాజమండ్రి లేడీస్ క్లబ్బు స్త్రీసమాజములపక్షమున హిందూసమాజభవనములో శ్రీమతి మాలతీపట్వర్ధను బి. ఏ. గారు "సంఘసంస్కరణావశ్యకత" అను విషయమునుగూర్చి ప్రత్యేకముగా స్త్రీలకొఱకు ఉపన్యసించిరి. శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవికన్య ఎం. ఏ. బి. యస్. సి (లండను) ఎఫ్. సి. ఎస్. గారు అగ్రాసనాధిపత్యము వహించిరి.

29:—ధార్వార్. ఫుల్లరి ఈయనందులకై ఒకనిగేదను ప్రభుత్వమువారు జప్తుచేసి వేలముపాడిరి. ఒకడు కొనెను. ఈబర్రెనువిడిపించుటకు శ్రీమతి మహాలక్ష్మీదేవి సత్యాగ్రహముచేయగా ఆమెకు 6 నెలలు శిక్ష, 100 రూపాయలు జరిమానావిధించిరి. జరిమానాకై 35 రూపాయలవిలువగల చరాస్తిని జప్తుచేసి 7 రూపాయలకును, 6 రూపాయలవిలువగల తప్పాలాలు జప్తుచేసి రు. 1-2-0 కు రసీదుయిచ్చిరి.

:—బొంబాయి. స్పెషల్ పవర్సు ఆర్డినెన్సుక్రింద శ్రీమతి కిషన్ దుమల్ కర్ కన్యగారికి అరెస్టు.

30:—సిమ్లా. వైస్రాయిగారి భవనమున లేడివెల్లింగ్డను ప్రభువుగారు ఘోషాస్త్రీలకు విందుసలిపిరి. 250 మందిస్త్రీలు విందుకువిచ్చేసిరి.

:—ధర్మవరము. శారదాచట్టముక్రింద పెండలిజాల్మానాలు వధూవరుల తలిదండ్రులకును, కార్యనిర్వాహకునికిని చెరి 30 రూపాయిలవంతున కలక్టరుగారిచే విధింపబడెను.

:—కటకం. శ్రీమతులు గౌరీదేవి, హరిమణిదేవిగార్లకు మూడేసినెలలు కఠినఖయిదు విధింపబడెను.

:—లోమ్లక్. నంది గ్రామసభాధ్యక్షురాలగు శ్రీమతి చికన్ బలాజానాగారు అరెస్టుచేయబడిరి.

:—జక్కూ. కార్తకపూరు యూనియన్ కోర్టును పికెటుచేసినందుకు డోహార్ కాంగ్రెసు కమిటీనియంత్రి శ్రీమతి కనకప్రోవారామ్ గారును, మనోహసినీబానుగారును; శ్రీమతి సునీతికార్ గారును అరెస్టుచేయబడిరి.

31:—ఆరవనాటకములలో సుప్రసిద్ధయగు శ్రీమతి సుందరమ్మగారిపై తేబడినకేసు కుంభకోణము సబు మేజస్ట్రీటు కొట్టివేసెను.

:—పండిత మోతీలాలు నెహ్రూగారి రెండవకుమార్తెయగు శ్రీమతి కృష్ణానెహ్రూకన్యగారికి ఆరోగ్యము కలిగినటుల లక్నోజయిలువార్త.

:—ఢక్కా. మనుమువాటి యూనియన్ కోర్టును పికెటుచేసినందులకు శ్రీమతి సునీతిబిలాకార్ శ్రీమతి కనకప్రోవరాయ్, శ్రీమతి మనోహాసినీ బానుగారలకు రెండునెలలు కఠినశిక్షలు విధింపబడెను.

:—కలకత్తా. క్లయివువీధిలో ఉత్సవముజరిపినందుకు శ్రీమతి లావణ్యప్రభచందగారు శ్రీమతి సావిత్రీదేవిగారు మరినల్గురు స్త్రీలును అరెస్టు చేయబడిరి. నాలుగేసినెలల కఠినశిక్ష.

:—అవనిగడ్డ. శ్రీమతులు జజ్జా వీరరాఘవమ్మ (పురిటిగడ్డ) గుత్తికొండ సీతమ్మ (చినకళ్లేపల్లి) కొల్లిపర సీతమ్మ వెరసీతమ్మ (యార్లగడ్డ) వల్లభనేని అన్నపూర్ణమ్మ (భట్లపెనుమర్రు) గార్లు చెరిఏడాది కఠిన శిక్షలు పొందిరి.

:—మదరాసు. పెనిటెన్షియరీ జయిలునుండి శ్రీమతి కూరాడ దుర్గాంబగారు (నందివెలుగు) శ్రీమతి వట్టికొండ హనుమాయమ్మగారు (వీరులపాడు) శ్రీమతి యలవర్తి ప్రసూనాంబగారు విడుదల చేయబడిరి.

## సెప్టెంబరు

1:—శ్రీమతులు పాతూరి రాఘవమ్మగారు (నగరం) కొల్లి నాగభూషణాంబ (నల్లూరు) వాదర్ల సీతారామమ్మ (గుర్తావారిపాలెం) ఆరేసిమాసముల చొప్పున కఠినశిక్ష (సి) తరగతి ఖైదు ననుభవించి మదరాసు పెనిటన్షియరీనుండి విడుదల చేయబడిరి.

2.—అలహాబాదు. బహిష్కరణదినమున ఊరేగింపు జరిపెనను నేరముపై శ్రీమతి యస్. పి. శర్మసతికి 200 రూపాయిల జరిమానా, లేక 6 వారములు కఠినశిక్ష విధింపబడెను.

:—అలహాబాదు. శ్రీమతి ఎ. జి. థామస్ గారిని ప్రభుత్వమువారు మైన్‌పూరిజిల్లా మేజస్ట్రేటుగ నియమించిరి. వీ రిదివరలో మైన్‌పూరి గౌరవమేజస్ట్రేటులుగ నుండిరి. వీరు ప్రత్యేకముగా పిన్నవయస్కులగు నేరస్థులనే విచారించెదరు.

3:—గుంటూరు. ఆకుల వరదరాజానకును, చెమిడీగంటి వెంకటరాముడు నితంతుపుత్రికకును బెజవాడ కనకదుర్గాలయమున వివాహముజరిగెను.

4:—ఢిల్లీ. స్వామిశ్రద్ధానందుగారికోడలు చంద్రవతిగారు మరియైదుగురుస్త్రీలు గాంధిదినము సందర్భమున ఘంటస్తంభమువద్ద సభచేయుచుండగ అరెస్టుచేయబడిరి.

5:—తిరువాన్కూరు. జూనియరుమహారాణిగారు, ఆమెకుమార్తెయు యూరపుయాత్ర ముగించుకొని విక్టోరియాఅను స్టీమరుపై వచ్చిరి.

:—బొంబాయి. జవ్హరిలాలునెహ్రూగారి సతియగు కమలానెహ్రూగారు స్వదేశీప్రదర్శనోత్సవవారమునకు ఉపక్రమణోత్సవము జరిపిరి.

6:—సికింద్రాబాదు. గతసంవత్సరము కల్లంగడుల పికెటింగు నారంభించి శిక్షపొందియుండిన శ్రీమతి కొమ్మూరి శేషమాంబగారిని హనుమకొండయందు రక్షకశాఖవారు బంధించి, రాష్ట్రమును ప్రవేశింపరాదను నిషేధపుటాజ్ఞను ఉల్లంఘించెనను నేర మారోపించిరి. అభియోగము విచారణకు రాగా, అట్టియాజ్ఞ రాష్ట్రమునకల బ్రిటిషుప్రాంతముల అధికారవర్గమువారు నొసంగియుండుట సత్యమే కాని, శ్రీనిజాము ప్రభుత్వమువా రట్టి యాజ్ఞ నొసంగలేదని శ్రీ శేషమాంబగారు విన్నవించుకొనిరి. జామీనుమీద నామెనువదలి విచారణమునకు వాయిదావేసియున్నారు.

6:—విశాఖపట్టణము. విజయనగరము వాస్తవ్యులగు శ్రీమతులు మూలా వేంకమాంబగారు, జేకుమళ్ల బుచి రామయ్యమ్మగారు, రేవుపాళ్యం శ్రీమతి గాది సత్యనారాయణమ్మగారు, ఎలమంచిలితాలూకా దిమిల గ్రామస్థులగు శ్రీమతులు మిన్నల లక్ష్మీనరసమ్మగారు, నిష్ఠల లింగమ్మగారు శిక్షింపబడిరి. ఇందు మిన్నల లక్ష్మీనరసమ్మగారికి 4 నెలల విడిఖైదు, వేయిరూపాయల జరిమానా. జరిమానా చెల్లింపనిచో మరియొక నెల విడిఖైదు. మిగిలినవారికి చెరినాలుగునెలలు విడిఖైదు, 200వందల రూపాయిల జరిమానా, జరిమానా చెల్లింపనిచో మరొక నెల విడిఖైదు. శ్రీమతి మిన్నల శేషమ్మగారు అనునామె క్షమాపణ తెలిపినందున విడుదలగావింపబడిరి.

7:—విక్రమపూరులో జాతీయోద్యమమునందు పాల్గొనిన ప్రథమముస్లిము స్త్రీ ఫుల్ బహార్ బీబీఅను ఒక మహమ్మదీయ స్త్రీ మున్షిగంజిలో కోర్టులేచువరకు, జైలులో నుండునట్లుగా శిక్షవిధించిరి.

:—కటకం. సరళాదేవిగారిని బాగల్ పూరు జైలునకుమార్చిరి.

:—కటకం. అక్రమసంఘసభ్యులుగా నున్నందులకుగాను శ్రీమతి వసంతాజేటకి మరికొందరు స్త్రీవాలంటీర్లకు 6 వారముల కఠినశిక్ష.

8:—వెల్లూరు స్త్రీల జైలునుండి శ్రీమతి తుమ్మల చంద్రమ్మగారు (బసవయ్యగారితల్లి) విడుదలపొందిరి.

:—కలకత్తా. బెంగాలురాష్ట్రీయకాంగ్రెసుసభ్యురాండ్రు శ్రీమతి వీణాపాణి, పాతదళభాషిణి సర్కారు, నీరజవలినీగార్లను క్లయివువీథియందు హారిసన్ రోడ్డునందు నిషిద్ధపత్రములను పంచిపెట్టినందులకు అరెస్టుచేసిరి.

:—మున్షిగంజి. ఊరేగింపు జరిపినందులకుగాను సుందరిదేవి, జగత్తాదేవి గార్లకు 143 ఐ. పి. సి. క్రింద ఒకదినము విడిశిక్ష.

9:—మదరాసు. అంజిలో సతి పైకేసు త్రోసివేయబడెను.

12:—కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠమున 'స్త్రీలు—సంఘసంస్కరణము' అను విషయమును గూర్చిన సభకు శ్రీమతి దామెర్ల కమలరత్నముగారు అధ్యక్షత వహించిరి.

13:—ఏలూరు. శాసనోల్లంఘనోద్యమము సందర్భమున కారాగృహశిక్షల పొందిన శ్రీమతులు భోగరాజు వీరవెంకమ్మ, ముడుంబ స్వరాజ్యలక్ష్మి, పత్తిరాజు మంగమ్మగార్లు విడుదలరైరి.

14:—కలకత్తా. జతీంద్రదాసు వార్షికోత్సవసందర్భమున రాధారాణీదేవి, ఏడ్గురులు స్త్రీలు క్లైవువీథిలో ఉత్సవము జరిపినందులకు 4 నెలల కఠినశిక్ష విధించబడిరి.

15:—

16:—

17:—తూర్పుగోదావరిజిల్లాబోర్డుకు రాజమండ్రి ఫిర్కానుండి స్త్రీలస్థానమునకు శ్రీమతి గాడిచెర్ల మంగమ్మగారు ఎన్నికొనబడిరి.

18:—బొంబాయి. స్త్రీలసభలో శ్రీమతి కమలానెహ్రూగారు అస్పృశ్యతతొలగింపవలెనని ఉపన్యసించిరి.

:—ఏలూరు. శ్రీమతి భోగరాజు వేంకటలక్ష్మమ్మగారి అధ్యక్షతక్రింద స్త్రీల ప్రత్యేకసభ.

19:—గుంటూరు. శ్రీమతి రాయసము రత్తమ్మగారి అధ్యక్షతను పౌర స్త్రీలసభ.

:—జనీవా. 'గాంధిగారు నిరశనవ్రతమువలన మృతినొందునట్టి దుస్థితి కలుగనున్నందులకు మేము చాల విచారించుచున్నాము'అని ప్రపంచమున శాంతిస్వాతంత్ర్యములను నెలకొల్పుట కిచటసమావేశమగుచున్న స్త్రీలఅంతర్జాతీయసంఘమువారు మేక్డొనాల్డుగారికి తంతివార్తనంపిరి.

:—కలకత్తా. చంద్రహారు గ్రామములో భగన్ రాజకీయసభ జరిగినది. అధ్యక్షురాలు శ్రీమతి వరుజాల ముఖర్జీగారు. అధ్యక్షురాలితోగూడ సుమారు 45 గురిని అరెస్టు చేసిరి.

20:—మహాత్ముని ప్రాయోపవేశదీక్ష ప్రారంభము.




## ప్రాయోపవేశ ప్రారంభము:—

మహాత్మాగాంధి ప్రాయోపవేశవార్త ఐరోపామహాసంగ్రామప్రారంభవార్త తరువాత ప్రపంచమును కలగుండుపెట్టినవార్తలలో నొకటి. ఆవార్తవినుటతోడనే ఎంతమంది చయితురాములు మూర్ఛపోయిరో? ఎంతమంది కమలాదేవులు అస్వస్థలైరో? ఎంతమంది కేలప్పనులు ఉపవాసదీక్షను గైకొనిరో? చెప్పజాలము. ఝంఝామారుతముచేవలె ఒక్కసారి భారతదేశము ఊగిపోయినది. సెప్టెంబరు 20–వ తేది సరిగా పంద్రెండుగంటలకు మహాత్ముని ఉపవాసదీక్ష ప్రారంభమైనది. ప్రారంభమునకు పూర్వము మహాత్మునకు మహాదేవదేశాయి నిమ్మరసమునందించినాడు. తా నాతని కార్యదర్శి. ఈవఱకు తానెన్నిసారులో ఆతని కిట్లుపానీయముల నందించియున్నాడు. కాని ఈమారు ఆమహాదేవుని కరములు పరిపాటియైనఆపనినిచేయుటలోనే వణకినవి. కారణమేమి? విశ్వామిత్రునిదీక్ష, భీష్మాచార్యుని పట్టుదలగల మహాత్ముడు ప్రాయోపవేశమునకు గడంగినాడు. ఇప్పుడు తానిచ్చు నిమ్మరసమే ఆ అవతారపురుషునకు తుది ఆహారమగు నేమోనని మహాదేవుని జంకు. ఆత్మత్యాగులగు టెరెన్సు మాక్స్వినీ, జతీంద్రదాసులచరిత్ర ఆతని మనోపథమున దట్టియుండును. ఇక చేయివణకుటలో ఆశ్చర్యమేమి? కాని నాఉపవాసమును ఉత్సవముగ పరిగణింపవలసినదని మహాత్ముడు చాటినాడు. తుదకది యొకఉత్సవమే అయినది.

## ప్రాయోపవేశ పరిసమాప్తి:—

సిద్ధసంకల్పుడై మహాత్ముడు ఉపవాసతేజమున తేజరిల్లుచున్నాడు. కడజాతివారు హరిజనులైరి. వారు హిందూజాతియందే లీనమగుదురు. ప్రభుత్వమువారును కొండదిగి వచ్చిరి. మంత్రిమాణిక్యుడు మేక్డొనాల్డు తలఊపక తప్పినదికాదు. సెప్టెంబరు 26–వ తేది సాయంకాలము అయిదుగంటలకు అస్తంగతుడగుచున్న సూర్యభగవానుడుసాక్షిగ మహాత్ముడు ప్రాయోపవేశదీక్షను వదలినాడు. విశ్వకవి రవీంద్రుడు గీతాంజలినుండి ముక్తకంఠముతో పదములుపాడినాడు. శ్రీమతి కమలానెహ్రూ రెండు తీయనిమ్మపండ్లనుకోసి ఒకగ్లాసులోనికి రసముపిండినది. శ్రీమతి కస్తూరిబాయిగాంధి ఆగ్లాసును కొద్దిగా వణుకుచున్న

చేతులతో మహాత్మున కందించినది. మహాత్ముని లీలలు అత్యద్భుతములు. ఆకారణమున పరివేష్టించి ప్రవర్తించువారికి వణకు. ఎట్టిదృశ్యము! మహాదేవదేశాయి, వల్లభాయిపటేలు బాలీసులై మహాత్ముని మంచముపై కూర్చుండబెట్టినారు. కమలానెహ్రూ సుకుమార మూర్తి పరిచారికయైనది. కస్తూరిబాయి సరేసరి. లోకమువారిమ్రొక్కులుగొను రవీంద్రుడు గాయకుడైనాడు. ప్రాయోపవేశదీక్ష పరిసమాప్తమైనది. దేవతలుచూడవలసిన దృశ్యము. ప్రపంచముపుట్టినతరువాత ఇట్టి కథనము నడచినదా? ప్రాయోపవేశప్రారంభమప్పుడు గాంధిచెంత ఇరువురు మిత్రులుండినారు. పరిసమాప్తిసమయమున ఎఱవాడచెఱసాల జనసముద్రమైనది. ఆజనసముద్రము ఉల్లోలకమనీయమగుటకు మహాత్ముడు రెండు నిమ్మపళ్లరసమును త్రాగినాడు. ముప్పదియైదుకోట్ల భారతీయుల ఆకలికడుపులు ఒక్కసారిగ నిండినవి.

**మహాత్ముని ఉపవాసము: ప్రపంచస్త్రీలు:—**

నానారాజ్యశాంతిస్వాతంత్ర్యస్త్రీసమితివారు జీనీవాలోకూడి ఈ ఉపవాసము మాన్ప రాజకీయ పరిష్కారముగావింప మేక్డొనాల్డుకు తంతివార్తనంపిరి. ఎలెన్‌విల్కిన్సను 'అస్పృశ్యులెల్ల గాంధిగారినే తమనాయకునిగా ఎంచుకొనుచున్నారు. అతనికోర్కెనెఱవేర్చుట వారికోర్కె నెఱవేర్చుట యగును' అని డెయిలీహెరాల్డు పత్రికలో వ్రాసినది. ఇండియాలీగుడెలిగేషనందు సభ్యురాలు మిస్ విట్లీకన్య ఏసుక్రీస్తే గాంధియై పుట్టినాడన్నది. శ్రీమతి సరళాదేవి చౌదరాణిగారు 'మహాత్మా! శతాబ్దములనాటి మౌఢ్యమును ఆత్మత్యాగమను అగ్నిపర్వతముచే కాల్చివేయుము' అని మహాత్మునకు వ్రాసినది. రౌండుటేబిలు ప్రతినిధిగా గాంధి లండనుపోయినప్పుడు ఆతనిబసయగు కింగ్సులేహాలుకు చెందిన ఎడావెస్టుకన్న 20 వ తేదీని ఉపవసించినది. కింగ్సులేహాలులోని స్త్రీలెల్లరు సమావేశమై గాంధిగారి ఆరోగ్యమునకై ప్రార్థనలునల్పిరి. ఇచ్చట మద్రాసుస్త్రీలును ఈవిషయమై పూర్తిదీక్షను వహింపకపోలేదు. స్త్రీప్రపంచమిట్లుమెలగి సమస్యాపరిష్కారమునకు సాయపడినందులకు సంతోషమగుచున్నది.

**ప్రజాస్వామికమునకిది ప్రబలనిదర్శనము:—**

ఉన్నతోద్యోగములకు బదలాయింపులైనపుడెల్ల విందులు జరిగించుట ఈ రోజులలో ఆచారమైయున్నది. ఈవిందులలో వారి ఉద్యోగబలమే హెచ్చుగనుండును. స్వల్పవేతనగల బంట్రోతులు మొదలగువారి బదలాయింపులకు విందులుండుట మనమీవఱకు విని యుండలేదు. ఈనడుమ ఎలమంచిలి పోస్టాఫీసులో మెయిల్‌ప్యూన్‌గా ఉన్న షేక్‌హుసేను సాహేబుగారికి అనకాపల్లి బదలీఅయిన సందర్భమున ఎలమంచిలి పోస్టుఆఫీసులో ఒక విందుజరిగినది. ప్రజాస్వామికదినముల కిట్టివిందులు వేగుజుక్కలు. ఈఆచారము ఇతర ప్రదేశములకు వ్యాపించుట కాంక్షింపదగినది.

**ఈ ప్రాయోపవేశ దీక్షయొక్క ఫలమేమి?**

రౌండుటేబిలుసభలో నావాక్యములకు గాంధి చెవియొగ్గియుండునేని ఇప్పటి ఈ అలజడియంతయు లేకుండెడిది అని అంబేత్కారుడు అనుచున్నాడు. నిజమే కావచ్చును. కాని ఈసమస్య అపుడే చల్లగ పరిష్కారమైయున్నచో దేశమున ఇపుడుజరిగిన ప్రబోధమునకు అవకాశమేలేకుండియుండును. దేశమిప్పుడు నిద్రావస్థనుండి జాగ్రదవస్థకు వచ్చినది. మహాత్ముని ఉపవాసమే ఇప్పట్ల మేఘగంభీరస్వరమున మేలుకొలుపు పాడినది. కలకత్తా, కాశీ, కరాచి, అహమ్మదాబాదు, లాహోరు, ఢిల్లి, బొంబాయి మొదలగుతావులయందు దేవాలయములు అస్పృశ్యులకు తెఱువబడి వారిని హరిజనులుగ నొనర్చినవి. యుగయుగముల నాటి ప్రాతయాచారములన్నియు విచ్చిపోవుచున్నవి. సంఘసంస్కర్తలు శతాబ్దముగ సర్వశక్తులు ధారపోసియు చేయజాలకుండిన పనిని మహాత్ముడు ఉపవాసబలముచే చేయగలిగినాడు. రౌండుటేబిలుసభలోనే ఈసమస్య పరిష్కారమగుచో దేశమున ఈ దివ్య ప్రబోధము జరిగియుండునా? ఉండదు. ఎఱవాడచెఱసాలలోని మామిడిచెట్టుక్రింద ఉపవసించి కూర్చుండి మహాత్ముడు చేసినపనిని లండనులో కేమ్సుభవనమున ఉపన్యసించి మహాత్ముడే చేయజాలకపోవును. ఈ ఉపవాసమునకు, ఈ ఎఱవాడచెఱసాలకు, ఈ మామిడి చెట్టుకుగలశక్తి ఆ ఉపన్యాసమునకు, ఆ లండను నగరమునకు, ఆ రాజభవనమునకు లేదు.

**ఆంధ్ర రాయబారము: రాజప్రతినిధి సందర్శనము:—**

తుదకు ఆంధ్రరాయబారము రాజప్రతినిధిని సందర్శించుననుశుభవార్త వినవచ్చినది. రౌండుటేబిలుసభలో ఆంధ్రరాష్ట్రప్రశంసదెచ్చిన ఆంధ్రమహాశయులును, మొన్నటి మదరాసు శాసనసభలో ఆంధ్రోత్కళసీమానిర్ణయమున నాయకత్వము వహించిన ఆంధ్రాభిమానులును అగు శ్రీ బొబ్బిలిమహారాజావారే ఈ రాయబారమునకుగూడ నాయకత్వము వహించుట సముచితముగనున్నది. ఆంధ్రవిభజనకు ఈ రాయబారము అరికట్టగలుగుగాకయని వాంఛింతుము.

**అగష్టు మాసపుసంచికలో:—**

'దాంపత్యము' అనువ్యాసము కర్రి సూర్యనారాయణరెడ్డిగారిచే వ్రాయబడినట్లు ప్రచురింపబడినది. అది పి. ఆర్. రామచంద్రరావుగారు రచియించినదని పాఠకులు గ్రహింతురుగాక!

**శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మగారి విజయము:—**

శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు గృహలక్ష్మిపాఠకులకు పరిచితురాలే. 'స్థానిక సంస్థలు: స్త్రీలు' అను విషయముపై ఈమెగృహలక్ష్మియందు వ్రాసినవ్యాసమును, వోటును గూర్చి ఈనడుమ ఆంధ్రపత్రికలో వ్రాసిన వ్యాసమును ఈమెవైదుష్యమును కొంతకుకొంత

వెల్లడించుచున్నది. ఈవిదుషి అనంతపురము జిల్లాబోర్డుసభ్యురాలుగా ఎన్నుకొనబడినదని వినుటకు ఆనందించుచున్నాము. ఇట్టి లోకజ్ఞులప్రవేశముచేతనే స్థానికసంస్థలయందలి స్త్రీల పలుకుబడి హెచ్చరిల్లును. శ్రీమతిగారికి మాయభివాదము లందిచ్చుచున్నాము.

**శ్రీమతి అన్నపూర్ణాదేవి పంచమవార్షికోత్సవము:—**

మహాత్ముని ప్రశంసలనంది దేశసేవాతత్పరురాలై ఆంధ్రస్త్రీప్రపంచమున కాదర్శప్రాయురాలై తనజీవితమును ధన్యతగావించుకొని స్వర్గమునలంకరించిన శ్రీ అన్నపూర్ణాదేవి పంచమవార్షికోత్సవము ఆశ్వయుజశుద్ధ చతుర్దశికి సరియైన 13-10-32 తేదీని అయినది. ఆనాడు ఆమెస్మారకసభలు ఆంధ్రజగతిని విరివిగజరిపి ఆపవిత్రమూర్తి వెలిగించిన ఆదర్శజ్యోతికి మ్రొక్కుబడులు చెల్లింతురుగాక యని ఆంధ్రమహాశయులను గృహలక్ష్మి హెచ్చరించుచున్నది.

**ఆంధ్రపితామహుడు:—**

అను ఈసంచికయందలి వ్యాసము ఆంధ్రాభిమానులకు ఆనందము గలిగింపగలదు. కోసలదేశపురాజకుమారి కౌసల్య, దశరథునిది కోసలరాజ్యము. కాగా దశరథునకు కౌసల్య వరుసకాదు. కాబట్టి వీరివివాహము ధర్మయుక్తమనుటకు కౌసల్య రాజ్యమునకు వేఱైన మఱియొక కోసలరాజ్యమునకు చెందినదై యుండవలయును. చారిత్రక నేత్రములకు కనిపించు అట్టి కోసలరాజ్యము దక్షిణకోశలమే. దానికే మహాంధ్రమని మఱియొక సుప్రసిద్ధనామము. అది ఆంధ్రులభూమి. మహాంధ్రమను మాఱుపేరుగల దక్షిణకోసలరాజ్యమునకు చెందిన దగుట కౌసల్య ఆంధ్రులయింటి ఆడుపడుచు. ఇట్లనుటచే లోకోత్తరపురుషుడగు రాముడు ఆంధ్రులయింటి దౌహిత్రుడగుచున్నాడు. ఈఆంధ్రులదౌహిత్రునకు ఆంధ్రజాతికి జనకుడగు విశ్వామిత్రుడు అస్త్రవిద్యాగురువు. ఊహాప్రేరితమైనను ఈచిన్నినాటిక ఆంధ్రవిద్యార్థులయందు ఆంధ్రాభిమానమును పూరింపగలదనుట నిక్కము. ఇట్టి వాఙ్మయసృష్టి మన ఈజాతీయ పునరుద్ధారణదీక్షాదినముల కెంతయు తగియున్నది.

**గృహలక్ష్మి ముఖపత్రచిత్రము:—**

శ్రీమతి దామెర్ల సత్యవాణిగారు చిత్రించియిచ్చినది. చిత్రకళయందు సిద్ధహస్తులైన కీ. శే. దామెర్ల రామారావుగారి సతీమణి ఈమె. చిత్రము గభీరభావముగలది. చదువ నేర్చిన స్త్రీ గృహలక్ష్మి. ఆమె చాలు బిడ్డలకుతప్పదు. యాదృశీమాతా తాదృశీపుత్రీ. చదువుకొనుతల్లినిచూచి బండిఈడ్చుటకూడమాని చిన్నికుర్రడు పలకబలపముపుచ్చుకొన్నాడు. ఎడపిల్లవాడు, పెద్దపిల్ల తల్లితోబాటు పుస్తకమునకే తమకన్నులనప్పగించినారు. తల్లు లీసందేశము నందుకొందురుగాక! ఈప్రశస్తచిత్రమును గృహలక్ష్మికి ప్రసాదించిన సత్యవాణిగారికి గృహలక్ష్మితరపున మాకృతజ్ఞతను నివేదించుకొనుచున్నాము.